# The stove that not only glows but glitters




# chetak

## Gas Stove

IS : 4246




**Highlights :**

* Perfectly Engineered.
* Swiss Technology Control Valve for Prevention of Gas leakage
* Plated Burner Tops  Rust free
* Better fuel efficiency
* Economically Priced

PRODUCT OF
JAINCO INDUSTRY
NEW DELHI

DISTRIBUTORS FOR ANDHRA PRADESH
MADICON INDO-INTERNATIONAL
1-10-197/4 First Floor, Ashok Nagar X Roads
Hyderabad 500 020 A P INDIA
Phone 61286 64757 Grams MADICON

MAYURA

ప్రసిద్ధి చెందిన హిందుస్థాన్ పెట్రోలియం, భారత పెట్రోలియం
మరియు ఇండియన్ గ్యాస్ డీలర వద కూడ లభించును.

# సిరిలాక్‌లో పాలు వుండనే వున్నాయి—




దీనిని నీటికి కలపండి
రుచికరమైన...



సంపూర్ణాహారం
సిద్ధమయింది!




సిరిలాక్‌ని గోరు వెచ్చని, ముందుగా మరగ బెట్టిన నీటికి కలపండి. అంతే, మీ పాప ఆహారం సిద్ధం అయినట్లే. అందులో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు పంచదార సరియైన పాళ్ళలో వుండడంతో సిరిలాక్ రుచికరమైన సంపూర్ణ పోషకాహారం.

మి పాపకి 4 నెలల ప్రాయం వచ్చేసరికి, పాపకి సిరిలాక్ ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్ ఇవ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®

ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సిరియల్

NESTLÉ®

SAA/FSL/C/2834 TEL

## సూపర్‌స్టార్

డేరింగ్ అండ్ డాషింగ్ హీరో, సూపర్ స్టార్ నటశేఖర కృష్ణ ముఖచిత్రం మమ్మల్నెంతో ఆకర్షించింది. ఇకముందు కూడా ఇటువంటివి ప్రచురించమని కోరుతున్నాం.

గంటా గిరిధర్‌రెడ్డి, ఇతరులు (బరంపురం)

## న్యూఢిల్లీ లేఖ

ఇటీవల కార్ల్‌మార్క్స్‌పై వచ్చిన వ్యాసం నన్నెంతో బాధ పెట్టినది అది మార్క్సిజం సిద్ధాంత చర్చ కాకుండా దూషించే స్థాయికి చేరటం వాస్తవాలను వక్రీకరించటం దురదృష్టకరం ఈ వ్యాసకర్త అయిన డా॥ జయ్‌దుభాషీ గారికి రాజకీయపరమైన ప్రాథమిక విజ్ఞానం కూడా లేదనిపించింది. ఈ రోజున ప్రపంచ ప్రజల అభిమానాన్ని అత్యధికంగా చూరగొని, 31 దేశాలు ఆ వెలుగులో వెళ్తున్న సిద్ధాంతంపై ఈ విధమైన ప్రచారంవల్ల వ్యాసకర్త కోరుతున్న ప్రయోజనం నా కర్థం కాలేదు మార్క్సిజం సిద్ధాంత ప్రాచుర్యాన్ని అన్నివిధాలైన సిద్ధాంతకారులు, రాజకీయవాదులు గుర్తిస్తున్నారు సోషలిస్ట్ దేశాల ప్రగతిని (ప్రాథమికావసరాలను తీర్చుటలో, జీవన ప్రమాణాలను పెంచుటలో) ప్రతి ఒక్కరూ గుర్తిస్తున్నారు, ఆదరిస్తున్నారు ఈ తరుణంలో ఇలాంటి వ్యాసం రావటం విచారకరం

చంద్రశేఖర్, డి (కాకినాడ)



డా॥ జయదుబాషిగారి న్యూఢిల్లీ లేఖ ''అభివృద్ధి పేరుతో పేదలకి అన్యాయం'' చాలా బాగుంది

శశిధర్ (రామగుండం)

## ముగింపు

''అతడు అడవిని జయించాడు'' సీరియల్ ముగింపు అద్భుతంగా ఉన్నది ''ఎంత విచిత్రం! రూపురేఖలు కలిగిన దేహం చలన రహితంగా పడివుండగా, రూపురేఖలు లేని మనసు పచ్చిక మైదానంలో సీతాకోకచిలుకవలె ఎగురుతూ ఉన్నది !'' అనీ ''ప్రయత్నం విఫలమైనా 'ఇది నా చివరి రోజు కాదు !' అనుకున్నాడతడు '' అనీ మానవత్వానికీ మానవ జీవితానికీ వ్యాఖ్యాన ప్రాయంగా, గొప్ప సందేశంతో ముగిసింది నవల ఇంతటి విశిష్టమైన రచనని వారపత్రిక ద్వారా అందించి సాహిత్యపు విలువల్ని నిలబెట్టినందుకు సంపాదకులకు హార్దికాభినందనలు రచన హెమింగ్వే 'ఓల్డ్‌మాన్ అండ్ ది సీ' నవలను గుర్తుకు తెచ్చింది డా॥ కేశవరెడ్డి కలం నుంచీ మరెన్నో చక్కని నవలలు రావాలని ఆశిస్తున్నాను

ఆర్ ఎస్ సుదర్శనం (రాజమండ్రి)



## మనవి

కొంత కాలం కింద ఆంధ్ర సచిత్ర వార పత్రిక నిర్వహించిన విద్యార్థి లోకం వ్యాస రచన పోటీలో పాలుగొన్నవారందరికీ కానుకలు పంపే ఏర్పాటులు చేశాము చిరునామాలు మారటంవలన, ఇతర కారణాలచేత కొందరికి ఇవి చేరటం ఆలస్యం అవుతోందని తెలుస్తోంది

పోటీలో పాలుగొన్నవారు తమ చిరునామాలు మారితే మాకు తెలుపుతూ రాయగోరుతున్నాము

— సంపాదకుడు

## అవగాహన ఉంది

''ఇన్‌క్రెడిబుల్ గాడెస్'', ''స్మశానం దున్నేరు'' నవలలద్వారా అట్టడుగు జీవితాల్ని యదార్థంగా చిత్రించిన డాక్టర్ కేశవరెడ్డి ''అతడు అడవిని జయించాడు'' సీరియల్‌తో మరో మెట్టు పైకెక్కారు కళాత్మకమైన కధనంతో, విలక్షణమైన ఈ సీరియల్ శైలి కొత్త పంథాలో నడుస్తోంది సాహితీ పిపాసతో గొంతుకలెండిపోయిన పాఠకలోకానికి కేశవరెడ్డి గారి అడవి దప్పిక తీరుస్తుంది అవగాహనగల వాస్తవిక చిత్రకల్పన ''అతడు అడవిని జయించాడు ''

విజయగోపాల్, సురేందర్‌రెడ్డి (మెదక్)

## హైదరాబాద్ నోట్ బుక్

20-5-1983 ఆంధ్ర సచిత్ర వార పత్రికలోని ''హైదరాబాద్ నోట్ బుక్''లో ''మానవ కల్యాణ దర్పణం'' అనే పుస్తక రచయిత శ్రీ మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు గారు ''ఎందరినో శుద్ధిచేసి ఆర్య మత దీక్ష ఇచ్చిన సంఘ సంస్కర్త'' అని తిరుమల రామచంద్రగారు వ్రాసినారు

నిజమునకు ఆర్య మతమనునది ఎచ్చటను లేదు ఆర్య సమాజము వైదిక (హిందూ) మతములో గల లోటు, పాట్లను సరిదిద్ది, ఇ మత గ్రంథములకు వేదములను సర్వ మానవులకు అందుబాటులో యుంచుటకును, విశ్వమానవ కల్యాణము కొఱకును పాటుపడుచున్నటువంటి సంస్థ అట్టి సంస్థను శ్రీ తిరుమల రామచంద్రగారు ఆర్య మతమనెడి పేరుతో వ్రాయడము హాస్యాస్పదముగాయున్నది

చంద్రగిరి యెల్లయ్య (సికిందరాబాదు) ★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం 22–7–'83
రుధిరోద్గారి నామ సం ఆషాఢ శు త్రయోదశి
సంపుటము 75 సంచిక 47
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-50
ఆరు మాసాల చందా రు. 42-90
పోస్టులో ఏడాది చందా రు. 85 80

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం· విజయవాడ-520 003·


## విషయానుక్రమణిక



### లోకంపోకడ * డిరిమెన్












# యూరోపు వెళ్లివచ్చి శ్రీమతి గాంధీ సాధించినదేమిటి?




మీరు ఏ ఇంగ్లాండులోనో, అమెరికాలోనో వార్తాపత్రికలు చదివారనుకోండి — శ్రీమతి గాంధీ రెండు వారాలపాటు యూరోపు తిరిగి వచ్చారని కాని, ప్రపంచ రాజకీయాలలో (యూరోపు రాజకీయాలలోకూడా) ప్రాముఖ్యం లేని నాలుగయిదు దేశాలు పర్యటించారని కానీ మీకు తెలియనే తెలీదు. శ్రీమతి గాంధీకి ఇదొక అనవసరమయిన విలాస యాత్ర. ఆమె సపరివారంగా వెళ్లారు కాబట్టి ఈ యాత్ర కర్చు రు. 10 లక్షలు అయి ఉంటుంది. ఇదంతా ప్రపంచ జనానికి అనవసరం అందుకనే విదేశ వార్తాపత్రికలలో దానిని గురించి అంత తక్కువగా ఉంటుంది ఆమె ఇక్కడా అక్కడా మాటలాడిన దానిలో కొత్త ఏమీలేదు సరిగదా ఆమె చెప్పినదంతా పడికట్టు పదాలమయం. వాటిని ఆమె ఎప్పుడూ వల్లిస్తూనే ఉంటారు

ప్రధాన మంత్రి ప్రసంగాలని రాసిపెట్టే వాళ్లుంటారు పోనీ వాళ్లనయినా మంచివాళ్లని వేసుకోవచ్చుకదా, అంటారు కొందరు. నిజమే, పాపం — రాతగాళ్లు బాగా అలిసిపోయి ఉండాలి ప్రతిరోజూ అవే పాత మాటలు, అవే అర్థంలేని నినాదాలు, అవే అసత్యాలు రాసి పెట్టమంటే వాళ్లు మాత్రం అలసిపోరూ ? వాళ్ల రాతలలో ప్రత్యేకత ఏముంటుంది ? అసలు ప్రత్యేకత అన్నది ఎలాగ ఉంటుంది ? అందుకనే శ్రీమతి గాంధీ ప్రసంగ రచయితలలో ఒకరు ఇతరుల ప్రసంగాలలో నుంచి దొంగిలించటం మొదలుపెట్టాడు మొదలుపెట్టాడు బాగానే ఉంది కాని ఎంతకాలం పట్టుపడకుండా ఉండగలడు ? చివరికి అంతపనీ జరిగింది. ఇప్పటి వాళ్లేమి చేస్తున్నారో దేవుడికే తెలియాలి చీనా, రష్యాల నుంచి వెలువడే ప్రసంగాల నుంచి తస్కరిస్తున్నారేమో. ఇలాగ చేస్తే వాళ్లని పట్టుకోవటం కష్టం — చీనా, సోవియెట్ ప్రత్య వర్గాలవారికి తప్ప. ఇక వాళ్లకి ఒక ప్రధానమంత్రి ఇంత పని చేస్తున్నదంటే వినోదంగా ఉండదూ ? వినోదమే కాదు, గర్వంగా కూడా ఉంటుందేమో — తమలాంటి వాళ్ల మాటలని దొంగిలిస్తున్నారని.

ఇదంతా ముఖ్యం కాదు — శ్రీమతి గాంధీ చెప్పేదానిలో గుర్తు తెచ్చుకోతగినది ఏమీ ఉండదు ఇందులో ఆశ్చర్యపడవలిసినదీ ఏమీ లేదు ఆమె ఆలోచనల స్థాయి అంత మాత్రమే ఆమె ఇప్పటికి 15 సంవత్సరాలుగా (అంతేగా?) ఏదో చెబుతూనే ఉన్నారు కాని దానంతటిలోనూ ఒక్క చమత్కారం కాని, ఉదహరించ తగిన ఒక్క వాక్యం కాని ఉందా ? ఉన్నట్లు మీకు జ్ఞాపకం ఉందా ? ఉండదు. ఎందుకంటే, శ్రీమతి గాంధీ మాటలలో చెప్పుకోతగినది ఏదీ ఉండదు కనుక. నెహ్రూ ప్రసంగాలలో ఒకటి రెండు, చర్చిల్ ప్రసంగాలలో కొన్ని డజనులు, గాంధీగారి మాటలలో వందలు గుర్తుకి వస్తాయి. అమెరికా అధ్యక్షుడుగా ఉన్న ట్రూమన్ ఒకప్పుడు మిస్సవురీలో జవుళి అంగడి నడిపేవాడు ఆయన మాటలలో కూడా కొన్ని స్మరణీయమయినవి ఉండేవి. శ్రీమతి గాంధీ తాము స్విట్జర్‌లాండ్‌లో బడికి వెళ్లామనీ, కేంబ్రిడ్జిలో కాలేజికి వెళ్లామనీ అంటూ ఉంటారు. వెళ్లి ఏమి ప్రయోజనం. మాటలు మాత్రం అతి నిస్సారంగా ఉంటాయి

అత్యవసర పరిస్థితి తరువాత శ్రీమతి గాంధీ ఓడిపోయారు. కొత్త ప్రభుత్వంలో నాకు స్థానం కల్పించారు. పరిశ్రమల శాఖలో చేరమన్నారు నన్ను. ఒక సహాయ మంత్రి ఖాళీ చేసిన గది నాకు కేటాయించారు. ఆ పెద్దమనిషి చాలా హడావుడిగా పారిపోయి ఉండాలి ఇలాగ ఎందుకనవలిసి వస్తోందంటే, గదినిండా ఆయన కాగితాలూ, పుస్తకాలూ చిందరవందరగా పడి ఉన్నాయి. ఈ పుస్తకాలలో ఎక్కువ భాగం వట్టి చెత్త. అయితే, వాటిలోనూ నేను చూడదగినవి కొన్ని కనిపించాయి. అవి ఏమిటనుకున్నారు ? ఎమర్జెన్సీలో శ్రీమతి గాంధీ ఉపన్యాసాల సంకలనాలు. భలే ! అత్యవసర పరిస్థితిని విధించిన వ్యక్తి సాధారణ వ్యక్తి కాదు. హిట్లర్ తమ దేశం పార్లమెంటు భవనానికే నిప్పంటించినట్లు శ్రీమతి గాంధీ ఎమర్జెన్సీని విధించారు ఈవిడ ప్రసంగాలలో సాహిత్యపు విలువ ఉండి తీరుతుంది అనుకున్నాను. తీరా వాటిని చదివాక "అయ్యో" అనిపించిది. అవన్నీ మామూలు ప్రభుత్వ ప్రచారం అంత జిడ్డుగానూ ఉన్నాయి అసలు అవి ప్రభుత్వ ప్రచార వ్యాసాలే కదా ? ఒక మహిళ తమ చర్యలని సమర్థించుకునేందుకు రాసినవి అవి. కాని, వాటిలో గోబెల్స్ గడసరితనమూలేదు, లార్డ్‌హాహా అటకాయింపూ లేదు. ఆ పుస్తకాలని పాత కాగితాల వాడికి తూకం వేసి అమ్మించాను

శ్రీమతి గాంధీకి కావలిసినది ఒక్కటే — అధికారం అధికారం కలవారు గొప్ప సాహిత్యం సృష్టించాలని ఎక్కడా లేదు. స్టాలిన్, హిట్లర్‌లు ఈ యదార్థాన్ని తెలుసుకో గలిగారు అధికారం చెయ్యగలిగినదల్లా సాహిత్యాన్ని దిగజార్చటమే అధికారాన్ని ఎదిరించే వారు సాధారణంగా బాగా రాయగలుగుతారు ఉదాహరణకి జవహర్‌లాల్ నెహ్రూ స్వాతంత్ర్యానికి ముందు రాసిన దానితో 1947 తరువాత ఆయన రాసినదంతా పోల్చి చూడండి — మీకే తెలుస్తుంది పాత పుస్తకాలని ఇంకా చదివేవాళ్లు ఎందరో ఉన్నారు వీటిలోనూ వ్యుత్పత్తి అంతగా కనిపించదు కాని నెహ్రూ ఇతరుల భావాలని బాగా గ్రహించి వాడగలిగేవారు అంతమేరకి ఆయన ఈ రచనలు చదివిస్తాయి ప్రధానమంత్రి అయిన అనంతరం ఆయన రాసినదంతా నిలిచేదికాదు ఆయన నిర్మిద్దామనుకున్న భారతదేశం ఒక వెలిసిపోయిన పాశ్చాత్యదేశాల ప్రతిబింబం లాంటిది మనం ఉక్కు కర్మాగారాలు, విద్యుత్ కేంద్రాలు, ఆనకట్టలు నెలకొల్పటం ప్రారంభించాము అవన్నీ ఇతర దేశాలలో వాటి నమూనాలు ఈ అనుకరణని చూసిమురిసిపోవటం అల్పమనస్కులకే తగును ఇదంతా గొప్ప సృష్టి కాదు అందు చేతనే దానిని చూసి దేశంలో ఎంతోమంది ఉత్తేజితులు కాలేదు — వాటి ద్వారా లాభం పొందిన రాజకీయ వాదులు తప్ప

నెహ్రూ లాగే శ్రీమతి గాంధీ కొత్తగా ఏమీ చెప్పలేకపోతున్నారు చెయ్యలేకపోతున్నారు వారి సూచనలు, సేవ భారతదేశానికి పరిమితమయిలేదు, ప్రపంచానికంతటికీ పనికిరాగలవు అంటారు కొందరు ఇదీ నిజం కాదు నెహ్రూ తటస్థ విధానాన్ని ఒక క్రియాత్మకమయిన వాదంగా రూపొందించారు కాని, తటస్థ విధానాన్ని బలపరిచే వారిలో నేడు చాలామంది దుండగులూ, దోపిడీదారులూ ఉన్నారు జగ్రెబ్ (యుగోస్లావియా)లో శ్రీమతి గాంధీ ప్రపంచ వాణిజ్యం, ప్రపంచ సహకారాన్ని గురించి ప్రసంగించారు ఆవిడ ప్రసంగాన్ని ఏ సగటు బికామ్ గ్రాడ్యుయేటయినా రాసి ఉండగలిగేవాడు దానిని ఎల్. కె. ఝా రాశాడంటారు. ఇదే నిజమయితే నాకు ఆయనమీద జాలి వేస్తుంది అసలు ఎల్ కె. ఝా ఏనాడు విర్లి



ఓస్లోలో భారతీయుల అభినందనలని
స్వీకరిస్తున్న ప్రధాని శ్రీమతి గాంధి

బ్రాంట్ మేళంలో చేరాడో ఆనాటి నుంచీ ఆయనమీద నాకు జాలిగా ఉంది మనలాంటి బీదదేశాలని "మూడవ ప్రపంచం" అనటం పరిపాటి అయిపోయింది. ఈ మూడవ ప్రపంచానికి ఏ విధమయిన అస్వస్థత వచ్చినా భౌగోళిక సంస్థల ద్వారా భౌగోళిక చికిత్స ఏర్పాటు చెయ్యాలంటారు విల్లీ బ్రాంట్ వర్గంవారు. దీనివల్ల మన స్వాతంత్ర్యానికే ముప్పు శ్రీమతి గాంధీ జగ్రెబ్ వెళ్లి తమ శ్రోతమహాశయులతో "మూడవ ప్రపంచానికి మొదటి ప్రపంచం ఆసరా అక్కరలేదు, బీదలు ధనవంతుల మీద ఆధారపడనక్కరలేదు" అని చెప్పి ఉండాలి. ఇలాగ మాట్లాడి ఉంటే వాళ్ల బుర్రలకి కొంత పని కలిగేది. విల్లీబ్రాంట్, ఎల్ కె. ఝా లాంటి వాళ్లు సంపన్న దేశాలని ఇంకా ధనం ఇవ్వమని అడుగుతున్నారు ఆ దేశాల వాళ్లు "ఇవ్వము" అంటున్నారు. ఎందుకు "ఇవ్వము" అంటున్నారో తెలుస్తూనే ఉంది భారతదేశం యొక్క సమస్యలని పరిష్కరించాలంటే భారతదేశంలోనే పరిష్కారాల కోసం వెతకాలి-- అంతేకాని, జగ్రెబ్ లేదా వాషింగ్‌టన్ లేదా లండన్‌లో వెతకకూడదు. ఎల్ కె ఝా లాంటి వాళ్లకి స్వాతంత్ర్యం అన్నమాటకి అర్థం తెలీదు అందుకనే వాళ్లు ఈ సత్యాన్ని అర్థం చేసుకోలేరు.

జగ్రెబ్‌లో, ఆల్‌ప్‌బాక్‌లో ప్రసంగాలు చేసి శ్రీమతి గాంధీ ఏమి సాధించారు? ఏమీ లేదు. చంద్రశేఖర్ కన్యాకుమారి నుంచి న్యూఢిల్లీ దాకా నడిచి వెళ్ళారు ఈ పాదయాత్ర ద్వారా ఆయన తెలుసుకున్నది చాలానే ఉంటుంది భారతదేశంలో పన్నులు కట్టేవారి ధనంతో యూరోపుకి విలాస యాత్ర వెళ్ళి వచ్చిన శ్రీమతి గాంధీ కన్నా ఈయన ఇలాగ నేర్చుకున్నదే ఎక్కువగా ఉంటుందని వేరే చెప్పాలా? ★

పగలంతా డ్యూటీచేసిన ప్రభాకరుడు పడమటి కొండల్లోకి పారిపోతున్న సమయం—

నైట్ డ్యూటీచేసి పగలంతా విశ్రాంతి తీసుకొన్న సుబ్రావ్‌కు అప్పుడే మెలకువ వచ్చింది.

టైమ్‌కోసం గూట్లోవున్న గడియారంవైపు చూశాడు చిన్నముల్లును పెద్దముల్లు అయిదో నంబరు ప్లాట్ ఫామ్‌మీద ముద్దు పెట్టుకోటానికి ప్రయత్నిస్తూంది మంచం మీంచి లేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకొన్నాడు సుబ్రావ్.

అప్రయత్నంగా అతని దృష్టి నేలమీద పడివున్న కవరుమీదికి మళ్లింది

కవరందుకొని చూసాడు

వ్రాతను చూడగానే ఎవరు వ్రాసినది అర్థమైంది సుబ్రావ్‌కు.

మర్నాడే తనకు జీతాలిస్తారు

జీతాల ముందురోజున తన బాధ్యతను గుర్తు చేయటానికా అన్నట్లు అలాంటి ఉత్తరాలు తండ్రి దగ్గర్నుంచి రావటం తనకు ఉద్యోగం వచ్చినదగ్గర్నుంచీ జరుగుతున్న తంతే! జీతం తీసుకొని అట్నుంచి అటే పోస్టాఫీసుకువెళ్లి తన తండ్రికి మూడు వందలు ఎమ్ ఒ చేయటం తనకు మామూలే!

విసుగ్గా కవరును టేబులుమీద పడేశాడు

బాత్‌రూమ్‌కు వెళ్లి సబ్బుతో ముఖం కడుక్కువచ్చాడు టర్కీ టవల్‌తో ముఖం



తుడ్చుకొంటూ బయటకు చూసిన సుబ్రావ్‌కు ఎదురుగా 'గాంధీ హిల్' కన్పించింది

సాయంకాలపు నీరెండలో కమనీయంగా కన్పించే పచ్చటి చెట్లు—

కొండకు దిగువగా అందంగా కట్టుకొన్న భవనాలు—కొండపైన మెలికలు తిరిగిన రోడ్డుమీద నడుస్తున్న రకరకాల మనుష్యులు—

ఎంతో రమణీయంగాను, మనోహరంగాను కన్పించింది ఆ దృశ్యం సుబ్రావ్‌కు

తమ దాంపత్య ఫలాలను వెంటబెట్టుకుని కొండ ఎక్కుతున్న జంటలను చూడగానే సుబ్రావ్ మనసులో ఈర్ష్య కల్గింది (ఇంకా తను ఒంటరే కనుక)

ప్రశాంత వాతావరణం కోసం చేతి కర్రల సాయంతో మెల్లగా అడుగులు వేస్తున్న రిటైర్డ్ శాల్తీలను చూడగానే సుబ్రావ్‌కు భయమేసింది (తనకూ్కడా ఆ వయస్సు వస్తుందని) రంగు రంగుల వోణీలు, రెపరెపలాడే పైటలు, వాటిని ఫాలో అవుతున్న జీన్స్, బెల్‌బాటమ్స్‌ను చూడగానే సుబ్రావ్‌కు మనసులో ఆనందపే

# మీ తీర్పేమిటి?

## గుడిసేవ సుందర రామయ్య

కల్గింది(సౌందర్యోపాసనకు తనక్కూడ లైసెన్స్ వుంది కనుక)

అందమైన ఆ సాయంకాలంలోని ఆనందాన్ని అర్థంటుగా అనుభవించాలనుకొన్నాడు సుబ్రావ్

స్నానాదులన్నీ పావుగంటలో ముగించుకొని చక్కగా డ్రస్ చేసుకొని, స్టైల్‌గా తల దువ్వుకొని రూమ్‌కు తాళం వేసి బయటకు వచ్చాడు.

భగత్‌సింగ్ చౌక్ దగ్గరకు వచ్చాక టీ త్రాగాలన్పించింది. మెల్లగా అడుగులు వేసుకొంటూ హోటల్లోకి నడిచాడు

వేడి వేడి టీ త్రాగాడు

నూతనోత్సాహం కల్గింది.

వడివడిగా అడుగులు వేసుకొంటూ గాంధీహిల్ వైపు నడిచాడు

రాజకుమారీ టాకీసు దగ్గరకు రాగానే తక్కున ఆగిపోయాడు

ఫస్ట్‌షోకు టిక్కెట్లు యిస్తున్నారు

రంగు రంగుల వాల్‌పోస్టర్స్ సుబ్రావ్‌కు స్వాగతం పల్కాయి.

వెంటనే ఆ సిన్మాను చూడాలనిపించింది

అంతే! క్యూలోనిలబడ్డాడు టికెట్లుకోసం.

సుబ్రావ్ హాల్లోకి అడుగు పెట్టేసరికే చాలా సీట్లు నిండిపోయాయి. హాలంతా ఓసారి పరికించి కాళీగావున్నసీట్లో కూర్చుండిపోయాడు

మరో అయిదు నిమిషాలకు హాల్లో లైట్లు ఆరాయి ట్రయిలర్స్ మొదలయ్యాయి.

'ఫలానా సిన్మాతార సొగసుకు, ఫలానా కంపెనీ సబ్బుకు అవినాభావ సంబంధం వుంది కనుక మీరు కూడా ఆ సబ్బునే వాడండి!'' అంటూ వచ్చీరాని తెలుగులో ఓ ఆడ కంఠం—

'ఫలానా నటుడు తీరిక సమయాల్లో ఫలానా సిగరెట్ తాగుతాడు కనుక మీరు కూడా అదే సిగరెట్ తాగండి' అంటూ ఓ మగకంఠం—

'సిగరెట్స్ తాగటంవలన కేన్సర్ వస్తుంది' అంటూ ఓ పరిశోధకుని ఆవేదన—

అవన్నీచూస్తుంటే చికాకేసింది సుబ్రావ్‌కు.

అంతలో చిత్రం ప్రారంభమైంది.

టైటిల్స్ వేస్తున్నారు.

మ్యూజిక్ డైరెక్టర్ తన దగ్గరున్న వాద్యాలనన్నింటినీ నేపధ్యంలో విన్పిస్తున్నాడు

శ్రద్ధగా టైటిల్స్‌ను చూస్తున్న సుబ్రావ్ ఒక్కసారే 'అమ్మో' అన్నాడు

తన కాలుతొక్కిన మనిషిని గట్టిగా రెండు చెంపలు వాయించాలనుకొన్నాడు

కాని సదరు మనిషిని చూడగానే ఆ పని చేయలేకపోయాడు.

''సారీ ప్లీజ్'' అంటూ మృదుమధురంగా క్షమాపణలు చెప్పి ప్రక్క సీట్లోనే కూర్చున్న ఆ సుందరివైపు కొన్ని క్షణాలు మౌనంగా చూస్తుండిపోయాడు. సిగ్గు; బిడియం లేకుండా



చాలా 'ఫ్రీ'గా ప్రక్కన కూర్చున్న ఆ అమ్మడిని చూస్తుంటే సుబ్రావ్‌కు ఆశ్చర్యం కల్గింది.

తెరమీద సిన్మా ప్రారంభమైంది.

హీరో, హీరోయిన్ డ్యూయట్ పాడుకొంటూ కార్లో వెళ్తున్నారు.

సుబ్రావ్ అమ్మడివైపు చూశాడు

అమ్మడు సుబ్రావ్ వైపే చూస్తోంది

సిగ్గుపడ్డాడు సుబ్రావ్

కసుక్కున నవ్వింది అమ్మడు

'అదేమిటి ? ఆ అమ్మాయి తన వైపు అలా చూస్తుందేమిటి ? పైగా పరిచయం వున్నదానిలా ఆ నవ్వేమిటి ? సిన్మా చూడకుండా తన ముఖంలోకే పరీక్షగా చూస్తుందేమిటి ? ఆ అమ్మాయి సిన్మా చూడటానిక్కాదా వచ్చింది ?'

సుబ్రావ్ మనసునిండా ప్రశ్నలే !

సిన్మాలో లవ్‌సీన్ వస్తే చాలు అమ్మడే సుబ్రావ్ వైపు చూసి నవ్వుతూంది

సుబ్రావ్ ఓసారి చుట్టూ చూశాడు

అందరికళ్లు తమ వైపే చూస్తున్నట్లు ఫీలయ్యాడు.

సీటు మారాలన్పించింది.

కాని చుట్టుప్రక్కల కాళీసీటు కన్పించలేదు. అదీగాక 'ఓ ఆడదానికి భయపడి పారిపోతే ఇక జీవితంలో నీవేమి సాధిస్తావోయ్ రావ్ !' అంటూ అంతరాత్మ చివాట్లు వేసింది

'విశ్రాంతి' అని తెరమీద పడటంతో చీకట్లు వున్న ముఖాలపై వెలుగు విరజిమ్మింది

లైట్ల కాంతిలో అమ్మడిని చూశాడు సుబ్రావ్

అప్సరసలా కన్పించింది

ఇంటర్వెల్లో బయటకు వెళ్లని ప్రేక్షకులు తమ వైపే చూస్తున్నట్లు గమనించిన సుబ్రావ్ రక్కున నిలబడి బయటకు వెళ్లాడు.

క్యాంటీన్‌కు వెళ్లి కాఫీ త్రాగి హాల్లోకి వచ్చాడు

అమ్మడు తెరమీద వేస్తున్న స్లైడ్స్‌వైపు చూస్తోంది సుబ్రావ్ అతి నెమ్మదిగా అమ్మడిని అంటుకోకుండా అడుగులు వేస్తూ వచ్చి సీట్లో కూర్చున్నాడు

పిక్చర్ తిరిగి ప్రారంభమైంది

కథ మంచి పట్టులో పడింది

అప్పటివరకు పెద్దమనిషిలా వున్న వ్యక్తి విలన్‌గా మారిపోయాడు

తన భుజానికేదో మెత్తగా తగిలేసరికి ఉలిక్కిపడ్డాడు సుబ్రావ్

"సారీ !" అంటూ అమ్మడు తన చేతిని అదుపులో పెట్టుకొంది

విలన్ హీరోయిన్‌ను ఎత్తుకుపోయాడు

కథ క్లయిమాక్స్‌కు వచ్చిందని గుర్తు చేస్తూ కారును టాప్ స్పీడుతో తోలుతున్నాడు హీరో

## మీ తీర్పేమిటి...?

ముందు కార్లో పారిపోతున్న విలన్ హీరో శరీరానికి తగలకుండా కాల్పులు జరుపుతున్నాడు.

విలన్ కార్లోవున్న హీరోయిన్ ముఖంలో రెండు మూడు రకాల తాలూకు భావాలను 'క్లోజప్‌లో చూపించటానికి ప్రయత్నిస్తున్నాడు కెమెరామాన్.

హీరో కారును రోడ్డుమీద కంటె నడుస్తున్న రైలుమీద, కదులుతున్న కారుల మీదుగా ఎంతో చాకచక్యంతో నడపగలడన్న విషయాన్ని ప్రేక్షకులకు తెలియజెప్పటానికి చూస్తున్నాడు డైరెక్టర్

తన దగ్గరున్న వాద్యాలనన్నింటినీ ఒక్కసారే ప్లే చేస్తూ సీన్‌కు ప్రాణం పోయటానికి ప్రయత్నిస్తున్నాడు మ్యూజిక్ డైరెక్టర్.

### రిసెప్షనిస్టుగా మరమనిషి!

కష్టమర్లకు సేవచేసే కొత్తరకం మరమనుషులను జపానులో తయారు చేస్తున్నారు ఈ మరమనుషులను రిసెప్షనిస్టుగా లేక సేవకులుగా ఉపయోగిస్తారు జపానులోని శ్రానియో కంపెనీ, డైనిటీకికొ కంపెనీ వీటిని సంయుక్తంగా రూపొందిస్తున్నాయి ప్రస్తుతానికి వీటిని రెస్టారెంట్లు, అమ్యూజ్‌మెంటు పార్కులలో రిసెప్షనిస్టులుగా ఉపయోగిస్తారు రెస్టారెంట్లుతదితర సంస్థలలో హెల్పర్లుగా ఉపయోగిస్తారు భారీగా ఎల్రక్ట్రాను పరికరాలను ఉపయోగించి రూపొందించే ఈ మరమనిషి మాట్లాడ గలదు వచ్చిన అతిథులకు స్వాగతం చెప్పి, వారికి త్రోవ చూపించగలదు ఆహార పదార్థాలను వారి టేబుళ్ళపై అమర్చగలదు !

కాలికేదో అతి మెత్తని స్పర్శ తగిలేసరికి సుబ్రావ్ చటుక్కున క్రిందికి చూశాడు

అమ్మడి పాదం తన పాదాన్ని ముద్దు పెట్టుకోటం గమనించాడు

అమ్మడి వైపు చూశాడు సుబ్రావ్

"నా స్లిప్పర్ కన్పించటంలేదండీ!"అంటూ సీటుక్రింద వెదుకసాగింది

సుబ్రావ్ కూడా వెతికాడు

"అదుగో ! సరిగ్గా మీ సీటుక్రిందే వుంది!" అమ్మడు అనగానే "నేనిస్తా వుండండి !" అంటూ సుబ్రావ్ తన కాలితో స్లిప్పర్‌ను అందుకోటానికి ప్రయత్నించాడు

అవతల తెరమీద 'విలన్'ను తీసుకొచ్చి కోర్టువారికి అప్పగించాడు హీరో

స్లిప్పర్‌ను అమ్మడికి అప్పగించాడు సుబ్రావ్

తెరమీద హీరో హీరోయిన్‌ను చూసి నవ్వింది

అమ్మడు సుబ్రావ్‌ను చూసి నవ్వింది

'శుభం' అన్నాడు డైరక్టర్

"థాంక్స్ !" అంది అమ్మడు

హాలు బయటకు వచ్చాక వాచీ చూసు కొన్నాడు సుబ్రావ్

తొమ్మిది నలభై

రోడ్డంతా రద్దీగా వుంది

భగత్‌సింగ్ చౌక్ దగ్గరకు వచ్చాక కొన్ని నిముషాలపాటు నిలబడిపోయాడు సుబ్రావ్

హోటల్‌కు వెళ్లి భోజనం చేయాలా వద్దా అని ఆలోచనలోపడ్డాడు భోజనం చేయాలన్పించ లేదు ఎదురుగా కన్పిస్తున్న బడ్డీకొట్టు దగ్గరకు వెళ్లి రెండు చక్రకేళీలు కొన్నాడు

వాటిని తింటూ రూమ్‌కు చేరుకొన్నాడు

గేటు తీసుకొని లోపలికెళ్లి తన గది తాళం తీశాడు అప్పటికే ప్రక్క వాటాలోనివాళ్లు తలుపులు వేసుకొని, లైట్లు తీసేసి పడుకొన్నారు ..

సుబ్రావ్ లోపలికెళ్లి లైటు వేశాడు

చొక్కా గుండీలు విప్పుకొంటూ వెనక్కి తిరిగిన సుబ్రావ్ కొయ్యబారిపోయాడు

ఎదురుగా గుమ్మంలో అమ్మడు !

సుబ్రావ్‌కు భయమేసింది

"ఎవరండి ? ఎవరు కావాలి ?" అడగాడు తడబడుతూ

అతని ప్రశ్నలకు సమాధానం చెప్పాల్సిన అవసరం లేదనుకొందికాబోలు అమ్మడు ధైర్యంగా వచ్చి కుర్చీలో కూర్చుంది

'దెయ్యాలకు పాదాలు వెనక్కి తిరిగి వుంటాయి' ఎప్పుడో బామ్మచెప్పిన మాటలు గుర్తుకువచ్చి అమ్మడి కాళ్లవైపు చూశాడు

లేత తమలపాకుల్లా సున్నితంగా వున్న ఆమె పాదాల వైపు రెండు క్షణాల పాటు చూసి ముఖంలో ఫీలింగ్స్ మార్చి మార్చి "ఎవరునువ్వు? ఏం కావాలి?" అని అడిగాడు

"ఏమిటండి ! మీరు మరీను ! ఆ మాటలు తప్పితే మీకు వేరే మాటల్రావా ?" నువ్వుతూనే అడిగింది

సుబ్రావ్ నిర్ఘాంతపోయాడు

ఎంత ధైర్యం? అనుమతి లేకుండా రూమ్‌లోకి వస్తుందా ?

ఎంత పొగరు ? తనకేమాటలు రావని ఎగతాళి చేస్తుందా ? నిజంగానే సుబ్రావ్‌కు ఆ సమయంలో మాటలు కరువయ్యాయి

స్టేజీమీద ప్రాంప్టర్‌తో పనిలేకుండా డైలాగ్స్ పల్కే తన గొంతు ఎందుకిలా మూగ పోయింది ?

# ఒలింపిక్ కోచ్ జిమ్ ఒ డోహర్టీ అంటారుగదా:

# "బలం, చేవా సమకూర్చడానికి కాంప్లాన్® లాంటిది మరొకటి లేదు మరి."

ఒలింపియన్ జిమ్ ఓ' డోహర్టీ, జటిలమైన పోటీ పందేలకోసం, భారతదేశంలోనే గాక ప్రపంచమంతటా, ఉత్సాహంగల యువతరం వారికి తరిఫీదు యిచ్చారు. ఛాంపియను పుట్టుకతో అవరు, తరిఫీదు యిచ్చి తయారుచేయాలి వారిని అని ఆయన నమ్మకం. మరి విజేత అవడానికి కావలసినది మనో శక్తి—దాంతోటే శరీర శక్తీను.

"ఈతగాళ్ళకీ, ఎథెలెట్స్‌కీ, ముఖ్యంగా, పెరిగే వయస్సులో పిల్లలకీ కాంప్లాన్ తీసుకోమని సిఫార్సు చేస్తాను," అంటారు. జిమ్ ఓ' డోహర్టీ. "కాంప్లాన్, ఆ చేవను సమకూర్చడంకోసం ఆరోగ్యవంతమైన పెరుగుదలనిచ్చే, తేలికగా అరగగల, 23 కీలక పదార్థాలున్న సంపూర్ణ ఆహారం."

ఈ కిటుకును జిమ్ ఓ' డోహర్టీ నుంచి తెలుసుకోండి. మీ పిల్లలకు, పూర్తిగా ఆరోగ్యవంతమైన పెరుగుదలకోసం, ప్రతి రోజూ యివ్వండి కాంప్లాన్. కాంప్లాన్ రుచికరమైన సువాసల్లో వస్తుంది—పిల్లలకిది ఎంతో యిష్టం!




GLC 9-2116 TL

## కాంప్లాన్® -సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

చక్రాల్లాంటి తన కళ్లను గదంతా త్రిప్పుతూ పరీక్షగా చూస్తోంది అమ్మడు.

"ఎవరు నువ్వు? ఇక్కడకు రావటానికి కారణమేమిటి ?" అడిగాడు సుబ్రావ్ ధైర్యం తెచ్చుకొంటూ

"మీ రెంత అమాయకులండీ ? వసంత ఋతువులో కోకిల మధుర గానాన్ని ఎందుకు ఆలాపిస్తుందో తెలీదా ? వెన్నెల రేడును చూసి కలువ కన్నెలు ఎందుకు వికసిస్తాయో తెలీదా ?"

'సీ వెధవ్వేషాలకుతోడు కవిత్వం కూడానా?'

అని మనసులోనే అనుకొని పైకి మాత్రం "అసలు విషయమేమిటో సూటిగా చెప్ప ?" అని అడిగాడు కొంచె హెచ్చు స్వరంతో

"మీరు నాటకాల్లో నటించి హీరోగా పేరు తెచ్చుకొన్న వ్యక్తి ఆ మాత్రం అర్థం చేసుకోలేరా ?"

"నేను నాటకాలు వేస్తానని ఎలా తెల్సు?"

ఆమె నవ్వింది

"నాటకాలంటే నాకెంతో యిష్టం! మీరు నటించిన నాటకాలను నేను సాధారణంగా మిస్ కాను నేను మీ అభిమానిని పౌరాణికాల్లో కూడా మీ నటన అద్భుతం కృష్ణ పాత్రలో మిమ్మల్ని చూస్తే నా కేమనిపిస్తుందో తెలుసా ?"

"చెప్పందే ఎలా తెలుస్తుంది ?" అప్రయత్నంగా అడిగాడు సుబ్రావ్

"రాధగా మారాలన్పిస్తుంది" అంది సిగ్గుపడుతూ

సుబ్రావ్‌కు అంతా అయోమయంగావుంది

ఆమె మాటలతీరు, ప్రవర్తన కొంచెం భయాన్ని కల్గించాయి

"మగవాళ్లు సిగ్గు పడకూడదండీ !" అంటూ తన కోమల హస్తాన్ని సున్నితంగా సుబ్రావ్ భుజంమీద వేసింది

షాక్ తగిలినట్లయింది

"బయట వెన్నెల ఎంతో చల్లగా మనోహరంగా వుంది కదండీ! అలా వెళ్లి కాస్సేపు కబుర్లు చెప్పుకొందామా ?" గారాబంగా పల్కింది అమ్మడు

# ఏమీ తీర్పేమిటి...?

'కబుర్లట, కబుర్లు! అగ్ని సాక్షిగా పెళ్లాడిన భార్యలా ఇలా అడుగుతుందేమిటి ?' అని మనసులో అనుకొని ధైర్యాన్ని తెచ్చుకొని ఇలా అన్నాడు సుబ్రావ్—

"చూడమ్మాయ్! నీవు నన్నేదో అల్లరి చేద్దామనే వుద్దేశంతో వచ్చినట్లుంది అనవసరంగా రభసచేయక మర్యాదగా వెళ్లిపో! ఇలాంటి పిచ్చి వేషాలు వేయటం ఆరోగ్యానికి మంచిది కాదు ఓ మంచి కుర్రాణ్ణి చూసి లక్షణంగా పెళ్లి చేసుకో!"

ఆ డైలాగ్ వినగానే అమ్మడు అవాక్కయిపోయింది

"థాంక్స్ ఫర్ యువర్ సజెషన్ !" అనేసి గబగబ అడుగులు వేసుకొంటూ రోడ్డుమీదికి వెళ్లిపోయింది ఆమె వెళ్లిన దిక్కే చూస్తూండిపోయాడు సుబ్రావ్

* * *

మర్నాడు ఉదయమే సుబ్రావ్ లేవకముందే రావ్‌గారు వచ్చి తలుపు తట్టారు

అంత హఠాత్తుగా తన తండ్రి ఎందుకు వచ్చాడో తెలియక కొయ్యబారిపోయాడు సుబ్రావ్

"స్టేషన్‌కు రమ్మని రాశానుగా! ఉత్తరం అందలేదా ?" సూటిగా అడిగారు రావ్‌గారు.

"నిన్నే వుత్తరం వచ్చింది కాని " అంటూ వాక్యం పూర్తి చేయకుండా టేబుల్ వైపు చూశాడు

తను వ్రాసిన వుత్తరం టేబుల్‌మీద వుండటం గమనించిన రావ్‌గారు కవరును చేతిలోకి తీసుకొంటూ "ఉత్తరం చదవటానికూడా తీరిక లేదన్నమాట !" అన్నారు కోపంగా.

తండ్రి చేతిలోని వుత్తరాన్ని అందుకొని చదివాడు సుబ్రావ్

"ఇంత సడన్‌గా ఫిక్స్ చేస్తే ఎలా ?" అంటూ గొణిగాడు

"ఆ మాట అనటానికి సిగ్గులేదట్రా! నీతోటివాళ్ళు అప్పుడే తండ్రులు, తాతలు అవుతున్నారు !" అంటూ మందలించారు రావ్‌గారు

"ఇప్పుడు వెళ్లటం ఎలా ? మార్నింగ్ డ్యూటీవుంది సాయంత్రం ఆఫీసు అయ్యాక వెళ్దాం !" అన్నాడు సుబ్రావ్

"అదేం కుదరదు మధ్యాహ్నం వర్జ్యం వస్తుంది ఇక్కడికి మీ ఆఫీసు దగ్గరేగా! సెలవు పెట్టెరా !"

"అలాగే !" అంటూ కాలకృత్యాలన్నీ పావుగంటలో ముగించుకొని ఆఫీసుకు బయల్దేరాడు సుబ్రావ్

* * *

సుబ్రావ్ ఆఫీసుకు సెలవుపెట్టి రూమ్‌కొచ్చేసరికి రావ్‌గారు పేపరు చదువుకొంటున్నారు

"నీకేదో లెటర్ వచ్చిందిరా !" అంటూ ఓ కవరు అందించారు సుబ్రావ్‌కు

ఆత్రంగా కవరు చింపి ఉత్తరం బయటకు తీశాడు

'సుబ్బారావ్‌గార్కి నమస్సులు! ఉత్తరం ఎవరు రాశారని ఆశ్చర్యపడకండి! చివరివరకు చదివితే నేనెవరో మీకే తెలుస్తుంది అందరికీ అర్థమయ్యేలా చెప్పాలంటే నేనో తండ్రి గుండె మీద కుంపటిని నా పెళ్లి చేయటానికి మావాళ్లు ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నారు వాళ్లు తెచ్చే సంబంధాలేవీ నాకు నచ్చటంలేదు అందుక్కారణం పెళ్లి పట్ల నాకు కొన్ని స్వంత అభిప్రాయాలు వుండటమే! మనమేదైనా వస్తువును కొనుక్కోవాలని బజారుకు వెళ్తాం! వస్తువు నచ్చకపోతే కొనకుండా తిరిగివచ్చేస్తాం! ఇంకా కరక్ట్‌గా చెప్పాలంటే పశువుల సంతలో పశువును పరీక్ష చేసుకోకుండా కొనుక్కోవటం తెలివిగల పని కాదని నా అభిప్రాయం వేలకు వేలు తగలేసి వరుని కొనుక్కొనేటప్పుడు ఎంపిక చేసుకొనే చాయిస్ నాలాంటి వధువులు కోరుకోవటం తప్పా ?

నా ఆర్గ్యుమెంటుకు వెనుక ఆవేదనా భరితమైన దయనీయ సంఘటన వుంది కేవలం











బులుసు వేంకటరమణయ్య

# నారదుని శాపం

మహర్షుల శాపం త్రిమూర్తులకయినా తగులక తప్పదు వారు కర్మను తప్పించుకోలేరు దీన్ని తెలియజేసే కథ ఒకటున్నది

నారదమహర్షి ఘోరమైన తపస్సు చేసి, తాను ప్రకృతినీ, మాయనూ జయించానని తృప్తిపడ్డాడు ఆ ధీమాతో అతడు గర్వించి శ్రీమన్నారాయణుని వద్దకు వెళ్లి, తాను మాయను జయించినట్లు సగర్వంగా తెలియజేశాడు శ్రీహరి ఒక్క చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు

త్రిలోకసంచారి అయిన నా ర ద డు, తర్వాత భూలోకంలోని కల్యాణదుర్గ నగరానికి వచ్చి, అక్కడి ప్రజల వల్ల రాజకుమారి రమాదేవికి స్వయంవరం జరుగనున్నట్లు తెలుసుకున్నాడు అక్కడ అంతఃపురంలో రాజకుమారిని చూచి, ఆమె సౌందర్యానికి ముగ్ధుడై, ఆమెను పెండ్లి చేసుకోవాలని సంకల్పించాడు ఆమె శ్రీహరినే తప్ప మరొకర్ని వివాహమాడనని నిశ్చయించుకున్నట్లున్నూ గ్రహించాడు నా ర దు డు వెంటనే నారాయణుని వద్దకు వెళ్లి ''స్వామీ ! మీరు ఆదిలక్ష్మినీ, వసుంధరను వివాహమాడి సుఖంగా ఉంటున్నారు నేను బ్రహ్మచారినై దేశద్రిమ్మరినై ఉన్నాను పెళ్లి చేసుకోవాలని ఉన్నది. అందగత్తె అయిన ఒక కన్యను చూశాను. ఆమె మిమ్మే పెళ్లాడదలచినట్లున్నది మీరు మీ స్వరూప సౌందర్యాలను నాకు అనుగ్రహిస్తే స్వయంవరంలో ఆమెను వివాహమాడగలను''అని అన్నాడు. శ్రీహరి చిరునవ్వు నవ్వి ''సరే'' అన్నాడు. నారదుడికి లోకోత్తరమైన సౌందర్యం కలిగింది అతడు ఎంతో సంతోషిస్తూ స్వయంవరం మంటపానికి వెళ్లాడు రమాదేవి అందరితోపాటు నారదుణ్ణి తిరస్కరించి, సమయానికి వచ్చిన శ్రీహరిని వరించింది అందరూ తెల్లపోయారు శృంగి, భృంగి అనే శివభక్తులు నారదుణ్ణి చూచి వెటకారంగా నవ్వి ''నీ అందం చూచుకోవయ్యా ! !'' అని ఒక అద్దం ఇచ్చారు నారదునికి తన కోతి ముఖం కనబడింది తాను కోతి ముఖంతో అందరికీ కనబడేటట్లు నారాయణుడు చేసి, తన్ను మోసగించాడని, నారదునికి ఆతనిపై కోపం వచ్చింది ఆ కోపంతో ఆతడు శ్రీహరిని కొంతకాలం సతీ వియోగం వల్ల బాధపడవలెనని ౘపించాడు ఆ శాప ప్రభావంవల్లనే నారాయణుని అవతారమయిన శ్రీరాముడు వనవాసం చేస్తున్న సమయంలో రావణుడు సీతాదేవిని అపహరించి లంకకు తీసికొనిపోగా, కొంతకాలం సతీ వియోగంవల్ల పరితపించడం జరిగింది

మహర్షుల శాపప్రభావం త్రిమూర్తులపైని కూడా పని చేస్తుందని దీనివల్ల తెలుస్తున్నది



డబ్బు, హోదాలను చూసి ఓ ఇంజనీర్‌ను తెచ్చి అక్కకు పెళ్లి చేశారు సంవత్సరం కాకముందే అబ్బాయిగారి అ ల వా ట్లు ఒక్కటొక్కటే బ య ట ప డ్డా యి త్రాగుడు, జూదం, వ్యభిచారం . ఒకటేమిటి ? అన్నీ అవలక్షణాలు వున్నాయి అవే మా అక్క ప్రా ణా ల ను బలిగొన్నాయి అలాంటి దుస్థితి ఏ స్త్రీకి కలుగకూడదని నా ప్రార్థన శీలం ఆడదానికెంత ముఖ్యమో మగవాడికూ్కడా అంతే ముఖ్యమని నా అభిప్రాయం నైతికంగా పతనమైన మనిషిని కట్టుకొని ఏ స్త్రీ సుఖపడలేదు

మీ ప్రక్కవీధిలో వుంటున్నాము మేము మా మేడమీదినుంచి చూస్తే మీ రూమ్ కన్పిస్తుంది ఈమధ్య మా నా న్న గా రు మీ సంబంధాన్ని ఎవరో తీసుకువచ్చారని చెప్పారు అప్పట్నుంచి మిమ్మల్ని మరింత శ్రద్ధగా పరిశీలిస్తున్నాను నా ట కా లు వేసేవాళ్లంటే జనంలో ఓ రకమైన చిన్నచూపు వుంది మొదట్లో నేనుకూడా అలాగే ఆలోచించాను అందుకే మిమ్మల్ని పరీక్షించేందుకు సాహసించాను సభ్యత, సంస్కారం, నిగ్రహం కల మీ వ్యక్తిత్వాన్ని తెల్సుకోనే అదృష్టం నిన్న నాకు అదృష్టవశాత్తు కల్గింది నా పరీక్షలో మీరు నెగ్గారు రేపటిరోజున మీరు మీ నాన్నగారితో పెళ్లి చూపులు చూడటానికి వస్తున్నారని తెల్సి రాత్రికి రాత్రే యీ వుత్తరం వ్రాసి పోస్ట్ చేస్తున్నాను

రాత్రిపూట ఓ పరాయి మగవాడి రూమ్‌కు పెళ్లి కాని ఆడపిల్ల వెళ్లి అసభ్యంగా ప్రవర్తించటం తప్పని తెల్సినా, నాకు కావాల్సిన వరుని ఎంపిక చేసుకోటానికి నేను అలా సాహసించానని మీరు అర్థం చేసుకొంటే నేను ధన్యురాలిని ! నా ఆశయం నెరవేరినట్లే !

నా మనసును గుర్తించి నా అభిప్రాయాన్ని అర్థం చేసుకొని నన్ను ఆదరిస్తారో ? లేక నా బాహ్య ప్రవర్తనను బట్టి నా గుణాన్ని అంచనా వేసుకొని నన్ను అసహ్యించుకొంటారో ?

మీ నిర్ణయమ్మీద నా జీవితం ఆధారపడి వుంటుంది.

మరి. మీ తీర్పేమిటి ?

ఆశతో ఎదురుచూసే

— ప్రతిభ

ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకొని,

''నాన్నగారూ ! బయల్దేరండి !'' అంటూ తొందర చేశాడు సుబ్రావ్ హుషారుగా తలదువ్వుకొంటూ

ప్రొద్దున్న తను వచ్చినప్పుడు పెళ్లంటే విముఖతను చూపి నీరసంగా ఆఫీసుకు వెళ్లిన కొడుకు ఇంతలోనే సుముఖత చూపిస్తూ హుషారుగా వుండటానికి గల కారణమేమిటూ? అని ఆలోచిస్తూనే సుబ్రా వ్ ను అనుసరించారు రావ్‌గారు






ఆంధ్ర మహాసామ్రాజ్యానికి పక్కలో బల్లెమయిన జైనస్వామి మొగిలిచర్లలో ఏమీ అరాచకం సృష్టించలేకపోయేడన్న విషయం శివదేవయ్యకి అర్థమయింది ఇది చాల స్వల్ప మయిన విషయమనీ, దానిని గురించి పట్టించుకో వలసిన అవుసరంకూడ లేదనీ చెప్తున్నారు కృష్ణస్వామి శివదేవయ్య ఆలోచనలలో కృష్ణస్వామి ఆకాశమెత్తున ఎదిగిపోయేరు ఆయన వ్యక్తిత్వం సంపూర్ణమయినట్లు అనిపించింది

శివదేవయ్య కృష్ణస్వామిని మొదటినుండీ పరిశీలిస్తున్నాడు ఆయన వ్యక్తిత్వం ఓరుగల్లులో ఉండగా యింత ప్రఫుల్లంకాలేదు యీ ఆశ్రమ వాసంవల్ల ఆయన పరిపూర్ణపురుషుడయ్యేడు

ఇక జైనస్వామి విషయం ఆయనతో ప్రస్తావించటం తేలికతనమని ఆలోచించెడు శివదేవయ్య

"మీకు యింకా కావలసిన ఏర్పాట్లు ఏవయినా ఉంటే మాతో చెప్పండి" అన్నాడు శివదేవయ్య మహామంత్రి

కృష్ణస్వామి క్షణం మౌనందాల్చేరు

*(గత సంచిక తరువాయి)*

"మహామంత్రి! మా అవుసరాలకు అనుగుణంగా మీరు అన్నీ సమకూర్చేరు. కొరత లేకుండా శాంతి యజ్ఞం సమాప్తమవుతుంది ఇక చింతలేదు పూర్ణాహుతి సమయానికి రాణి వారు యిక్కడకు విచ్చేస్తే చాలు" అన్నారు కృష్ణస్వామి

అది లాంఛనప్రాయమయిన ఆహ్వానం కాని రాణివారు మొగిలిచర్లవరకూ వొచ్చి పూర్ణాహుతికిరాకుండా ఎలా వుంటారు?

"అలాగే! మరి మాకు శలవుయిప్పించరూ!" అంటూ లేచేరు శివదేవయ్య కృష్ణస్వామికూడా లేచేరు

"ఒకసారి యజ్ఞవేదికనూ, యజ్ఞ మంటపాన్ని మీరు దర్శించాలి" అంటూ అభ్యర్థించేరు కృష్ణస్వామి ఆశ్రమంలోనించి వెలుపలకు వొచ్చేక ఇద్దరూ యజ్ఞమంటపంలోనికి నడిచేరు

స్తంభాలకు చెక్కిన ఆకృతులూ, మండపం ఉపరిభాగాన తీర్చిదిద్దిన షోడశదళ పద్మాలూ చూస్తుంటే శివదేవయ్యగారికి మహదాశ్చర్య మయింది

మంటపానికి ప్రవేశద్వారంవద్ద కార్యమగ్నులై వున్నట్లు కనిపించే ద్వారపాలకులు ఆయనకు మనోరంజకం చేసేరు అది కాకతీయుల ప్రత్యేక సాంప్రదాయం

సహజంగా అంతకు పూర్వపు శిల్ప సాంప్రదాయాలలో, రీతులలో ద్వారపాలకులు–తరువాతి కాలంలో జయ విజయాలుగా స్థిరపడినవారు – నిశ్చల దృక్కులతో కార్యమగ్నత లేకుండా కనిపించేవారు

ఆపైన ద్వారపాలకుల పాదాలవద్ద మిగిలిపోయిన ఖాళీస్థలంలో ఏమీ లేకుండా ఉండేది

కాని కాకతీయులు ఆ చోటును వృథాగా వదలివేయకుండా కుచ్చిలను మలచేవారు

ఈ శిల్పి తీర్చిన కుచ్చిలు సజీవంగా ఉండి చూపరుల దృష్టిని ముఖ్యంగా తామే ఆకర్షిస్తున్నారు అంటే చూపరుల లక్ష్యానికి గురి కావలసిన చోటు – శిల్ప నైపుణ్యంవల్ల – వారిని ఆకర్షించే ప్రధాన స్థలమయింది యిది శిల్ప నైపుణ్యానికి పరాకాష్ఠ స్తంభాలకు లోపల ప్రక్క ఉన్న యక్షిణులు సజీవమూర్తులై ఉన్నారు వారికి అలంకారాలు లేవు నిసర్గ సౌందర్యమే వారి శిలంకారం. అందువల్ల శివదేవయ్యను ఆ శిల్పాలు అధికంగా ఆకర్షించేయి ఆయన ఒకచోట నిలచేరు

"ఎవరో యీ శిల్పి! యీతని పూర్వజన్మ సుకృతమేమో!! యింత మహత్తరంగా కాకతీయుల రీతులను మలచిన యీ శిల్పి ధన్యుడు. వెంటనే మేము యీ శిల్పిని చూడాలి" అంటూ తమ తన్మయత వెల్లడించేరు.

ఆ మంటపంలోనే ఒక మూల కంచుకమూ, తలపాగా ధరించి ఉన్న శ్రీదేవుడు కృష్ణస్వామి కనుసైగతో ముందుకు కదిలేడు శివదేవయ్య అతడిని తేరిపార చూచేరు

"నాయనా నీదేవూరు?" ప్రశ్నించేరు మహామంత్రి శ్రీదేవుడు మౌనంగా ఉండిపోయేడు

"చెప్పు నాయనా!" హెచ్చరించేరు కృష్ణస్వామి

"ఆంధ్ర మహాసామ్రాజ్యంలో నేనొక

**జరిగిన కథ – 12:** పద్మగంధి ఒక బిక్షకత్తె వేషంతో ఓరుగల్లులోని ఒక పాంథశాలకి చేరుతుంది తను, పరదేశి కలసి గోపాల దేవునికి బుద్ధి చెప్పాలనుకుంటుంది త్రిపురాంతకుడు గోపాలదేవునికి బాగ బుద్ధి చెపుతాడు ఆహవమల్లు జైనస్వామి ఆదేశానుసారం జైన సభలు ప్రారంభించు ఏర్పాట్లు చేయడనికి మొగలిచెర్లలో విడిది చేస్తాడు మొగలిచెర్లలో ఏ హరిజనుడు ఏకవీరదేవి ఆలయానికి వెళ్ళరాదని ఆజ్ఞ జారిచేస్తాడు వెంకన్నదొర గోపాలదేవునికి స్పృహ పోగొట్టి పద్మగంధితో పాలంపాట చెర్వుకి బయలుదేరాడు త్రిపురాంతకుడు వారిద్దరు రామప్ప ఆలయంలో జైనస్వామిని కలుస్తారు జైనస్వామి పద్మగంధిని గుర్తిస్తాడు ఏకవీర ఏడుకొండలవాడే తన సర్వస్వం అని భావించడం చూచి శ్రీదేవుని మనసు వికలమైంది శ్రీదేవుడు స్వామిని నిందించగా ఏకవీర శ్రీదేవుడ్ని గాయ పరుస్తుంది జైనస్వామి పద్మగంధిని జైనం స్వీకరించమని కోరగా తిరస్కరిస్తుంది త్రిపురాంతకుడు తన ఛురికను వసంతునిపై విసిరి పద్మగంధితో పారిపోతాడు పద్మగంధిని కాపాడే బాధ్యత తనపై ఉందని భావిస్తాడు త్రిపురాంతకుడు ఏకవీర తాను దర్శించిన ఆ స్వామి రూపును మహాదేవుడికి వర్ణించి చెపుతుంది పద్మగంధి వెంకన్నదొర ఇంటికి వస్తుంది రాబోయే కురుక్షేత్ర సంగ్రామంలో తన కూతురు బలిగాకుండా కాపాడుకోడానికై ఆమె జన్మ రహస్యం వెంకన్నదొరకు చెపుతుంది అది విని ఆశ్చర్యపోతాడు వెంకన్నదొర ఏకవీర కృష్ణస్వామి, పద్మగంధిలకు జన్మించిన పుత్రిక అని హరిజనులతో అబద్ధం చెపుతాడు ఈ సంగతి తెలుసుకొని కృష్ణస్వామి విచారపడి పద్మగంధిని పిలిపించి ఆమె కూతురుని ఆమె కప్పగిస్తాడు సృష్టిలో అన్నింటికన్న పవిత్రమైనది మాతృస్థానం అని తెలుసుకుంటుంది ఏకవీర త్రిపురాంతకుడు కృష్ణస్వామి ఆశ్రమానికి వచ్చి ఆయన మీద వెంకన్నదొర చేసిన అభియోగం అబద్ధమని అక్కడి వారికి చెపుతాడు రేపు పూర్ణాహుతి అనగా రాణి రుద్రాంబ, ఆమె కుమార్తెలు మొగలిచర్లలో విడిది చేసారు శివదేవయ్య జైన మహాసభల గురించి తెలుసుకోవాలని ఆసక్తి కనపరుస్తారు

పొరుడను'' సమాధానమిచ్చేడు శ్రీదేవుడు. అతని గొంతులో జీరను పసికట్టేరు శివదేవయ్యగారు.

''నాయనా! నీ వంటి శిల్పులు ఆంధ్ర మహాసామ్రాజ్యానికే గర్వకారణం. చరిత్ర పుటలలో కాకతీయ శిల్పవైభవం అద్వితీయమై, అప్రతిహతమై చిరకాలం వర్ధిల్లటానికి మీవంటి

తీసి ఆ కళాకారుని మెడలో స్వయంగా అలంకరించేరు శివదేవయ్యగారు.

శ్రీదేవుడు ఆర్ద్రమయిన నేత్రాలను ఒత్తుకుంటూ వొంగి మహామంత్రి పాదాలను తాకి లేచి ఆయన ఆశీస్సుల కోసం ఎదురు చూడసాగేడు.

''నాయనా! మొగిలిచర్లలో నీ పని పూర్తి అయింది. నీవు యీ మారుమూల కుగ్రామంలో పడి వుండటానికి వీలులేదు. మా వెంట ఓరుగల్లుకు రావాలి. నీవు చేయవలసిన పని చాల ఉన్నది. నీవంటి కళాకారులను ఆదరించలేని ఆంధ్ర ప్రభువుల వైభవం అర్ధరహిత



శిల్పులే కదా కారణం. నీవు పునీతుడవు. సన్మాన పాత్రుడవు. నీ నైపుణ్యం మా సామ్రాజ్యానికే యశోదాయం'' అంటూ తన హర్షాతిరేకాన్ని వెలువరించుకోలేక మెడలోని ముత్యాల హారాన్ని

మౌతుంది'' అంటూ ఆహ్వానించేరు శివదేవయ్య

తన ప్రియశిష్యునికి కలిగిన యీ పురస్కారం కృష్ణస్వామికి ఆనందదాయక మయింది కాని తన శిష్యుడు ఆశ్రమం విడిచిపోవటం ఆయన ఊహించలేక పోయేడు.

''శ్రీదేనా! బదులు చెప్పవెందుకని?'' ప్రశ్నించేరు మహామంత్రి.

''ఏమి చెప్పను?'' అంటూ కంఠం జీరపోగా తల వొంచేడు శ్రీదేవుడు విషయం ఏమిటన్నట్లు శివదేవయ్య కృష్ణస్వామి వంక చూచేరు కృష్ణస్వామికూడ బదులుపలుక లేదు

''నాయనా! నీవు నా ఆహ్వానాన్ని తిరస్కరించవలసి వచ్చినా అందుకు నేను ఏమీ బాధ పడను ఆలోచించుకుని చెప్పు'' అంటూ ముందుకు నడిచేరు శివదేవయ్యగారు

శ్రీదేవునికి తెరిసిన పడినట్లు అయింది

శివదేవయ్యగారిని వీడ్కోలు చేసేందుకు ఆశ్రమ ముఖద్వారం వరకు వచ్చేరు కృష్ణస్వామి

ఆశ్రమ ముఖద్వారం నుండి అడుగు వెలుపలకు వేస్తూ అన్నారు శివదేవయ్య— ''స్వామీ! మీ ధర్మనిష్ఠవల్లా, చాకచక్యం వల్లా యీవేళ ఆంధ్రమహాసామ్రాజ్యం పరువు నిలచింది ఇక ఊరూరా యిలాగే క్రతువులు జరిపించాలి ప్రజల హృదయాల్లో— జైనస్వామి దుర్బోధలవల్ల యింకిపోతున్న— హిందూధర్మ ప్రతిష్ఠ మళ్ళీ పూర్వపు స్థాయిని అందుకోవాలి వైరి నిర్మూలనం జరగాలి ఆంధ్రసామ్రాజ్యం పొందనున్న యీ విజయానికి మీరే కర్తలు'' అంటూ ప్రశంశించేరు

''కృష్ణస్వామి నవ్వి శివదేవయ్యను చూచేరు

''ఎందుకు అలా నవ్వేరు యీ విషయంలో మీకు ఏదయినా సందేహం వున్నదా?'' అని ప్రశ్నించేరు శివదేవయ్య

రవంతసేపు మౌనంగా ఊరుకుని కృష్ణస్వామి ఆ వెనుక అన్నారు ''మహామంత్రీ! మన ఈ కల పండటానికి యింకా ఎనిమిది యామముల సమయం ఉంది''

ఆ మాటలోని హెచ్చరికను శివదేవయ్య గ్రహించేరు.

''మాకు మీమీద ఉన్న విశ్వాసం గురించి అలా చెప్పాను అంతే! నేనూ అప్రమత్తంగానే ఉండగలను'' అంటూ చేతులు జోడించి వీడ్కోలు తీసుకున్నాడు శివదేవయ్య

కృష్ణస్వామి ముఖద్వారం వద్దన నిలిచేరు శివదేవయ్య ఆశ్రమ ముఖద్వారం దాటగానే అప్పటివరకూ అక్కడే వేచి ఉన్న సేవకుడు పాదరక్షలు తెచ్చి అందించేడు. ఒకరు గుర్రపు జీను సరిచేసేరు వారికి కూత వేటు దూరంలో నుండి ఒక విచిత్రమయిన శబ్దం వినిపించింది

అది హెచ్చరిక సంకేతం. ఆ సంకేతం రాగానే సంతృప్తితో గుర్రాన్ని అధిరోహించి తమ విడిది వైపు దౌడు చేయించేరు శివదేవయ్య.

ఆయన ఏర్పాటు చేసుకున్న రక్షణ పద్ధతి చూచి కృష్ణస్వామి పరమానందభరితులయ్యేరు ఆశ్రమంలోకి వెళ్ళేందుకు వెనుదిరగబోతూ వుండగా అల్లంతదూరంలో నారాయణ వొస్తూ కనిపించేడు. అతడు ఆతృతతో చాల వడివడిగా నడుస్తున్నాడు అతడి నడకవల్ల అనుమానించి ఏదో అశుభాన్ని శంకిస్తూ అలాగే నిలిచిపోయేరు కృష్ణస్వామి

నారాయణ పరుగుపరుగున వొచ్చి కృష్ణస్వామి ముందు వాలిపోయేడు కృష్ణస్వామి అభయం యిచ్చి విషయాన్ని విశదీకరించమనగానే పూర్తిగా కోలుకుని చెప్పసాగేడు అతని మనసు వికలమైపోయినట్లుగా మాటలు తడబడు తున్నాయి

ఏవో ఘోరమయిన దృశ్యాలు చూచినట్లుగా గుండె చెరువైపోయినట్లుగా నారాయణ ముఖ ముద్రవల్ల గ్రహించేడు కృష్ణస్వామి

ఆ స్థితినుండి కృష్ణస్వామి యిచ్చిన అభయంవల్ల కోలుకున్నాడు నారాయణ కృష్ణస్వామి శ్రద్ధగా ఆలకించేడు

''స్వామీ! మా హరిజనులకు దరిద్రపు రోజులు దాపురించాయి జైనానుకూల్యం వహించేందుకు తిరస్కరించామన్న అక్కసుతో వెంకన్నదొర మామీద విరుచుకుపడ్డాడు తనకు చెల్లించవలసిన బకాయిలు తక్షణమే చెల్లించ వలసిందిగా రెండు దినాలనుండి ఒత్తిడి తేసాగేడు

ఈవేళ అది పరాకాష్ఠనందుకుంది హరిజనులు అందర్నీ పిలిచి పెరటిలో బంధించేడు బలవంతపు బ్రాహ్మణార్థం పెట్టినట్లుగా మమ్మల్ని జైనం స్వీకరించమని ఒత్తిడి చేసేడు

అందుకు హరిజన యువకులు తిరస్క రించేరు అందర్నీ బందీలను చేసి హింసిస్తు న్నాడు. కర్రలతో అతడి పాలేర్ల చేత గొడ్లను బాధించినట్లుగా బాధించుతున్నాడు నేను ఎలాగో తప్పుకుని తమను శరణువేడేందుకు వొచ్చేను బాబూ!

హరిజనవాడలో గృహదహనాలు జరుగు తున్నాయి. స్త్రీలూ పిల్లలూ అల్లాడిపోతు న్నారు.'' అని చెప్పేడు నారాయణ.

అంతవరకూ సాలోచనగా విషయాన్ని గ్రహించే ప్రయత్నం చేస్తున్నారు కృష్ణస్వామి. కాని తన మాటలకు ముగింపుగా నారాయణ అన్న వాక్యం ఆయన మనసుమీద ఛెళ్ళున తగిలింది కొరడా అదిలించినట్లు

భౌతికమయిన బాధ కలిగినప్పుడు మతం ఏమి చేస్తుంది? అని నారాయణ ప్రశ్నిస్తు న్నాడు అతడు బాధతో మెలికలు తిరిగిపోతూ, కృష్ణస్వామికేసి దీనంగా చూస్తూ తన మాటలకు ముగింపుగా అన్నాడు

''బాబూ! యీ మతం మనిషి మనసును పెంచేందుకు దైవం ప్రసాదించిన వరం జీవిత గమనానికి గమ్యాన్ని నిర్దేశించేది కాని యీ దెబ్బలనుండి, యీ బాధలనుండి మతం మమ్మల్ని కాపాడుతుందా?'' అని ప్రశ్నించేడు నారాయణ

కృష్ణస్వామి ఆలోచించటం తప్పనిసరి అయింది

ధర్మాచరణ అనేది ఒక మానసిక వ్యాయామం అది మనసును పవిత్రం చేయవచ్చు కాని భవుతికమయిన అవుసరాలమీద, భవుతిక మయిన కష్టాలమీద అది ఎలా పనిచేస్తుంది.

సర్వసంగ పరిత్యాగుల విషయం వేరు వారు మతంకోసం ఆహారం లేకపోయినా నిలుస్తారు కుటుంబమూ, సమాజమూ, శరీరమూ అన్నిటినీ త్యాగం చేస్తారు వారికి ఏ బాదరబందీలు ఉండవు కనుక అలా చేయ గలుగుతరు

కాని మధ్యతరగతి, నిమ్నవర్గాల విషయం అలాకాదు వారికి శరీరం కావాలి కుటుంబం కావాలి సమాజం కావాలి సమాజంలో తమ స్థానం తమకుండాలి అటువంటి స్థితిలో మతం వారిని కాపాడుతుందా? వారికి వచ్చిన కష్ట నిష్ఠూరాలనుండి మతం వారిని కడతేర్చుతుందా?

మతానికి ఆ శక్తి లేనప్పుడు సామాన్యు డయిన సామాజికుడికి దాని మీద విశ్వాసం ఎలా కలుగుతుంది? మతమనేది కేవలం మహనీయుల కోసమేనా? సామాన్యులకోసంకాదా? మానసి కమూ లేదా ఆధ్యాత్మికమూ అయిన మతం భవుతికమూ లేదా శారీరకమూ అయిన బాధల్ని తొలగించగలదా? అన్నది యిప్పుడు తన ముందున్న మహత్తరమయిన ప్రశ్న దీనికి తాను సరిఅయిన సమాధానం చెప్పగలగాలి అలా చేయిలేకపోతే మతాన్ని గురించి మాట్లాడే అర్హత తనకు ఉండదు ఆ శక్తి మతమే తనకు యివ్వాలి

ధర్మోరక్షతి రక్షితః అని నారాయణకే చెప్పాడు తను వారు స్వధర్మానికి నిలబడతామని వాగ్దానం చేశారు అలాగే నిలచారు యిప్పుడీ బాధ గలిగింది ధర్మం వారిని రక్షించాలి లేకపోతే ధర్మంమీద వారికున్న విశ్వాసం తునా తునకలైపోతుంది

యిది ఎంత సంక్లిష్టమూ అగాధమూ అయిన విషయమో కృష్ణస్వామికి అర్థమయింది

ఎంత వెదికినా సమాధానం దొరకలేదు

ఆయన మనసులో ఆవేదన కలుగసాగింది ధర్మాన్ని గురించి తాను చాల ప్రసంగించాడు ఒక వ్యక్తి ఒక విషయాన్ని గురించి ఎంతైనా ఉపన్యసించవచ్చు.

కాని, అతడికి ఆ విషయం తెలుసునా? లేదా? అన్న అంశం ఆ విషయంలో చిక్కులు ఏర్పడినప్పుడు వాటిని విప్పగలిగితేకాని బయట పడదు యీ చిక్కును తాను విప్పాలి ఎలా? అనుకొని యీ పరీక్ష ఎదురు కావటంతో ఆయన మనసంతా వికలమయింది తాను వామనుడు అయిపోతున్నట్లు అనిపించసాగింది

''నారాయణా! నీవు ఆశ్రమంలోకి వెళ్ళు నేను తోటలోకి వెళ్ళి వస్తాను ఆ తరువాత జరుగవలసిన విషయాన్ని ఆలోచిద్దాం'' అన్నారు కృష్ణస్వామి నారాయణ ఆశ్రమంలోకి వెళ్ళేడు అతడు దుఃఖ భారంతో కృంగిపోయి, యీ మొత్తం భూగోళపు బరువు నంతా మోస్తున్న వాని వలె అడుగులు వెయ్యసాగేడు ఆలోచనలు ముసిరిగొనగా పరధ్యానంగా తోటలోకి నడిచేరు కృష్ణస్వామి ధర్మ సంకట స్థితి అది ధర్మాన్ని తాము కాపాడాలి లేదా ధర్మం తమను కాపాడాలి



## తిరుచరణాలు

అవి ఎలా జరుగుతొందన్నదే యిప్పుడు అర్థం కాని ప్రశ్న.

కృష్ణస్వామి ఆలోచిస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ ఆశ్రమ ప్రాంతంలోని తోట అంతా తిరుగుతున్నారు. అలా కొంతసేపు తిరిగేక ఆయనకు మామిడి కొమ్మమీద కూర్చుని తదేకంగా ఎటో చూస్తున్న ఏకవీర కనుపించింది

ఆమె అంత తదేకంగా చూస్తున్న విషయం ఏమిటో అర్ధం కాక అటుకేసి చూచేరు కృష్ణస్వామి.

లక్ష్మి, పద్మ అక్కడ కేరింతలు కొడుతూ ఆడుతున్నాయి. అదంతా బాగా శాద్వలాలు పెరిగి ఉన్నచోటు.

పద్మ నాలుకతో స్వచ్ఛంగా పాల నురుగ వర్ణంలో ఉన్న లక్ష్మి గంగడోలును నాకుతోంది. లక్ష్మి దానిని ఆశీర్వదిస్తున్నట్లు మోరచాపి తలను పద్మ శిరస్సుమీద ఉంచి కన్నులు అర మోడ్చింది. లక్ష్మి గంగడోలును నాకుతున్నందు వల్ల కలిగే సుఖంతో తల్లీనురాలై ఆదమరచి కనులు అరమోడ్చింది. పద్మ అత్యంత విశ్వాస పూర్వకంగా అలా నాకుతూనే పళ్ళతోపట్టి పశు చాపల్యంతో కసుక్కున కొరికింది.

ఊహించకుండా కలిగిన ఆ బాధతో అంబా అని అరిచింది. లక్ష్మి గంగడోలులో పళ్ళు దిగి రక్తపుజీర అయింది. ఆ అరుపుతో ఉలికిపాటు చెందిన పద్మ దూరంగా ఎగిరిగెంతి అక్కడ నిలబడి భయంగా చూడసాగింది. మైత్రీ ధర్మానికి హాని చేసినట్లు బెదిరి బెదిరి చూడసాగింది.

లక్ష్మి దానికి భయం లేదన్నట్లు అభయ ముద్రతో దానిని సమీపించింది. భయపడుతూనే పారిపోవాలా ? వొద్దా అన్న సంశయంతో అలాగే నిలిచింది పద్మ. లక్ష్మి దగ్గరగా వెళ్ళింది.

తిరిగి దానికి తన గంగడోలు అందేలా మోరఎత్తి నిలిచింది. "ఇందువల్లనే ఆవు ధర్మానికి ప్రతీక అయింది. పూజ్యమయిన జీవి అయింది. ధర్మానికి ప్రతీక అయిన గోమాత తన ధర్మ సంకటాన్ని తీర్చటం ఒక గొప్ప అనుభవం" అనుకున్నారు కృష్ణస్వామి.

ఆయన మనసు తేలికగా నిట్టూర్చింది.

"అమ్మా ! ఏకవీరా ! ఇక్కడ యిలా ఏకాంతంగా ఉండిపోయేవెందుకు తల్లీ" అని ప్రశ్నించేరాయన.

"తాతగారూ ! మీరూ ఏకాంతం కోసమే యిక్కడకు వొచ్చేరు కదూ ?"

"అవునమ్మా ! ధర్మసంకటం ఏర్పడింది. మనసు వికలమయింది. యిలా వొచ్చాను..." అంటూ నారాయణకు వొచ్చిన విపత్తూ తనకు కలిగినధర్మసందేహమూ వివరించేరు కృష్ణస్వామి.

"తాతగారూ ! గోమాత హిందూ ధర్మానికి ప్రతీకకదూ !"

"అవునమ్మా ! అర్ధమయింది."

> ## 'జ్ఞానం'
>
> మనిషిలో..
> జ్ఞానమనే విద్యుత్తు
> జీవితమనే బల్బును
> వెల్గిస్తుంది
> — మనిషిని .
> మాననీయ
> మహాలక్ష్యంవైపు నడిపిస్తుంది
>
> — సుహాసిని

"అది మీకిచ్చిన సందేశం గ్రహించేరా"

"ఊహించేనమ్మా !"

"అటు చూడండి యిప్పుడేమి జరుగ తుందో ."

కృష్ణస్వామి అటుకేసి చూచేడు అప్పుడూడ గంగడోలును పద్మ నాలుకతో స్పృశిస్తోంది మళ్ళీ తాను మోర ఎత్తుకుని పూర్వంలాగే నిస్సందేహంగా తల్లీనురాలై నిలిచి ఉంది లక్ష్మి

కృష్ణస్వామికి తన కర్తవ్యం బోధపడింది

తక్షణమే వెనుదిరిగి నారాయణను వెంట పెట్టుకుని పెద్ద పెద్ద అంగలతో వెంకన్నదొర యింటికి వొచ్చేరు

హింసాకాండ యధావిధిగా సాగుతోంది నారాయణ పారిపోయేడు కనుక, పెద్ద పటాలాన్ని వెంటపెట్టుకుని వస్తాడని ఎదురుచూస్తున్న వెంకన్నదొరకు యీ యిద్దరే రావటం ఆశ్చర్య మయింది

అతడు ఎందరొచ్చినా ఎదుర్కొనేందుకు సిద్ధమయ్యే వున్నాడు కాని కృష్ణస్వామి రాకకు తట్టుకోగల స్థితిలో లేడు

"ఆశ్రమ నిర్మాణం జరిగేప్పుడు నేనుకూడ నీవద్ద ధన సహాయం పొందాను అది తీర్చనే లేదు. వీరందరికి విధించిన శిక్ష నాకూ విధించు" అంటూ వెంకన్నదొర ఎదురుగా నిలిచేడాయన

"అదెంత పని..." అంటూ క్రోధంలో ఉగ్రుడైపోయిన వెంకన్నదొర ప్రక్కనున్న పాలేరు చేతిలోని కర్ర లాక్కుని పట్టి ఎత్తేడు.

అప్పటివరకూ తలుపుచాటున నిలిచి జరిగే దానిని వ్యధాకులితమైన మనస్సుతో చూస్తున్న గౌరిదేవమ్మ ఇహ నిగ్రహించుకోలేకపోయింది.

పరుగు పరుగున వచ్చి వెంకన్నదొరకూ కృష్ణస్వామికి అడ్డుగా నిలిచింది. కాని అప్పటికే సమయం మించిపోయింది.

వెంకన్నదొర విసిరిన దెబ్బ గౌరీదేవమ్మ తలమీద పడింది ఆమె దీనంగా అరుస్తూ నేల మీద పడింది.

మూడు దశాబ్దాలపాటు తనే సర్వస్వమని నమ్మి జీవించిన అర్ధాంగి ఆయన పాదాలమీదకు వొరిగింది

# పాలు కావాలనుకున్నప్పుడు- కామధేనువు

# విజయ పాలపొడి

మిల్క్‌షేక్ ?

ఎంతో సులభం

పసందైన ఏదైన కోరుకోండి

గులాబ్‌జామ్ ?

ఓ తప్పకుండా

VIJAYA

SPRAY DRIED

MILK POWDER

ఐస్‌క్రీం ?

అద్భుతం

విజయ పాలపొడి సిసలైన తాజా పాలకు ప్రతిరూపమే స్ప్రే డ్రయింగ్ ద్వారా పాలను పొడిగా మార్చారు ఇందులో పాలలో ఉండే పోషక పదార్థాలన్నీ ఉన్నాయి మీరు కోరుకున్న క్షణంలో నీళ్ళు కలిపి స్వచ్ఛమైన పాలు తయారు చేసుకోవచ్చు

మీ గృహంలో విజయ పాలపొడి డబ్బావుందంటే అది మీ పాలిట కామధేనువు మీరు పాలు కావాలనుకున్నప్పుడు సర్వసిద్ధం-పాలతో తయారు చేసే పదార్థాలు మీకెంతో మక్కువ పెరుగు, పాయసం, గులాబ్‌జామ్, మిల్క్‌షేక్ తాజా ఐస్‌క్రీం ఏదైనా నోరూరించేవి చేసి చూడండి

## విజయ పాలపొడి




ఉత్పత్తి చేయువారు ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్

FDS APDDCFL 39 83 Tel

తన భార్య రక్తంతో తడిసిన నేలమీద పడి విలపించసాగేడు వెంకన్నదొర గౌరీదేవమ్మ భర్త చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని కళ్ళకు అద్దుకుంది వెంకన్న మనసుకు ఆమెకన్నా పెద్ద గాయమే అయింది

## 18

శ్రీదేవుడు తన జీవిత గమనం ఎటు? అనే విషయాన్ని వెంటనే తేల్చుకోవాలని నిశ్చయించేడు ఆ రోజు పూర్ణాహుతి, ఆశ్రమం చాలా కోలాహలంగా ఉంది ఆ గ్రామస్తులేకాక చుట్టుప్రక్కల గ్రామాల నుండికూడా అనేకులు వొచ్చేరు అటు యజ్ఞ సంరంభాన్నీ ఇటు రాణి రుద్రాంబనూ చూచి తరించాలని వారి కోరిక. ఏకవీరతో తుది పలుకులు పలికేందుకు అనువయిన సమయం శ్రీదేవునికి లభించలేదు ఆమెను మాటల మధ్యనపెట్టి ఎలాగో వూరి వెలుపల తోటలవయిపు నడిపించేడు శ్రీదేవుడు

ఒక తోటలో ప్రశాంతమయిన చోట వారిద్దరూ చోటు చేసుకున్నారు ఏకవీర పరధ్యానం విడువనేలేదు.

"ఏకవీరా! ఏకవీరా!!"

"ఊఁ"

"నేను ఆశ్రమానికి వచ్చిన కార్యం పూర్తి అయింది."

"సంతోషం నేను యీ ప్రపంచంలోకి వచ్చిన పని పూర్తి అయినట్లు లేదు. అదే నా చింత" అన్నది ఏకవీర

"మహామంత్రి ఓరుగల్లు రావలసిందిగా నన్ను ఆదేశిస్తున్నారు"

"అదృష్టశాలివి శ్రీదేవా నీవు"

"నేను కోరిన అదృష్టం కాదిది"

"మన మనస్సులోని కోరికలకూ జీవిత గమనానికి పొత్తు కుదరదు. అది ప్రకృతి ప్రతి క్షణం మనకు గుర్తుచేసే సత్యం."

## తిరుచరణాలు

"నీవు ఏవో మాట్లాడుతున్నావు నా మనసు అర్థం చేసుకోలేకపోతున్నావు నేను ఉపాసించే దేవి నాకు కావాలి"

"ఎవరూ? నేనేకదూ ఆ దేవిని" అంటూ పకాపకా నవ్వింది ఏకవీర

"శ్రీదేవా! నాకు అంతా తెలుసు సువిశాలమయిన పరిధిలో, బృహత్తరమయిన ఆశయాలతో, ఉత్తుంగ రస తరంగాలతో ఉత్తేజితం కావలసిన నీ జీవితాన్ని నీవు, నీరసమూ, నిర్హేతుకమూ అయిన ప్రేమ అనే రెండక్షరాలకు అంకితం చేయదలచావా? ఎంత పొరపడినావయ్యా! నాలో నీవు ఏమిచూచేవు?"

"నీలో నా సర్వస్వాన్నీ చూచేను ఏకవీరా! నీలో నా అంతర్యాన్ని చూచేను. నీలో నా భవితవ్యాన్ని చూసేను నీలో నా ఆత్మను చూచేను" ఆవేశంతో చెప్పేడు శ్రీదేవుడు

"అదే ప్రేమ అంటే దానిని యింకా సువిశాలం చెయ్యి యీ అనుభూతి నీకు సర్వత్రా కలుగుతుంది. ఒక సామాన్య స్త్రీలో నీవు నీ ఆత్మను చూడగలగటం ప్రేమ గొప్పదనమే కావొచ్చు పరాసక్తనూ, ఒక సామాన్యురాలని అయిన నాలో చూచిన ఆత్మను నీవు ప్రకృతిలో దర్శించలేవా? నీ ప్రేమ అమృతాన్ని ఒక్క నాకే యివ్వాలని ఎందుకు అభిలషిస్తున్నావు దాన్ని సమాజం పరం చెయ్యి ఆ అమృతాన్ని అందరికీ సమంగా పంచి యివ్వు" అన్నది ఏకవీర

ఈ మాటలు వింటూనే శ్రీదేవునికి రోమాంచితమయింది అతనికి ఏదో దివ్యానుభూతి కలుగసాగింది తనకు తానే తగిలించుకున్న సంకెళ్ళను ఏకవీర ఛేదించుతున్నట్లు అనిపించుతోంది తన్మయుడై ఆమెకేసి రెప్ప వేయటం మరచి చూసేడు.

"ఏకవీరా! నిన్ను నేను ప్రేమించాను కనుక నీ మాటను ఆదేశంగా భావిస్తాను కాని నీవు యిలాగే " అంటూ ఏదో చెప్పబోయేడు

" అవును నాకు ఏకాంతం కావాలి" అతడి మాటలకు మధ్యలోనే అడ్డువస్తూ అన్నది ఏకవీర.

శ్రీదేవుడు వొంగి ఆమె పాదాలను తాకేడు

"నీవు శక్తిస్వరూపిణివి. కారణజన్మురాలివి" అంటూ ఆమె పాదాలను అశ్రువులతో అభిషేకించేడు

"శ్రీదేవా! జీవులందరూ కారణజన్ములే నా స్వామి క్రీడావినోదానికి పావులయ్యేందుకు సృష్టించబడినవారు వారిమధ్య మళ్ళీ తరతమ భేదాలెందుకు చూపుతావు" అన్నది ఏకవీర.

శ్రీదేవుని దృష్టిలో ఆకాశమెత్తున ఎదిగిపోయింది ఏకవీర ఆమె ముందు నిలిచి ఆమె ఏకాంతాన్ని భగ్నంచేసే అర్హత తనకు లేదని తలపోసేడు శ్రీదేవుడు వెంటనే వెనుదిరిగేడు కన్నీటి పొరలతో.

ఏకవీర అంతర్ముఖురాలయింది.

"ఏకవీరా! ఏకవీరా!!" మేఘ గంభీరమయిన స్వరం ఆమె ఏకాంతానికి భంగం కలుగజేసింది

"ఊ! ఎవరూ?" ప్రశ్నించింది ఏకవీర

"నేనమ్మా! నీ తండ్రిని జైనస్వామిని" జైనస్వామి మొగిలిచర్లలో పరిణామాలు విని అంతకుముందే అక్కడకు వొచ్చేడు. వెంకన్న దొరలో పరివర్తన రావటం ఆయనకు పెద్ద అవరోధమయింది.

ఇక దాడిచేయటం తప్ప మార్గాంతరంలేదని ఆలోచిస్తూ వుండగా ఏకవీర వనవిహారానికి వొచ్చిన సంగతి చారులవల్ల తెలిసి ఆయన పరుగు పరుగున వొచ్చేడు.

**(ఇంకా వుంది)**

# వారఫలం

22-7-1983 శుక్రవారం మొదలు 28-7-1983 గురువారం వరకు

♈ మేషం · ఆదాయ మున్నది· వ్యాపారం లో ప్రగతి కనిపిస్తుంది · పత్రికాధి పతులకుగాని, సాహితీ వ్యాసంగం లో ఉండేవారికి సర్వాను కూలత చేకూర గల వారం. స్త్రీలకు సుఖ శాంతులు, ఆనందానికి, ఉద్యోగావ కాశానికి అను కూల వారం

♉ వృషభం· దూర ప్రాంతాల నుండి విచిత్ర వర్తమానం రానున్నది. మీ యాశలు ఫలించే అవకాశ మున్నది కళా సాహితీ రంగంలో పెద్ద ఎత్తున మేలు పొంద మన్నారు. స్త్రీలకు· నగలు కొనుగోలు చేయ గల అవకాశ మున్నది·

♊ మిధునం: మీరు భూములు కొనను న్నారు మీ ఆశలు ఫలించే అవకాశా లుంటాయి· అన్ని విధాల ప్రగతి ఏర్పడు తుంది· శాంతి సుఖాల కాలవాలమైన వారం గా పరిగణించండి స్త్రీలకు : కళా రంగానుభవం గల వారికి నిరాక్షేపణగా లాభిస్తుంది

♋ కర్కాటకం· రంగస్థల నటులకు, గాయకులకు, హరిదాసులకు, పెద్ద ఎత్తున వ్యాపారం చేసే వారికి సర్వ విధాలా అనుకూలం · వివిధ రంగాలలో పని చేయు వారికి ప్రగతి మార్గానుకూలం చేకూరు తుంది స్త్రీలకు. దూర బంధు సమాగమం, విశ్వయం·

♌ సింహం: పెద్దల వలన , రాజకీయ నాయకుల వలన , అధికారుల మూలాన జరగ వలసిన పనులున్నా , కోర్టు వ్యవహారాలున్నా మీకు అనుకూల దాయకమే . స్త్రీలకు: వస్తు వాహన సేకరణకు , నూతనోద్యోగానుకూలతకు అవకాశ మున్నది·

♍ కన్య. ఆదాయం ఉన్నది కలిసి రాగల వారం· ప్రజా రంగంలో మీకు పేరు ప్రతిష్ఠ లుంటాయి· మాటకు విలువ పెరుగు తుంది· రాజకీయంగా కొందరకు మేలు చేకూరు తుంది స్త్రీలకు. వస్త్ర వాహనాలు సమకూరు తాయి · ఉత్తరాల మూలంగా మీకు నూతన సమాచారం అందు తుంది

♎ తుల · సుఖ శాంతులకు , ఆదాయానికి , సారస్వత రంగంలో మేలు చేకూరు టకు అనుకూల వారం. శత్రు వర్గీయుల మూలంగా యిబ్బందులు రానున్నవి· జాగ్రత్త! స్త్రీలకు· నూతన గృహ వసతి యేర్పడుటకు అవకాశ మున్నది·

♏ వృశ్చికం · ప్రజా రంగం లో పేరు ప్రతిష్ఠలు రానున్నవి· ఆదాయం లో అధికం గా అనుకూలత చేకూర గలదు· అధికారుల మూలంగా ఆదరణ చేకూరుతుంది స్త్రీలకు నూతనాంశాలు తెలిసికోవటం, వస్తు వాహన సేకరణకు అవకాశం గలవారం

♐ ధనుస్సు: అన్ని విధాలా ఉత్తమ ఫల దాయక వారమే గాని, తలచిన, అను కొన్న , సర్వ విధాలా ఆయత్త మైన శుభ కార్యానికి విఘ్నం రాగల అవకాశ మున్నది స్త్రీలకు: నూతనంగా చేసిన ప్రయత్నాలు విద్యా విషయం గా అయితే అను కూలత చేకూర గలదు·

♒ మకరం: ప్రజా రంగంలో పేరు ప్రతిష్ఠలు అను కొన్న విధం గా మేలు , ఆదాయం లో అభివృద్ధి , అయినవారి లో గౌరవం , ఆత్మీయుల అనుకూలత చేకూర గల వారం· స్త్రీలకు: సర్వ విధాల అనుకూలత చేకూర గల వారంగా గ్రహించి శ్రమించాలి

♑ కుంభం: వ్యాపార రంగం లో మీకు పేరు ప్రతిష్ఠలు అతిశయించటం , ఆదాయం చేకూరటం గమనింప దగిన అంశం · వ్యాపారం లో నూతన మార్గం ఏర్పడ నున్నది· అథవా అది జాయింటు వ్యాపారం కావచ్చు స్త్రీలకు: బంధు విరోధం , ఏ పనీ ఎటూ తెమలక పోవటం కనిపిస్తుంది

♓ మీనం: రాజకీయంగా మేలు చేకూరటం, ప్రజా హిత రంగానుభవం గడించటం , విలువ గల వస్తువులు సేకరించు కోవటం , అధికారుల మూలంగా జరుగ వలసిన పను లున్నా , కోర్టు వ్యవహారాలు న్నా అనుకూలమే · స్త్రీలకు· సుఖ శాంతులు నూత్న విధాన ఆదాయం సమకూడే వారం

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం



చీనా అధ్యక్షుడుగా 78 సంవత్సరాల లీశియెన్ నియెన్ ఎన్నిక అయ్యారు 1968 లో లియుషావ్‌చీ ఈ పదవిలో ఉండే వారు మావ్‌డ్జడుంగ్ కీ ఆయనకీ పడేదికాదు. అందుచేత ఆయనని ఆ పదవినుంచి తీసివేశారు, అంటారు .



బ్రిటిషు ప్రధాన మంత్రి మార్గరెట్ థాచర్ భర్త డెనిస్ థాచర్ ఈయన రెండవ ప్రపంచ యుద్ధం లో 'మేజర్' శ్రేణి దాకా వచ్చారు. ఆయన రంగులు తయారు చేసే కంపెనీని నడుపుతున్నారు థాచర్ దంపతులకి కవల పిల్లలు (అమ్మాయి కారాల్, అబ్బాయి మార్క్) ఉన్నారు. వయసు 29 .



పయొనీర్ 10 అంతరిక్షనావ 11 సంవత్సరాల కింద భూమిని వదిలింది. గురుగ్రహాన్ని సమీపించి ఆ ఖగోళం యొక్క బొమ్మలు తీసింది ఇటీవలే పయొనీర్ సౌర కుటుంబాన్ని వదిలి అంతరిక్షపు అగాధాలలోకి వెళ్లిపోయింది. ఇంకొక 10,000 సంవత్సరాలు ఈ చిన్న అంతరిక్షనావకి ఏ నక్షత్రమూ "తటస్థ" పడదుట అప్పటికి బార్నార్డ్ నక్షత్రం ఈ నావకి సుమారు 100 కోట్ల మైళ్ల దూరంలో ఉంటుందిట. ఆకాశపు లోతులనుంచి అణుశక్తితో పయనించే పయొనీర్ సందేశాలు అంది ఈ విశ్వం రహస్యాలు మరికొన్ని తెలియగలవని శాస్త్రవేత్తలు ఆశిస్తున్నారు.




గుంటూర్లో బస్సు ఆగగానే బిల బిల మంటూ దిగటం ప్రారంభించారు ప్రయాణీకులు.

తన లగేజ్ వేపు దిగులుగా చూసుకుంటూ సీటులో నుంచి లేచి నిలబడింది శిల్ప. రెండు చేతులంటోటే రెండు బుట్టలూ పట్టుకునేసరికి ఇదే సందని జారటం మొదలెట్టింది పైట

కుడిచేతిలో బుట్ట కిందపెట్టి, పైట గట్టిగా లాగి చేతికింద నుంచి బొడ్లో దోపింది.

"త్వరగా దిగమ్మా" అసహనంగా అంటున్నారు వెనక నిలబడ్డ పాసింజర్లు

"మీరు దిగండి మేడం. లగేజ్ నే నందిస్తాను" అన్నాడొకతను.

ఒక్కొక్క వస్తువూ అందుకుని పక్కన పేర్చింది. మొత్తం ఎనిమిదిశాల్తీలు. చుట్టూరా చూసింది శిల్ప. ఎక్కడా భర్త జాడ లేదు. టెలిగ్రాంఇచ్చినా అతను రానందుకు ఉక్రోషంతో ఎర్రబడిందామె ముఖం.

ఇంతలో ఇద్దరు మనుషులొచ్చి గబగబా రెండు చేతులలోకీ ఆమె సామాను తీసుకుని, ఆమె ప్రమేయం లేకుండానే ముందుకు రెండడుగులేసి "రండమ్మా! రెండు రిక్షాలు కావాలిగా" అంటూ "అరె పొండెహె. ముందుగా మేమడిగాం" అని పక్కవాళ్ల నదిలిస్తున్నారు

"నాకసలు రిక్షా వద్దు ముందు సామానక్కడ పడెయ్యండి" అని అరిచి, చుట్టూ చూసి ఉలిక్కిపడింది శిల్ప

యాక్సిడెంటయితే గుమిగూడినట్లు రిక్షా వాళ్లూ, ఆటోవాళ్లు గుండ్రంగా ఆమె చుట్టూ నిలబడ్డారు ఒకళ్ల భుజంమీద ఇంకోళ్లు చేతులేసుకొని...అంత లగేజ్ తో ఒంటరిగా నిలబడ్డ శిల్పను వినోదంగా చూస్తూ వాళ్లలో వాళ్లు వాదించుకుంటున్నారు కొందరు.

"ఎక్కడికెళ్లాలి? ఏ పేట? నా రిక్షాలో రండి.. ఒక్క రిక్షా చాలదమ్మా నా ఆటోలో రండి" అంటూ ఆమెను ఊపిరి తీసుకోనివ్వటల్లేదు వాళ్లు.

భయంగా దిగులుగా ఉందామెకు

"రెండు రిక్షాలట్టుకొచ్చేస్తాం బేగి చెప్పమ్మా, ఏ పేట? గమ్మునెళ్లిపోదాం." ఇంకో ఇద్దరు రిక్షావాళ్లు మళ్లీ ఆమె సామాను అందుకోబోయారు

"రెండు రిక్షా లెందుకెహె! నా ఆటోలో రండమ్మా సామానంతా నే సర్దుతాను" ఆటోవాడు తోసుకొచ్చాడు.

"లక్ష్మీపురమెళ్లాలి ఏం తీసుకుంటావ్?" అన్నది శిల్ప.

"ఆర్రూపాయలివ్వండి."

"ఆరా!"

"ఆరంటమేగానీ.. ఏమెుస్తున్నాయమ్మా వాటికి? రెండు రిక్షాలకీ వాళ్ళు ఎనిమిది రూపాయలు తీసుకుంటారు నేను ఆరుకే వస్తానంటునాను గదా! పోనీ అయిదున్నర చేసుకోండి!"

వాళ్ళిద్దరికీ బేరం కుదిరిపోతోందని గ్రహించి "ఆయమ్మ రెండు రిక్షాలు కావాలంటే -నువ్వు ఒక్క ఆటో చాలంటూ వెళ్ళి మా నోళ్ళు కొడతావా! ఇంత లగేజెట్టా సదుర్తావ్?" అని విరుచుకుపడుతూ— "ఎల్లండెల్లండమ్మా. ఈ ఆటోవాళ్ళ సంగతెవురికి తెలీదు? సామానెట్టపట్టుద్దో మేం చూడం?" అంటూ శిల్పను ఎద్దేవా చేశారు రిక్షావాళ్ళు.

నవ్వులు. కేకలు తిట్లు

ముందీ వాతావరణం నుంచి బయట పడకపోతే పిచ్చెక్కేలా ఉందామెకు

"ఇక్కడో ఇద్దరు పోలీసుల్ని పెట్టకూడదూ? వీళ్ళంతా ఇలా దౌర్జన్యంగా




# భయం....భయం!

## — ఆదూరి సావిత్రి

ప్యాసింజర్ల మీదికెగబడి వెర్రెత్తించకుండా" అని విసుక్కుంటూ సూట్‌కేస్ చేత్తో పట్టుకుని బేరమాడ్డం సంగతికూడా మర్చిపోయి ఆటోవాడి వెనకాల నడిచిందామె.

వెనక సీట్లో ఆమె పక్కన రెండు బుట్టలు, మిగతావి కాళ్ళ దగ్గరపెట్టి, ఆఖరుగా మిగిలిన రబ్బర్ బకెట్‌ను ముందు సీట్లో పెట్టాడు ఆటో డ్రైవరు. బయల్దేరబోతూ పక్కకు తిరిగి ఎవడి వంకో చూసి ఈల వేసి నవ్వాడు.

"కొట్టు గురో!" అంటూ అవతలివాడు కూడా నవ్వాడు.

రయ్యిన ముందుకు దూకింది ఆటో.

"ఏమిటి వాళ్ళ భాష? కొంపతీసి ఆటోను దారి మళ్ళించి ఊరుబైటికి లాక్కుపోడు గదా!"

గుండాగినంత పనయింది శిల్పకు. అప్రయత్నంగా చెయ్యి మెడమీదకు, చూపు చేతులమీదకూ తిరిగాయి

ఈ గొలుసూ, గాజులూ వాడు చూసే ఉంటాడు. వాడికి వీడేమన్నా సంకేతం పంపాడా? ఎన్ని జరగటంలేదీ గుంటూర్లో!

అమ్మో! ఇప్పుడెలా?

ఆటో గుంటలోపడి ఒక్క జర్క్ ఇచ్చింది ముందుకు తూలబోయి ఆపుకుంటూ "ఆ బకెట్‌లో ఆవకాయ ఉంది. మూత ఎగిరిపోయిందేమో చూడు." అసంకల్పితంగా అన్నదామె

"సరిగ్గానే ఉంది." అంటూ తల కాస్త పక్కకు తిప్పి నవ్వాడతను.

"బాబోయ్! వీడు రౌడీ చచ్చినాడు. అలాగే ఉన్నాడు. లేకపోతే ఆ నవ్వేమిటి? వీడేదో చేస్తాడు .."

రక్తప్రసార వేగం అంతకంతకూ ఎక్కువవుతోందామెకు. 'ఆటో దారిమళ్ళిందా? లక్ష్మీపురం ఇటేనా? దరిద్రపు గోల, తనకు సరిగ్గా దారి తెలిచ్చావదు. స్టేషన్ మంచయితే తెలుసు. బస్టాండు నుంచి తెలీదు. వీడెటు తీసుకెడుతున్నాడో! తను ... భర్తనూ, పిల్లల్నీ చూస్తుందా? లేకుంటే రేపొద్దున్న వార్తల్లో.'

ఒళ్ళంతా చెమటలు పట్టేస్తున్నాయి. గుండె గొంతులో కొచ్చేస్తోంది ఊపిరి బిగబట్టి చూస్తోంది శిల్ప .. ..

రిక్షాలోనన్నా వచ్చింది కాదు. గబుక్కున దూకొచ్చు. ఆటోలో అదీ వీలవదు ..

నెర్వస్‌గా ముఖం తుడుచుకుంది. కళ్ళ దగ్గరా బుగ్గల దగ్గరా తడి

ఏడుస్తోంది తను?!

ఆటో గుద్దెద్దు చేల్లో పడ్డట్టు వెడుతూనే ఉంది.

భయం.. భయం.. భయం!

శంకర విలాస్ ముందుకొచ్చాక కాస్త ఊపిరందిందామెకు లూథరన్ కాలేజ్ ముందు కొచ్చేశాక ఎక్కడలేని ధైర్యం వచ్చింది

"ఆ పక్క సందు కాదు. రెండో సందుకు పోనియ్యి"

"ఆఁ ఆఁ ఇదే ఇల్లు ఆపు" ఉత్సాహంగా అన్నదామె.

"ఇదేమిటీ! ఏ ఆపదా జరక్కుండా సజావుగా ఇంటి కొచ్చేసిందాతనొక్కతీ?!"

ఊరగాయ బకెట్ దింపుతూ "తొణక లేదమ్మా" అంటూ నవ్వాడు ఆటోవాడు

ఇప్పుడీ డ్రైవర్ ముఖం రౌడీ ముఖం లాగానూ .. నవ్వు కుటిలంగానూ అనిపించటం లేదామెకు. అతని మొహంలో నమ్రత నవ్వులో ఆత్మీయతే కనిపిస్తున్నాయి

ఆరు రూపాయలు తీసుకుని "చిల్లర లేదమ్మా" అంటున్న డ్రైవర్‌తో "పోన్లే ఉంచేసుకో" అన్నది శిల్ప ఉదారంగా. ★

# కొత్తగొంతులు

— టి.యల్. కాంతారావు

హిమాలయ చిత్రాల మంచు
సోనల నీడల్లోదాక్కుంటాను
అక్కడొక్కచోటే మనిషి
జ్ఞాన నేత్రం తెరుచుకుంటుంది
మాటి మాటికీ
బ్రతుకు దుఃఖాలకి ఆడపిల్లలా
కన్నీళ్ళు నింపుకునే నగ్ననేత్రం
చీకిపోయి నీళ్ళోడి
చివరికి అక్కడొక్కచోటే జ్ఞాన
దీపం వేడిగా కాల్తుంది
— వేగుంట మోహనప్రసాద్

వర్తమాన వచన కవిత్వంలో ఒకరిని తను అనుసరించకుండా, అనుకరించకుండా, వేరొకరు తనను అనుసరించడానికి, అనుకరించటానికి అవకాశం లేకుండా పేరు లేకపోయినా ఈ గేయం మోహనప్రసాద్‌ది అనుకునేటంత గాఢమైన సొంత ముద్రతో కవిత్వం రాస్తున్నవాడు మోహనప్రసాద్. అమెరికన్, ఫ్రెంచి, ఆంగ్ల కవులను, రచయితలను, విమర్శకులను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన సాహిత్య సంస్కారం మోహన్‌ప్రసాద్‌ది తెలుగు కవిత్వంలో, తెలుగు వచనంలో ఒక కొత్త పోరవడికి మోహన్‌ప్రసాద్ కారకుడు శ్రీశ్రీ, నారాయణబాబులలో అధివాస్తవిక కవిత్వమే తెలుగు సాహిత్యంలో రంగప్రవేశం చేస్తే మోహన్‌ప్రసాద్ 'బ్రతికిన క్షణాల' (భారతి)లో అధివాస్తవిక వచనం సాహిత్యంలో ప్రవేశించింది వచన రచనలో మోహనప్రసాద్ బ్రతికిన క్షణాలు సాహసిక ప్రయోగమే కాకుండా సారస్వత వారసత్వంగా సంక్రమిస్తే బాగుంటుంది. ఇండో ఆంగ్లియన్, అమెరికన్, ఆంగ్ల కవిత్వాలపై ఆయన అనేక వ్యాసాలు రాశాడు ఆయన 'చితి — చింత' కావ్యం 1969 లో అచ్చు అయింది 1969 లోనే ఫ్రీవర్స్ ఫ్రంటు ఎవార్డు ఆ కావ్యానికి లభించింది ఆనంతరం ఆంధ్రజ్యోతిలోనూ, భారతిలోనూ గేయాలు రాశాడాయన ఉయ్యూరు కళాశాలలో పనిచేసేటప్పుడు రోటరీ ఇంటర్నేషనల్ ప్రోగ్రామ్‌లో అమెరికా వెళ్ళొచ్చాడు ఇప్పుడు సిద్ధార్థ కళాశాల విజయవాడలో ఆంగ్ల శాఖాధిపతిగా పనిచేస్తున్నాడు. 1981 మేలో పబ్లిష్ అయిన ఆధునిక తెలుగు కవిత్వానికి ఆంగ్లానువాదంలో వచ్చిన 'దిస్ టెన్స్ టైమ్' అనే యాంథాలజీకి ఆయన సంపాదకుడు. లోపాలోపాలను అట్లా ఉంచితే ఆ యాంథాలజీకి ఆయన చేసిన కృషి తెలుగులో ఇతఃపూర్వం మరొకరెవ్వరూ చెయ్యలేదని తెలుస్తుంది దాని ఉపోద్ఘాతంలో ఎడిటర్‌గా ఆయన కవులను వారి ఉపపత్తిని పరిచయం చెయ్యడమేకాక కవిగా తను వెల్లడించిన అభిప్రాయాల్లో ఆయన తత్వం కొంతైనా పాఠకునికి తెలుస్తుంది

ఇరవయ్యో శతాబ్దంలో ఆధునిక తెలుగు కవిత్వంలో రెండువర్గాలు కనబడతాయి వ్యక్తివాదం ఒకటి; సామాజిక వాదం రెండవది మోహన్ ప్రసాద్ కవిత్వం అంతా వైయక్తికం, ఆత్మికం అయినది దుఃఖం, కన్నీళ్ళు, జీవుని వేదన, జీవిత వైఫల్యం, నైరాశ్యం జీవుని అస్తిత్వాన్ని గురించిన ఆలోచన— ఇది ఆయన మనో యవనికమీద చెరగని ముద్రను వేసి కవిత్వంగా రూపు దిద్దుకొన్నాయి అతని కవిత్వమంతా ప్రతీకవాద ఛాయలతోనూ, అస్తిత్వవాద ఛాయలతోనూ, ఇమేజిస్టు కవితా ఛాయలతోనూ నిండి ఉంటుంది. కవిత్వంలో లెఫ్ట్ థింకర్స్‌ని మినహాయిస్తే రెండవ వర్గపు వారిని ప్యూర్ పొయెట్స్‌గా మోహన ప్రసాద్ భావించాడు. వారి సమస్యలన్నీ ఎగ్జిస్టెన్సియలిస్టిక్ అని అందువల్లనే ఆయా కవుల కవిత్వంలో అంతర్ముఖీనత, సంక్లిష్టత, అర్థాద బోధకత, అస్పష్టత చోటు చేసుకున్నాయని, వ్యక్తికీ, వ్యష్టికీ మధ్య సంఘర్షణలో శుద్ధ కవులు ఊండెడ్ సోల్జర్స్‌గా మిగిలారని మోహన్ ప్రసాద్ చెప్పాడు

మోహన ప్రసాద్ కవిత్వమే కాదు ఏ కవిత్వమైనా అర్థం కావటానికి చదివే పాఠకునికి కవిత్వ సంస్కారం ఉండాలి,



బోధపరచుకుందామనే చిత్తశుద్ధి వుండాలి మోహన్ ప్రసాద్ కవిత్వాన్ని అనుజీవించటానికి ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ ప్రత్యేకం, సమగ్రం అయిన మార్గాల్ని వెతకవలసి ఉంది అని వేల్చేరు నారాయణరావుగారు చెప్పారు ప్రతిపదార్థ, తాత్పర్యాలతో ఆధునిక కవిత్వాన్ని అర్థం చేసుకొనటం, ప్రాచీన ఆలంకారిక శాస్త్రీయుధాలతో విలువ కట్టే రోజులు ఎప్పుడో పోయాయి మోహనప్రసాద్ కవిత్వాన్ని, అర్థం చేసుకొనటానికైనా, దాన్ని గురించి ఏదైనా చెప్పటానికైనా ఒక్క తెలుగు విమర్శ, తెలుగు కవిత్వమే చదువుకున్న వాళ్ళకు కష్టం మనస్తత్వశాస్త్రం, అస్తిత్వ వాద పూర్వాపరాలు, ప్రతీకవాద కవిత్వం స్వరూప స్వభావాలు ఇత్యాదులైన అంశాలతో ఏ కొంచెమైనా పరిచయం లేకుండా అతన్ని అర్థం చేసుకొనటం కష్టం అర్థం కావటానికి ముందు కవిత్వం అనుభూతం కావాలి ఆ లక్షణం మోహనప్రసాద్ కవిత్వంలో పుష్కలంగా ఉంది కవిత్వంలో అతనుపయోగించే శబ్దాలకు అంతర్లీనమైన లయ లక్షణం ఒకట్నుంటుంది ఆ లయలో మనకు దుఃఖ ధ్వనీ వినపడవచ్చు నైరాశ్య ధ్వనీ వినపడవచ్చు, కన్నీటిబొట్లు టపటప రాలుతున్న శబ్దమూ వినపడవచ్చు. అతనుపయోగించే పదానికి, వాక్య నిర్మాణానికీ, అంత బలమూ, అంత శక్తీ ఉన్నాయి అతనిచ్చే భావచిత్రాలు సాంద్రమైన కవితానుభూతితో పాఠక హృదయాన్ని రసార్ద్రం చేస్తాయి

కృష్ణశాస్త్రిగారికి ఉగాదులు, ఉషస్సులూ లేనట్లే ఈయనకు కూడా కార్తీక పూర్ణిమా స్నానములు కృశాంగిత నిజాకృతికి వెన్నెల వస్త్రములూ లేవు ఎవరెన్ని చెప్పినా చివరకు అంతా చింతాక్రాంతులయ్యే ఉంటారని, ఈ జీవితం రామదాసు చెరసాల అని, ఎండా వానల నర్తనశాలని ఈయన విశ్వాసం

ఎన్ని సంవత్సరాల దూరాన్నించైనా
ప్రజల ప్రపంచోత్సవ కోలాహలం
లోంచైనా
సమాధిలో ప్రాణం విడిచిన యోగి
పటకుటీరంలోనైనా
కొండలమీంచీ లోయల్లోంచీ
ఎక్కడ్నించైనా విను
ఒకటే జీవనాదం — ఆనందం
వియోగంలోనూ విస్మృతిలోనూ
ఒకటే ఆత్మగతమైన చిత్రం—ప్రేమ
ఎవరాశించినా ఆనందాన్ని ప్రేమనే
కాకపోతే ప్రేమ స్థానాన్ని స్వార్థం, ద్వేషం, ఈర్ష్య, అసూయలు ఆక్రమిస్తే ఇప్పుడున్నట్లే ఉంటుంది సంఘం 

# రైతుల పాలిటి కల్పతరువు
# రామగుండం యూరియా




ఆంధ్రప్రదేశ్‌లో తయారు చేయబడుతున్న
యూరియా, రామగుండం యూరియా.

అన్ని పంటలకు, అన్ని కాలములకు అనువైన ఎరువు.

వాడండి
రామగుండం యూరియా.

**స్వస్తిక్ బ్రాండ్
యూరియా**




**దీ ఫెర్టిలైజర్ కార్పొరేషన్
ఆఫ్ ఇండియా లిమిటెడ్**

అమ్మకపు విభాగము
6-2-30/C, లకిడి కా పూల్,
హైదరాబాదు-500 004.

సీరియల్

# శ్వాస మురళి

కొడాలి సాంబశివరావు

(గత సంచిక తరువాయి)

పది రోజులు గడిచాయి. ఈ పది రోజుల్లో వాళ్లు రెండుసార్లు కలుసుకున్నారు. కానీ మురళి పెళ్లి విషయం మాత్రం ఏమీ తేల్చి చెప్పలేదు.

ఆమెకై ఆమె చెప్పేంతవరకు అడక్కూడదనుకున్నాడు విజయ్.

మరో పది దినాలు గడిచేయి.

అతని ఆరాటం అధికమవుతోంది. ఆమె తిరస్కరిస్తుందేమోనని అనుమానం, మనసును పీడిస్తుంది. అందుకే ఉండబట్టలేక అడిగేసాడు మళ్లీ.

ఆమె నవ్వింది తీయగా;

"నిజం చెప్పు మురళీ! నేనంటే నీకు ఇష్టం లేదా?"

"అని నేను అన్లేదుగదా!"

"మరి ఇష్టమేనా? —" ఆశతో అతని కళ్లు తళుక్కుమన్నాయి.

"ఆ మాట కూడా నేను చెప్పలేదు —" అల్లరిగా నవ్వుతున్నాయి ఆమె కళ్ళు.

"అబ్బ! నన్నెందుకిలా ఏడిపిస్తున్నావు మురళీ! ఈ రోజు ఏదో ఒకటి తేల్చి చెప్పేంతవరకు నిన్ను వదలను —"

"నేనూ అదే కోరుకుంటున్నాను..."

చటుక్కున తలెత్తి ఆమె కళ్లలోకి చూసాడు విజయ్.

ఆమె సోగకళ్ళు రాగఝరులను ప్రవహింపచేస్తున్నాయి.

'పిచ్చివాడా! ఆడదాని మనసు తెలుసుకోలేకపోయావు. అంత ఇష్టం లేకపోతే ఇన్నాళ్లూ నీతో ఎందుకు తిరుగుతాను? నీమీద అంతులేని అనురాగం వుంది. నీవంటే ఇష్టమే —' అని చెబుతున్నట్లున్నాయా కళ్ళు.

ఆ భావన అతనిలో నవచైతన్యాన్ని కలిగించింది.

"మురళీ! నీ సోగకళ్లు చెప్పే కథలు విన్నాను. నన్ను నీ జీవితంలోకి ఆహ్వానిస్తున్నాయి. వచ్చేస్తున్నాను. ఇక వెనక్కి వెళ్లమన్నా వెళ్లను —" ఉత్సాహభరితంగా అంటూ చటుక్కున ఆమె చేతిని అందుకుని మృదువుగా స్పృశించాడు.

మురళి అందంగా సిగ్గుపడింది.

ఆ క్షణంలో విజయ్‌లో కలిగిన ఆనందం ఇంతా అంతా కాదు. అందని ప్రేమశిఖరాల్ని అధిష్టించినట్లు, సర్వసామ్రాజ్యాన్ని జయించిన రాజాధిరాజులా మహోగర్వంగా ఫీలయ్యాడు.

ఆ తరువాత ఎన్నోసార్లు బీచ్‌లో కలుసుకున్నారు. స్వేచ్ఛగా, సంతోషంగా తిరిగారు. ఎన్నో ఊసులాడుకున్నారు. బాసలు చేసుకున్నారు. మనుషులు వేరయినా హృదయం ఒక్కటే అన్నట్లుగా గడిపేరు...

*          *          *

విజయ్ గాఢంగా నిట్టూర్చి ఇసుకలోంచి లేచి నిలబడ్డాడు. హాస్టల్‌వైపు దారితీసాడు.

ఆ రాత్రి అతనికి నిద్ర కరువయింది.

మనసు పచ్చి పుండులా అయింది. మస్తిష్కంనిండా జోరీగల్లా ఆలోచనలు ముసురుకున్నాయి. ఏంచేయాలో — మురళిని ఎలా అర్థం చేసుకోవాలో తెలీక తెగ అవస్థ పడ్డాడు.

'మురళీ! ఎందుకంత కఠినంగా మారిపోయావు? కారణం చెప్పకుండా కనుమరుగైపొమ్మన్నావు. ఇదేమి న్యాయం? నిదురించే నా హృదయాన్ని తట్టిలేపి ప్రేమగీతాన్ని నేర్పించావు. శృతులు సవరించుకుని మనసు ఆ ప్రేమగీతాన్ని ఆలపించబోతే వద్దని ఎన్నటికీ ఆ గీతం పాడవద్దని, మనసులోంచి తుడిపేయమని శాసిస్తున్నావు.

ఎందుకు?

అసలు నా జీవితంలోకి ఎందుకు ప్రవేశించావు? ఎందుకు దూరమవుతున్నావు? నా జీవితంతో ఆడుకుని తమాషా చూసావు. దగా చేశావు. నిన్ను క్షమించడమెలా?

నీవు నాదానవనుకున్నాను. నీ మనసు నాదనుకున్నావు. నావనుకున్నవన్నీ నాకు కాకుండా చేస్తున్నాను. భగవంతుడనేవాడుంటే వాడి సమక్షంలోనైనా నీవు నిజం చెప్పక తప్పదు. ఈ హృదయాన్ని ముక్కలు చేసిన నేరానికి శిక్ష అనుభవించకపోవు — ఆలోచనలతో అతని [illegible]తలు పగిలిపోతున్నాయి. కళ్లు చెమ్మగిల్లుతున్నాయి. హృదయం అశాంతితో దహించుకుపోతుంది.

ప్రేమనేది గుండెల్లో పుట్టనేకూడదు.

ఆ ప్రేమను చంపుకోవడం అంత సాధ్యమైన పనికాదు. ప్రేమించే హృదయాల్లో స్వార్థం ఎక్కువగా వుంటుంది. అందుకే ఆ ప్రేమను పొందాలని హృదయం ప్రేమను చావనీయదు. ఏమిటి వైచిత్రి? ప్రేమ జీవితంలో ఒక్క భాగమే కదా! కానీ ఒక్కోసారి ప్రేమే జీవితమవుతోంది. తొలి వలపు రుచి చవిచూసిన హృదయం అంత తేలిగ్గా ప్రేమను మరుస్తుందా? ఎదలోయల్లో మ్రోగిన వలపు మంజీరాలను ఎలా మరుస్తుంది?

విజయ్ కూడా అలాంటి పరిస్థితిలోనే సతమతమవుతున్నాడు. మురళి తనను దూరంగా వెళ్లిపొమ్మంది. మర్చిపోయి మరో అమ్మాయిని చేసుకోమన్నది. కారణం చెప్పకుండా శాసించింది. ఆమె మాట మీరలేక త్రెంచుకుని వెళ్లలేక అవస్థ పడిపోతున్నాడు అతను.

చివరకో నిర్ణయానికొచ్చాడు.

లేచి కాగితం కలం తీసుకుని మురళికి ఉత్తరం రాయసాగేడు విజయ్.

'మురళీ!

నీ కోరిక తీర్చడానికే నిశ్చయించుకున్నాను. ఒక్క నెల రోజులు గడిస్తే నా ట్రైయినింగ్ అయిపోతుంది. ఆ తరువాత ఈ ఊరు వదిలి వెళ్లిపోతాను. ఈజోగా ఇంకెప్పుడూ నిన్ను కలవను. అంతా నీ ఇష్టప్రకారమే జరుగుతుంది. అలాగే నడుచుకుంటాను.

**జరిగిన కథ — 2:** విజయ్, మురళి కాశీకి పోతూ రైల్లో యాదృచ్ఛికంగా కలుసుకుంటారు. విజయ్ గడిచిపోయిన తన జీవితాన్ని సింహావలోకనం చేసుకోసాగాడు — విజయ్ పోలీసు ఇన్‌స్పెక్టరుగా ట్రయినింగ్ అవుతున్నాడు. మురళి ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా పని చేస్తూంటుంది. మురళి మంచితనం చూచి ఆమెను ప్రేమిస్తాడు విజయ్. మురళితో తను ఆమె స్నేహాన్ని కాంక్షిస్తూన్నట్లు చెపుతాడు. మురళి పిన్ని తన చిన్నాన్న కొడుకు పెళ్ళికి వెళ్ళేందుకు డబ్బు కావాలని మురళితో ఘర్షణ పడుతుంది. అందుకై మురళికి డబ్బు సహాయం చేస్తాడు విజయ్. ఇష్టపడితే ఆమెను వివాహం చేసుకుంటానంటాడు ఆమె తన నిర్ణయం తెలిపేందుకు కొంచెం టైమ్ కావాలని కోరుతుంది.

కానీ నాదో ధర్మసందేహం మిగిలిపోయింది. తీరుస్తావా ?

నీ గుండె ఇంత పాషాణంలా ఎలా మారి పోయింది ?

నా నేరమేమిటి ?

నీ మనసులో రవ్వంత ప్రేమ వున్నా, నన్నిలా అన్యాయంగా వెళ్లిపొమ్మనేదానివి కాదు. నీవు ఏ కారణంచేత ఇలాంటి కఠిన నిర్ణయం తీసుకున్నావో తెలిస్తే సంతోషించేవాడివి. మనసుకు కాస్త ఊరట కలిగేది.

నామీద నీకు ప్రేమ లేదనే మాట అబద్ధం!

నీవు నన్ను ప్రేమిస్తున్నావు. ప్రేమిస్తూనే వుంటావు. ఏదో ఉద్రేకంలో నన్ను తూలనాడు తున్నావని అనుకోలేక పోతున్నాను. ఏదో బలీయ మైన కారణం వుంటుంది. నేను నీకు దూరంగా వెళ్లిపోతే నీకు మేలు జరుగుతుందన్న సదుద్దే శ్యంతో వెళ్లిపోతున్నాను.

కానీ; చివరిగా ఒక్కమాట !

నన్ను దూరం చేసుకున్నందుకు బాధపడే క్షణం రాకుండా చూసుకో ... నీవు తృప్తిగా ఆనందంగా వుండాలని కోరుకుంటున్నాను.

ఒక నెల రోజుల్లో ఈ ఊరు వదిలి వెళ్ళి పోతున్నాను. జీవితంలో ఎప్పటికీ ఈ ఊరు రాను. వచ్చినా నీకు ముఖం చూపించను. నీకెలాంటి ఇబ్బందిని, అసౌకర్యాన్ని కలిగించనని హామీ ఇస్తున్నాను. ఇంతా చేసి నన్ను దూరంగా వుండమని చెప్పి నీవు ఏడ్చేయవు గదా !

గతించిన మన పరిచయానికి నేటితో తెర దించేద్దాము. కనీసం నీవైనా సుఖసంతోషాలతో వర్ధిల్లాలని మనసారా కోరుకుంటున్నాను. ఇక నా సంగతంటావా ? నీవెందుకు నన్ను దూరంగా పెట్టావో కారణం తెలిసే వరకు మరొకర్ని పెళ్లి చేసుకోను. ఆ నిజం తెలిసే వరకు ఈ గుండె కన్నీరు కారుస్తూనే వుంటుంది.

— నీ శ్రేయోభిలాషి,
విజయ్

విజయ్ వుత్తరం ముగించి ఇలా అను కున్నాడు గాఢంగా నిట్టూరుస్తూ ''...బంగారు కలల్ని, ఆశల పందిళ్లను చేతులారా ధ్వంసం చేసావు. బ్రతికినంత కాలం నీ స్మృతులతో తపిస్తూ, ఊపిరి పోసుకుంటాను. ఇక నాకేమీ మిగల్లేదు. నీవు లేని ఈ జీవితంలో ఏ ఆనందాలు, రసానుభూతులు వుండవు. నిర్లిప్తంగా ఈ జీవితాన్ని కడవరకు ఎలాగో లాగుతాను......''

## 6

గతం లోంచి వర్తమానంలోకి వచ్చాడు విజయ్. తలెత్తి మురళీప్రియ వంక చూసేడు. ఆమె తననే పరీక్షగా చూస్తోంది.

''ఎందుకలా చూస్తున్నావు ?—'' అని ప్రశ్నించాడు.

ఆమె మాట్లాడలేదు. పొడిగా నవ్వింది.

వర్షం హోరు తగ్గలేదు. క్షణక్షణానికి అధికమవుతోంది.

ఆ రోజు తన నెందుకు తిరస్కరించిందో కారణం తెలుసుకోవాలనుకున్నాడు విజయ్. ఆ మాటే అడిగాడు. ''నన్ను వెళ్ళిపొమ్మని చెప్పావు. నీవు కోరినట్లే చేసాను. ఆనాడు కారణం చెప్పటానికి వెనుకాడావు. ఎందుకలా ప్రవర్తించావు ? ఏమాశించి నన్ను నీ జీవితం లోంచి తరిమేశావు ?—''

వెంటనే సమాధానం చెప్పలేక పోయింది మురళీప్రియ. కొద్ది క్షణాల తరువాత పెదవి విప్పింది ''నా వాళ్ల కోసం ఆ పని చేయవల్సి



వచ్చింది. తీరా చేసాక నాకు మిగిలింది అసంతృప్తి, బండబారిపోయిన జీవితం —''

''అలా జరుగుతుందని ఆనాడు నీకు తెలీదా ?—''

''తెలుసు. కానీ నా జీవితం ఇలా మలుపు తిరుగుతుందని ఊహించలేదు ...''

''అంటే నీ భర్త మంచివాడు కాదా ?''

''కాకేం. ఆయన చాలా మంచివాడు. ఆ మంచి తనం చూసే నేను కట్టుబడి పోయాను. ఆయనకు భార్యనైనందుకు నేను ఏనాడూ బాధ పడ్లేదు.''

''మరి ?—''

''ఇప్పుడవన్నీ ఎందుకులే ... ఏదో జరిగి పోయింది —'' దీర్ఘంగా నిట్టూర్చింది మురళి. విజయ్ ఆమెను అంతటితో వదల్లేదు. ఆమెను గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలనుకున్నాడు.

''ఓ స్నేహితునిగా నీ బాధను పంచుకోవాలని అడుగుతున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే చెప్పు. అసలేం జరిగింది ? నీ భర్త ఎలా పోయాడు ? ఇంత చిన్న వయసులోనే నీకింతటి దురవస్థ ఎలా సంభవించింది ?'' ఆత్మీయతగా అడిగాడు.

''ఒకనాడు నిజం నీముందు చెప్పలేక నీ దృష్టిలో దుర్మార్గురాలినయ్యాను. ఇప్పుడు కూడా దాచుకుని నీ అంతరంగంలో ప్రశ్నార్థకంగా మిగిలిపోవడం కన్నా జరిగింది చెబుతాను విను. ఇలా చెప్పుకున్నందువలన నాకు ఒరిగే మేలు ఏమీ లేదని తెలుసు. కేవలం నీ తృప్తి కోసం—'' అని గతాన్ని అతని ముందు విప్పి పరచింది మురళి.

## 7

ఆ రోజు బీచ్‌లో విజయ్‌తో ఘర్షణ పడి ఇంటికి వచ్చింది మురళి. గుమ్మంలో అడుగు పెడుతూనే సరస్వతి నవ్వుతూ ఎదురొచ్చింది.

''ఎక్కడకెళ్లావమ్మా ? నీ కోసం రాజమణిగారు ఇప్పటిదాకా ఎదురుచూసి వెళ్లారు. ఆవిడకు నీ వంటే పంచప్రాణాలు. ఎంత పుణ్యం చేసుకున్నావో తల్లీ ... లేకుంటే రాజమణిగారు తనంతట తాను వచ్చి నిన్ను తన ఇంటికోడలుగా చేసుకుంటా ననడమేమిటి ! భగవంతుడు రాజమణిగారి రూపంలో వచ్చి మన కష్టాలు గట్టెక్కించబోతున్నాడు'' ఆప్యాయంగా తల నిమురుతూ అన్నది మురళి పిన్ని సరస్వతి.

మురళి ఏమీ అన్లేదు. తల దించేసుకుని తన గదిలోకి వెళ్లబోయింది.

ఇంతలో జమున రెండు పట్టుచీరెలు పట్టుకొచ్చి చూపించింది.

''అక్కా ! ఈ పట్టుచీరెలు చూడు ఎంత బావున్నాయో ! రాజమణిగారు మనిద్దరి కోసం తెచ్చారు. పెళ్లికి మరో మంచి పట్టుచీరె

కొని పెడతానన్నారు నాకు. ఆవిడ చాలా మంచిదక్కా'' అని సంబరంగా చెప్పింది జమున.

చెల్లెలు సంబరం చూసి తనలో తాను నీరసంగా నవ్వుకున్నది మురళి.

'నీవెంత అదృష్టవంతురాలవే చెల్లీ ! నీకు పట్టుచీరెలు, నగలు వుంటే చాలు మరో ధ్యాస వుండదు. నీలాంటివాళ్ళు ఎక్కడున్నా సుఖ పడతారు. మొత్తానికి రాజమణి ఎవరోగానీ మంచి అసాధ్యురాలే ! తన సంపదను ఎరచూపి మిమ్మలనందరినీ ఆకట్టుకుంది. నా జీవితాన్ని కొనడానికి సిద్ధమయింది.'

''ఇంకా అమ్మకు, నాన్నకూ కూడా బట్టలు తెచ్చింది ... ''

''అవును. మంచిది కాబట్టే మనందరికీ బట్టలు, మిఠాయిలు తెచ్చింది'' అని గిరుక్కున వెనుదిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది మురళి. మంచంమీద పడి దీనంగా రోదించింది. కుళ్ళి కుళ్ళిపోయింది. ఆమె హృదయావేదనను, ఆ కన్నీళ్లను ఎవరర్థం చేసుకోగలరు ? ప్రాణ సమానంగా ప్రేమించిన వ్యక్తిని దూరంగా వెళ్లి పొమ్మన్నది.

ఇంకెవరున్నారు తనను ఓదార్చడానికి ?

అంతా వున్నారు. తండ్రి ... పిన్ని ... చెల్లెళ్ళు, అటు జమిందారు రాజమణిగారు — మధ్య ఆమె మనవడు శివశంకర్. చాలామంది వున్నారు తన చుట్టూ. కానీ, వారందరి దృష్టిలో తనొక మనసులేని బొమ్మ. అందరి సంతోషానికి తలవంచుకోవాలి. తనకు మనసుండ కూడదు. వున్నా అందరూ కలసి దాన్ని చంపేందుకు సిద్ధంగా వున్నారు. వాళ్ల స్వార్థం కోసం తననో పావుగా చేసుకున్నారు.

తమ లేమితనాన్ని అసరాగా తీసుకుంది రాజమణి. తెలివిగా అందర్నీ ఉచ్చులో బిగించింది. మరి తనెందుకు ఎదురు తిరగలేదు ? తనకు తీరని అన్యాయం జరుగుతుంటే చూస్తూ ఊరుకోవడమేనా ? పిన్నితో ఏడ్పులు, బ్రతిమాలడాలు అన్నీ ఆయిపోయాయి. గతిలేని స్థితిలో తను లొంగిపోయింది.

అసలు ఎవరీ రాజమణి ? ఆవిడను తను చూడనైనా చూడలేదు. జమిందారిణి అయితే మాత్రం తన జీవితాన్ని శాసించే హక్కు ఎవరిచ్చారామెకు ?

ఇంకెవరు తన తల్లిదండ్రులు...కాదు... వాళ్లు తనను కనలేదు. దయతలచి పెంచారు. పుష్కరాల్లో దొరికిన తనను జాలిపడి తెచ్చి పెంచి పెద్దజేసారు. ఆ కృతజ్ఞతతోనే వాళ్లు చెప్పినట్లు తను వినడానికి సంసిద్ధమయింది.

''మురళీ ! ఏమిటలా వేళగానీ వేళ పడుకున్నావు ?'' గదిలోకి వచ్చి కంగారుగా అడిగింది సరస్వతి.

''ఏంలేదు. కాస్త తలనొప్పిగావుంది.''

''ఏమిటీ తలనొప్పా ? డాక్టర్ని పిలిపించమంటావా ? ఏ పాపిస్టి కళ్లు పడ్డాయో ! దిష్ఠి తీస్తాను వుండు'' అంటూ హైరానా పడుతూ వెళ్లి చేటలో ఉప్పు, మిరపకాయలు వేసుకువచ్చి దిష్ఠి తీసింది సరస్వతి. పిన్ని ఆర్భాటం చూసి నవ్వొచ్చింది మురళికి.

ఇంతకు ముందు పదిరోజులు వరసగా జ్వరంతో మంచం పడితే పలకరించిన పాపాన పోలేదు. అలాంటి పిన్ని ఈరోజు తలనొప్పికే ఇంత హైరానా పడుతోంది. అవును...తనిపుడు బంగారుబాతు !

''లేచి ముఖం కడుక్కో. వేడిగా వడ్డిస్తాను. నాలుగు మెతుకులు తిందువు—'' అన్నది వంట గదిలోకి దారితీస్తూ. మురళికి అన్నం తినాలని పించలేదు. వద్దంటే పిన్ని చేసే అతి మర్యాదకు తట్టుకోలేక లేచి పెరట్లోకి వెళ్లింది మురళి.

జమున పెరట్లో వేడినీళ్ళు, టవల్, సోపు సిద్ధంగా వుంచింది.

వాళ్ల ఏర్పాట్లుకు, విపరీతమైన చర్యలకు నవ్వాలో ఏడ్వాలో తెలీలేదు మురళికి. రెండు రోజుల తరువాత విజయ్ వ్రాసిన ఉత్తరం అందుకుని పదేపదే చదువుకుంది మురళి. జీవితం అంధకార బంధురమై పోయిందని గుండెలు పగిలేలా ఏడ్చింది. 'అయిపోయింది ... తను కోరినట్లు విజయ్ తనకు దూరంగా వెళ్లి పోతున్నాడు. పెంచుకున్న ఆశలపల్లకీ తునాతునకలై పోయింది. ఇక జీవితంలో అతను కనిపించడు.

తను గెలిచి ఓడిపోయింది.

విజయ్ ! నన్ను క్షమించు ... నీవంటే ఇష్టంలేకకాదు ఇలాంటిపని చేసింది. పరిస్థితులు నన్ను ఇరుకున పెట్టాయి. కన్నవాళ్లు కాకపోయినా, పెంచినవాళ్ల ఋణం తీర్చుకోవడానికి నీ మనసు ముక్కలు చేసాను. జీవితంతో రాజీ పడిపోయాను. తప్పనిస్థితిలో నీతో అబద్ధం చెప్పాను. నీవు కళ్లెదురుగా వున్నంతకాలం నేను నీ ముందు తలెత్తుకు తిరగలేను. అందుకే నిన్ను వెళ్లిపొమ్మన్నాను. నేను మరొకరి సొంతం కాబోతున్నాను విజయ్ ...

నా జీవితం సుడిగుండాల పాలవబోతోంది.

డబ్బున్న ఓ యువకునికి భార్యను కాబోతున్నాను. ఈ నిజం తెలిస్తే నీవు తట్టుకోలేవని, నీకు నిజం చెప్పడం ఇష్టంలేక తరిమేశాను. ఇలా ఎందుకు జరిగిందో నాకూ కూడా సరిగ్గా బోధపడడంలేదు. కానీ, నేనిలాంటి నిర్ణయం ఎందుకు తీసుకోవాల్సి వచ్చిందో తెలుసా ?...' మురళి కళ్లముందు వారంరోజుల క్రితం జరిగిన సంఘటన కదిలింది.

ఆఫీసుకెళ్లాలని మురళి రోడ్డుమీద చాలా వేగంగా నడుస్తోంది. ఇంతలో ఓ ఖరీదైన కారు వచ్చి ఆమె ప్రక్కగా ఆగింది. మురళి విస్మయంగా చూసింది. స్టీరింగ్ ముందు కూర్చున్న ఓ యువకుడు మురళిని చూసి చటుక్కున డోరు తెరుచుకుని క్రిందికి వచ్చాడు.

''మీనా ! ఇది కలా నిజమా ? నువ్వు ఇక్కడ ... ఇండియాలో ? ఓహ్ ! ఎంత దగా చేసావు ? ఇన్నాళ్ళూ నీవు చనిపోయావన్న దిగులుతో కృశించిపోతున్నాను. ఎలా బ్రతికావు ? నాకోసం బ్రతికి వచ్చావుకదూ ?... మాట్లాడు మీనా ! అబ్బ ! నేనెంత అదృష్టవంతుడ్ని ... నన్నువెదుక్కుంటూ ఇక్కడికి వచ్చావు కదూ ? నిన్ను మళ్లీ చూస్తానని కలలో కూడా ఊహించలేదు. నా మనసు సంతోషాన్ని పట్టలేకపోతుంది...'' అతని కంఠంలో రాగస్రవంతులు






జాలువారుతున్నాయి. కన్నులలో సన్నటి నీటి పొర...ఆ ముఖం ఆనందంతో, దీప్తి వంతంగా వెలిగిపోతుంది.

మురళి అవాక్కైపోయింది.

'ఎవరితను ? మీనా అంటున్నాడేమిటి ? ఇతన్ని తను ఎప్పుడూ చూళ్లేదు ... ' అని మురళికి అంతులేని విస్మయం కలిగింది. అతని వంక పరిశీలనగా చూసింది. తెల్లని దుస్తులు ధరించాడు. వయసు ఇరవైఐదు వుంటుంది. దబ్బపండులాంటి శరీరం, దృఢంగా ఎత్తుగా వున్నాడు. గిరజాలజుత్తు. సన్నని అందమైన మీసకట్టు. బాగా చదువుకున్నవాడిలా, సిరిగల బాబులా వున్నాడు.

మురళికి వెంటనే నోటమాట రాలేదు. విచిత్రంగా చూసింది అతనివంక.

"ఏమిటి మీనా ఎందుకలా కొత్తగా చూస్తున్నావు ? నేను చిక్కిపోయాను గదూ ! ఏంచేయను. నీవు యాక్సిడెంట్‌లో చనిపోయావని మీ బ్రదర్ ధర్మర్ చెప్పాడు. ఆ క్షణం నుంచి జీవితం మీద విరక్తి పెరిగిపోయింది. నిన్ను మరిచిపోలేక, నీ మీది ప్రేమను చంపుకోలేక, అక్కడ నుండి ఇండియాకు తిరిగివచ్చాను. సంవత్సరం క్రితం చనిపోయిందన్న మీనా ఇలా హఠాత్తుగా దర్శన మిస్తుందని నేనెప్పుడూ ఊహించలేదుసుమా ! ఇకనేను కోలుకుంటాను. ఇకనీవు వచ్చేశావుగా, నాకేచింతా వుండదు. కమాన్...కారెక్కు ఇంటికెళ్దాం. ఈ సంగతి మా గ్రానీకి చెప్పాలి. రావెళ్దాం." అని సంతోషంతో పొంగిపోతూ కారు డోరు తెరిచి పట్టుకున్నాడతను.

మురళి విభ్రాంతి నుంచి తేరుకుని "సారీ ! మీరనుకున్నట్లు నేను మీనాను కాను. నా పేరు మురళీప్రియ. మీరు పొరబడుతున్నారు" అన్నది.

అతను మందహాసం చేసాడు. ఆమె మాటల్ని కొట్టిపడేశాడు.

"ఇన్నాళ్లూ ఏడిపించింది చాలు. ఈ పిడికెడు మనసు తట్టుకోలేదు. నేను పొరబడను. నా మీనా ఎక్కడున్నా గుర్తుపట్టగలను. బెట్టు

# మానస మురళి

చాలించి వెళ్దాంరా—"అని నవ్వుతూ ఆమె దగ్గరగా వచ్చాడతను.

"నేను నిజంగా మురళీప్రియను. మీరనుకునే మీనాను కాను—" అసహనంగా నొసలు చిట్లిస్తూ అన్నది మురళి

అతడు రెండడుగులు వెనక్కివేసి నిటారుగా నిలబడిపోయాడు.

"ఏమన్నావ్ ? నీవు నా మీనావి కావా ?" అతని కనుబొమలు ముడిపడ్డాయి.

"కాదు. నాకు ఆఫీసుకు వేళవుతుంది వస్తా—" అని తన దారిన తను వెళ్లబోయింది మురళి. "ఆగు—" అతని కంఠం బిగ్గరగా అరిచింది.

మురళి ఆ అరుపుకు ఉలిక్కిపడి ఆగింది. అతను ఆమెను సమీపించాడు. నఖశిఖ పర్యంతరం ఆమెను పరిశీలనగా చూసాడు. ఆ చూపులకు ఆమె మహా ఇబ్బంది పడిపోయింది. 'ఎవరితను? నన్ను పట్టుకుని మీనా అంటాడు? ఆ మీనా ఇతని ప్రియురాలు అయివుండవచ్చు. తను మీనా కాదంటే వినిపించుకోడే ! చదువుకున్నవాడు. రోడ్డుమీద ఏమిటీ గొడవ ? నలుగురూ తమ వంకే చూస్తున్నారు—' అని మురళి విసుగ్గా చూస్తూ ఏదో అనబోయింది. ఇంతలో అతను చటుక్కున మురళి చేయి పట్టుకున్నాడు.

"అబద్ధం, నీవు నా మీనావే. ఎందుకిలా నాటకమాడుతున్నావు ? వద్దు... ఇక నాటకాలు చాలించు. ఇప్పటికే నీమీద బెంగతో కుళ్లిపోయాను. ఈ క్షణంలో నిన్ను చూసి ఎంత సంబరపడిపోతున్నానో చూడు. రాదనుకున్న వసంతం తిరిగి వచ్చింది. మీనా ! ప్లీజ్... నా మాట విను... ఇంటికెళ్లి మాట్లాడుకుందాం రా..." నీళ్లు నిండిన కళ్లతో ప్రాధేయ పూర్వకంగా అన్నాడు అతను.

మురళికి బుస్సున కోసం పొంగింది.

"ముందా చేతిని వదలండి—"

"ఉహూఁ... వదలను. వదిలితే నీవు వెళ్లిపోతావు. నీవు దూరమైతే నేను బ్రతకలేను—" చిన్న పిల్లాడిలా మారాంచేస్తూ ఆమె చేతిని మరింత గట్టిగా పట్టుకున్నాడు.

మురళికి ఆవేశం పెల్లుబికింది. కోపాన్ని నిగ్రహించుకోలేక పోయింది. విసురుగా తన చేతిని లాక్కుని అతని చెంప ఛెళ్లు మనిపించింది.

అతడు అదిరిపోయి... అరచేత్తో చెంప రుద్దుకోసాగేడు.

"నేను మీనాను కాదంటే వినిపించుకోరే ! చదువుకున్నారు. సభ్యత తెలిసినవారు. ఓ ఆడపిల్లను నడిరోడ్డుమీద చేయి పట్టుకుని అల్లరి చేయడం మంచివారి లక్షణం గాదు. కాస్త వళ్లు దగ్గర పెట్టుకుని మసలుకోండి—" అని హూంకరించి విసవిసా అక్కడ నుంచి నడిచి వెళ్లిపోయింది మురళి.

అతను అలాగే శిలా ప్రతిమలా నిలుచుండిపోయాడు.

ఆ రోజంతా అతన్ని గురించే ఆలోచించింది మురళి, 'నిజంగా అతను ప్రేమించిన మీనా తనలా వుంటుందా ? లేక ఆడపిల్లల్ని వశపరచుకోడానికి ఇదోరకం ఎత్తా ? మనిషిని చూస్తే పోకిరిలా కనిపించడు. ప్రేమించిన అమ్మాయి తిరిగి దొరికిందని సంబరపడ్డాడు... మనిషిని పోలిన మనుషులుంటారని సినిమాల్లోనూ, కథల్లోనూ తప్ప తనెప్పుడూ చూళ్లేదు. తన లాంటి వ్యక్తి 'మీనా' పేరుతో మరొకరు వుండి వుంటారు.

ఏమో ! ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మడానికి వీల్లేకుండా పోయింది. అతను చెప్పినదంతా కట్టుకథ కావచ్చు. అదంతా నటన కావచ్చు... కారు అదీ చూస్తే పెద్ద జమిందారు బిడ్డలా వున్నాడు. ఈ సంగతి విజయ్‌కి చెబితే ఏమంటాడో? అయినా ఇందులో ఏం విశేషం వుందని అతనికి చెప్పాలి ? మరోసారి ఆ అపరిచిత వ్యక్తి తారసపడి ఇలాగే అల్లరి చేస్తే అప్పుడు చూద్దాం—' అని ఆ విషయం అంతటితో మర్చిపోయింది మురళి.






కానీ; మురళి ఊహించని సంఘటన మరు దినం మరొకటి జరిగిపోయింది.

అతను జమిందారు రాజమణిగారి ఏకైక మనవడు శివశంకరం. బాగా డబ్బున్నవాడు. ఆస్తి అంతస్తు వుంది. ఫారిన్‌లో చదువుకుని వచ్చాడు. ఆ సమయంలో మీనా అనే అమ్మాయితో పరిచయం ఏర్పడి— అది ప్రణయంగా మారింది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకున్నారు. ఇంతలో మీనా కారు యాక్సిడెంట్‌లో చనిపోయింది. దానితో శివశంకర్ పిచ్చివాడై ఇండియాకు తిరిగి వచ్చాడు. ఎన్నో రోజులు ఆమె కోసం నిద్రాహారాలు మాని కృశించిపోయాడు.

రాజమణిగారి గుండె చెరువయింది. డాక్టర్లను పిలిపించి వైద్యం చేయించింది. ఎన్నో మందులు వాడింది. అతన్ని కంటికిరెప్పలా చూసుకుంటూ— అనేక రకాలుగా ఓదార్చింది, అయినా అతని మనసు శాంతించలేదు. తల్లిదండ్రులు పోయినప్పటి నుండి మనవడ్ని కంటికి రెప్పలా సాకిందామె. ఒక్కగానొక్క మనవడు. వంశాంకురం!

అలాంటి తరుణంలో శివశంకర్ మురళిని చూసాడు.

తన మీనా తిరిగి వచ్చిందని భ్రమచెందాడు. మురళి తిరస్కృతితో మానుతున్న గాయం రేగింది. వెళ్లి గ్రానీ వళ్లో తలపెట్టుకుని చిన్న పిల్లాడిలా వలవల ఏడ్చేశాడు. రాజమణి గుండె కరిగి నీరైపోయింది.

ఆప్యాయంగా అతని శిరస్సు నిమిరి "కన్నా! ఏమయింది బాబూ! ఏం కావాలి నీకు? ఈ గ్రానీ వున్నంతకాలం నీవు కంట తడి పెట్టకూడదు. ఏం జరిగిందో చెప్పు తండ్రీ..." అని బుజ్జగించింది.

కన్నీళ్ళమధ్య మీనా విషయం చెప్పాడు శివశంకర్.

"గ్రానీ! ఈ ఊళ్లో నా మీనాను చూసాను. చనిపోయిందనుకున్న నా మీనా బ్రతికి వచ్చింది. కానీ, తను మీనా కాదని తిరస్కరించింది... గ్రానీ, ఎలాగయినా సరే నా మీనాను నాకు దక్కేట్లు చేయి... ఇక నాకేమీ వద్దు...ఆమెను చూడనిదే ఆమెతోమాట్లాడనిదే నేను బ్రతకలేను—" అని నుదురు బాదుకున్నాడు.

"కన్నా—" రాజమణి కళ్లలో చివ్వున నీరు చిమ్మింది, గుండెలో గునపాలు దించినట్లు విలవిల్లాడిపోయింది.

"కన్నా... ఎవర్నో చూసి భ్రమపడి వుంటావు. ఎక్కడో ఇతర దేశంలో చనిపోయిన అమ్మాయి ఇక్కడెలా బ్రతికి వస్తుంది?"

"లేదు గ్రానీ... అచ్చం నా మీనానే! ఆ నడక— ఆ మాటతీరు, ముమ్మూర్తులా నా మీనానే! నా కళ్లు నన్ను మోసం చేసినా, నా మనసు నన్ను మోసం చేయలేదు. నేను మీనాను పెళ్లాడుతాను. నీవు వెళ్లి మీనాకు నచ్చజెప్పి వప్పించి తీసుకురా గ్రానీ—"

రాజమణి గుండెలోంచి వేడి నిట్టూర్పు భారంగా వెలువడింది.

"అలాగే... ముందు నీ ఆరోగ్యం కుదుటపడనీ. ఆమె సంగతి నేను చూసుకుంటాను—"

"ఉహుఁ... ఆలస్యం చేస్తే ఆమె నాకు దూరమవుతుంది. మీనా లేకపోతే నాకు ఆనందం లేదు. సుఖంగా వుండలేను. గ్రానీ... నా కోరిక తీర్చవా? మీనాను బ్రతిమాలి తీసుకురావా?"

రాజమణి మెదడులో పెనుతుఫాను హోరు! హృదయంలో కలవరం!

చకచక ఆలోచించింది.

"కన్నా! నీ కోరిక తప్పక తీరుస్తాను. ఈ గ్రానీ బ్రతికేది నీ కోసమే తండ్రీ. నీవు సుఖంగా వుండాలనే నా తపన. ఆమె ఎక్కడున్నా వెదికి తీసుకువస్తాను. మీ యిద్దరికీ పెళ్లి జరిపిస్తాను. నా మాట విను. ఊరికే ఆరాటపడక విశ్రాంతి తీసుకో—" అని ఓదార్చింది.

ఆ మాటలకు శివశంకర్ కొద్దిగా శాంతించాడు. ఆమెను తొందరపెట్టి మురళి విషయం వాకబు చేయించాడు. రాజమణి మురళిని గురించి తెలుసుకుని నేరుగా వాళ్ల యింటికి వెళ్లింది. ఆ సమయంలో మురళి ఇంట్లోలేదు. తమ ఇంటిముందు ఖరీదైన కారు ఆగడంతో

## ఇవేమన పద్యాలు




అంగమెల్ల వదలి యటుదంతములు వీడి
తనువు ముదిమిచేత తరుచు వణక
ముప్పుతిప్పలగుచు మోహంబు విడుచురా
విశ్వదాభిరామ వినుర వేమ.



# డాక్టర్ సలహాలు



## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### ఇ. ఎస్. ఆర్. – విశాఖపట్నం

మా అబ్బాయి వయస్సు 10 సం॥లు. వాడు ఈ మధ్య ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లలో పెరిగినాడు. వేసవిలో ముక్కులో నుండి రక్తం కారటం ప్రారంభమైంది. తడిగుడ్డ ముక్కుమీద, మంచు ముక్క నొసటిమీద పెట్టి వుంచాను. కొంత సేపటికి రక్తం కారటం తగ్గుముఖం పట్టినది. 1 గంట తరువాత ప్రారంభమయినది. ఖంగారుపడి కొన్నిరోజుల తర్వాత ఆంధ్రకు తీసుకొని వచ్చాను. పూర్తిగా తగ్గినది. దీనికి కారణం ఏమిటి ? మరలా ఇలావస్తే ఏమి చెయ్యాలి ?

★ స్థలమార్పిడి వల్ల ముక్కులో నుంచి రక్తంకారటం తగ్గి ఉండదు. ఇ. ఎన్. టి. వైద్యులచేత ముక్కులోపలి భాగం పరీక్షచేయించి, రక్తనాళాలు గుబురుగా ఉన్నట్లయితే కాటరైజ్ చేయించండి. ముక్కు భాగంలో ఏ రోగమూ లేనప్పుడు రక్త పరీక్ష (బ్లీడింగ్ టైము, క్లాటింగ్ టైము) చేయాలి. కొందరికి ఏ కారణమూ లేకుండానే ఇలా రక్తంకారే అవకాశం ఉంటుంది. ఇటువంటి వారికి ఏ చికిత్సా లేకుండానే తగ్గిపోతుంది. రక్తం అధికంగాకారే సమయంలో ఐస్‌తోబాటుగా ముక్కులోపల అడ్రినలిన్‌తో తడిపిన దూదిని ఉంచటం మంచిది.

### కె. వి. ఎస్. – జిమ్నూరు

గ్యాస్ట్రిక్ ట్రబుల్ అంటే ఏమిటి ? ఇది రావటానికి కారణమేమిటి ? నష్టము లేమిటి ? దీనిని నివారించుటు ఎట్లు ?

జీర్ణకోశంలోని మొదటిభాగం అయిన కడుపు (స్టమక్) లోపల ఉన్న మ్యూకస్ పొర వాయటాన్ని గ్యాస్ట్రైటిస్ అని అంటారు. కడుపులో మంట, ఆకలిలేమి మొదలయినవి ఈ రోగి లక్షణాలు.

కొందరికి ఆమ్లం అధికం అవటం వల్ల, మరికొన్ని కారణాలవల్ల కడుపులో మ్యూకస్ పొరలో గంట్లులాగా (అల్సర్) తయారయ్యే అవకాశం ఉంటుంది. దీనిని గ్యాస్ట్రిక్ అల్సర్ అంటారు. నెప్పి, మంట ఎక్కువగా ఉండటం, ఆహారం తీసుకొంటే తగ్గటం ఈ రోగలక్షణాలు.

ఈ రోగాలకిగాను మందులు తీసుకోనప్పుడు కొన్ని అవాంతరాలు ఏర్పడగల అవకాశం ఉంటుంది. ఆహారంలో, కారం, పులుపు, ఆల్కహాల్ మొదలయినవి వాడకూడదు. రోగ లక్షణాలు ఉన్నవారు ఆహారం రోజులో చాలా సార్లు కొద్ది కొద్దిగా తీసుకోవటం అవసరం. వైద్యుల సలహామేరకు యాంటాసిడ్ మాత్రలు వాడాలి.

### డి. కె. ఎమ్. – మొగల్తూరు

నా వయస్సు 20 సం.లు. మల విసర్జన జరిగేటప్పుడు ఎర్రటి గడ్డ బయటికి వస్తున్నది. రంధ్రం గడ్డలో ఉన్నది. కాని ప్రస్తుతం మలవిసర్జన జరుగుతున్నప్పుడు, తర్వాత విపరీత మయిన మంటగా ఉంటుంది. ఆపరేషన్ అవసరమంటారా ?

★ దీనిని ప్రొలాప్స్ రెక్టం అని అంటారు. ఇలా తరచూ బహిర్గతం అవటంవల్ల ఆ భాగంలో పుండు ఏర్పడి మంటపెడుతుంది. ఆపరేషన్ తప్పక అవసరం. ఆపరేషన్ జరిగాక ఆసన స్థానంలోని కండరాల పటుత్వాన్ని పెంచటానికి ఎక్సర్సైజులు అవసరం. గుర్రపు స్వారీ చాలా మంచిదని కొందరు శస్త్ర వైద్యుల అభిప్రాయం.

### వి. ఎస్. ఆర్. – మంగళగిరి

నా కుమారునికి 1 సం॥ క్రితం అంటే 3 సం॥ల వయస్సులో అకస్మాత్తుగా బొడ్డు క్రింది భాగమంతా చచ్చుపడి పోయింది. స్పర్శ కూడా లేదు. మల, మూత్ర విసర్జన చేస్తున్నట్లు తెలియదు. మద్రాసులోని ప్రముఖ డాక్టరు కొన్ని మందులు వ్రాసి ఇచ్చారు. అలాగే ప్రతిరోజూ చేస్తున్నాము. కాని ఇంతవరకు ఉపశమనం కలుగలేదు. 4 నెలలుగా కొద్దిగా నత్తి వస్తున్నది.

★ వెన్నెముకలోని స్పైనల్ కార్డ్‌లోని ఒక భాగం రోగగ్రస్త మయినందువల్ల ఇలాజరిగి ఉంటుంది. కొన్ని సందర్భాలలో ఈ మార్పు తాత్కాలికంగానే ఉండి కాలగతిలో రోగలక్షణాలు మెరుగు పడతాయి.

కొందరికి మాత్రం ఈ మార్పులు నిరంతరం మాత్రమేగాక, ఇంకా విషమించే పరిస్థితి ఉంటుంది. ఇటువంటి రోగానికి పెద్దగా చికిత్స లేదనే చెప్పవలసి ఉంది. మీరు మీ కుమారుని మద్రాసులోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూరాలజీ (జనరల్ హాస్పిటల్‌లో) చూపించండి.

---

జమున బయటకు తొంగిచూసి "ఎవరు కావాలండీ ?" అని ప్రశ్నించింది.

రాజమణి ఠీవిగా కారుదిగి చుట్టూ పరికించింది. ఆ యింటిని ఆ పరిసరాల్ని చూసి 'బీద సంసారంలా వున్నది. అలా అయితే తన పని మరింత సులువు అవుతుంది—' అనుకుంది. జమునను చూసి "ఇది రమణయ్యగారి ఇల్లేనా?" అని ప్రశ్నించింది దర్పంగా.

జమున తలూపి లోపలకు తుర్రుమని వెళ్లి తల్లితో చెప్పింది,

"అమ్మా ! మనింటికి ఒకామె కార్లో వచ్చిందే ! ఆమె వంటిమీద ఎన్ని నగలనుకున్నావు ధగధగ మెరిసిపోతున్నాయి" సంబరంగా

## మానస మురళి

చెప్పింది.

"కారా ? మనింటికి కాదేమో ?—" సంశయంగా అన్నది సరస్వతి.

"లేదే... మనింటికే వచ్చిందావిడ. నాన్న పేరడిగింది. ఆమె బయటే నిలుచుంది. రా చూద్దువు—" అని తల్లిని వెంటబెట్టుకొచ్చింది.

రాజమణి చిన్నగా నవ్వుతూ "మురళి మీ అమ్మాయే కదూ !—" అని అడిగింది.

సరస్వతి ఆశ్చర్యంతో ఔనన్నట్లు తలూపింది.

"మీతో మాట్లాడుదామని వచ్చాను" అని రాజమణి అన్నదే తడువుగా సరస్వతి ముఖం వెలిగిపోయింది. ఎవరో ఏమిటో తెలియక పోయినా, బాగా డబ్బున్న ఆవిడ తమతో మాట్లాడాలని రావడం సరస్వతికి కాస్త గర్వం కలిగించింది.

"లోపలకు దయచేయండి" వినయంగా ఆహ్వానించింది.

జమున చెక్కకుర్చీ తెచ్చి వేసింది. రాజమణి ఇంటిని కలయజూస్తూ కూర్చుని వాళ్ల స్థితి గతుల్ని గురించి తెలుసుకుంది. మాటామాటా కలిపింది. ఆమె జమిందారు రాజమణి అని తెలిసి సరస్వతి మహదానందపడి పోయింది. రమణయ్య అంతా వింటూ పడుకున్నాడు. జమిందారు తన ఇంటి కెందుకు వచ్చిందో అర్థం కాలేదాయనకు.

(ఇంకా ఉంది)

# శాలాక్షుని డైరి



## కళ్లు కాజేసిన హంతకుడు !

తమిళనాడుకు చెందిన నామగిరిపేటలో రంగస్వామి అనే వో లక్షాధికారినీ, ఆయన చెల్లెలు 50ఏళ్ళ పళనియమ్మాళ్ అనే ఆవిడనూ జూన్ 21వ తేదీ రాత్రి బహు దారుణంగా ఎవరో చంపేశారట. హంతకులంతతో తృప్తి చెందక పళనియమ్మాళ్ రెండు కళ్ళూ పీకి చక్కా తీసుకుపోయారట. ఈవిడ భర్త పెరియ కాళిగవుండరు రెండో పెళ్ళి చేసుకోడంతో యీవిడ భర్తతో తెగతెంపులు చేసుకుని అన్న గారితో వుంటోందట. ఈవిడ నామగిరిపేట ఇందిరా కాంగ్రెసు వ్యవహర్తట.

## కొండని తవ్వి.... !

సెప్టెంబరు 16వ 1981వ సంవత్సరంలో "కొలోన్" అనె వో నగరంలో (అమెరికా) హెయిన్జ్‌స్కీవ్ అనే వో కస్టమ్స్ అధికారి డ్యూటీలో వుండగా పుటుక్కునో గ్లాసుడు బీరు త్రాగాడట. ఆ దేశం డ్యూటీలోవున్న కస్టమ్స్ అధికారులు మత్తు పదార్థాలు సేవించడాన్ని నిషేధించిందట. ఈ కథ విచారణకు వచ్చి పద్దెనిమిది నెలలు తీసుకుందట. అంతేగానే ఓ కస్టమ్స్ జూనియర్ అధికారి, ఇద్దరు ముఖ్య కస్టమ్స్ ఇన్‌స్పెక్టర్లు, ఒక కౌన్సిలరు, ఇద్దరు ప్రభుత్వ కౌన్సిలర్లు, ఇద్దరు ప్రభుత్వ డైరెక్టర్లు, ప్రభుత్వ మేనేజింగ్ డైరెక్టరొహోయన, ఓ సీనియర్ కంట్రోలర్, ఓ జడ్జిగారు, ఓ డజనుమంది టైపిస్టులు యీ కేసులో విచారింపబడ్డారట. చివరికి యింత తతంగమూ అయ్యాక ఆ హెయిన్జ స్కీవ్‌గారికో 150 మార్క్సు అపరాధం విధించారట — హేపీ దట్టిండియా యీజ్ బెటర్ ఇన్డిస్ !

## ఏ పెట్టెలో ఏపాముందో !

న్యూయార్క్‌కు విమానంలో వచ్చిన వో రెండు పెద్ద పెట్టెలననుమానించి కస్టమ్స్ అధికారులు పగలేసి తెరిచి కెవ్వున కేకేసి, దాంతో పాటో గంతేశారట. ఆ పెట్టెలో పాములున్నాయట. గంతేసి స్థిమితపడ్డాక యోచించిచూస్తే లోపలి రహస్య అరలలో. ఆ పెట్టెలలో మత్తు పదార్థాలు దాచబడి వున్నాయట.

## రుజువుచేయలేని ఆరోపణ !

వాషింగ్టన్ పోస్ట్ అనే వో పత్రిక భారతదేశం అమెరికానుంచి మూడొందల మిలియను డాలర్ల ఖరీదుచేసే 155 యం. యం. గన్స్ కొనుగోలు చేయుచున్నది అని ప్రకటించిందట. దీనికి మన దేశం "హిందూ" దినపత్రిక ఆక్షేపించుతూ యీ విషయం ఆ పత్రిక ఋజువు చేయగలదా అని నిలదీసిందట.

## షవర్ బాత్‌లో రికార్డు !

ఫ్రాంక్ ఫర్టుకు చెందిన 42 ఏళ్ళ క్లిమెంట్స్ మొవుటర్ అనే ఆయన లోపల్లాగూతో షవర్ బాత్‌లో మూడొందల అరవై గంటలు ఏకబిగిన అలానే కూర్చుని తలమీదా, మీదా ఏడే నీళ్ళను 360 గంటలు సహించి 1981లో తన రికార్డును తానే అధిగమించి పేరు తెచ్చుకున్నాడట.

## కారుని గానుగలా 86 గం॥లు నడిపిన ఘనుడు !

డెనిస్‌కోర్‌వైజర్ అనే వో ఫ్రెంచి దేశానికి చెందిన ఆయన కారును ఒక నిర్ణీతమైన స్థలంలో సర్కస్ గుర్రంలా గుండ్రంగా 85 గంటల, ఆరు నిముషాల 53 సెకనులు నడిపి ప్రపంచ రికార్డును బద్దలేసి, కొత్త రికార్డు స్థాపించాడట.

## కరాటే వీరునిగా భారత రాయబారి!

బర్మాలోని భారతదేశ రాయబారి మిస్టర్ జి. జి. స్వెల్‌స్కుట్టైగర్ కరాటే బెల్ట్ ఎసోసిఏషను "బ్లాక్ బెల్ట్" బహూకరించిందట. రెండేళ్ళు తాను చేసిన ప్రాక్టీసే ఈ పట్టాకు కారణమన్నారటాయన. భారతదేశపు చరిత్రలో వో రాయబారి కరాటే వీరునిగా బ్లాక్ బెల్ట్ పొందడమిది మొదటిసారిట.

## ఖరీదైన మిషనుకి పట్టిన గతి !

కలకత్తాలోని యస్. యస్. కె. యం ఆసుపత్రికి తన దంతాల నోసారి శుభ్రపరచుకోడానికి వెళ్ళిన ముఖ్యమంత్రి జ్యోతిబాసు ఎగిరి గంతేశారట. 1965లో కొన్న 35 వేల ఖరీద చేసే మిషను అతీగతీ లేకుండా పడుందట. చేతికందిన భాగాలను ధైర్యమున్నవారమ్మేక తిన్నారట.










# సినిమా




''సినిమా యాక్టరవుదామనుకుందట, కుదరక డాక్టరవుదామని వచ్చింది!''

## ఎన్. టి. ఆర్; అమితాబ్‌ల భవిష్యత్తుపై ఒక ప్రముఖ జ్యోతిష్యుని జోస్యం!

మద్రాసు వాస్తవ్యుడైన రామకృష్ణ సారథి ప్రముఖ జ్యోతిష్కుడు, హస్త సాముద్రిక నిపుణుడు. ఈయన ఎక్కువగా ఢిల్లీలోనే ఉంటూంటారు. ఈయన చెప్పిన జోస్యాలు చాలామట్టుకు ఫలించాయి. విముక్తి పోరాటం ఎప్పుడు ప్రారంభమై, ఎప్పుడు ముగిసి బంగ్లాదేశ్ ఏర్పడుతుందో ముందుగా చూచించాడీయన. సంజయ్‌గాంధీకి ప్రమాదవశాత్తు అకాలమరణం సంభవిస్తుందని ముందుగా హెచ్చరిక చేశాడు కూడా. ఈయన ఎన్. టి. ఆర్. గురించి ఇలా తెలియజేశారు : ''ఎన్. టి. రామారావు అమోఘ విజయం అట్టే కాలం ఉండకపోవచ్చు. ఈయన తన దేహారోగ్యాన్ని చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. ముఖ్యంగా ప్రయాణాలు చేసేటప్పుడు ప్రమాదం సంభవించొచ్చు. అంచేత, ఎంతో జాగరూకతతో ఉండాలి.''

అమితాబ్ బచ్చన్ త్వరలోనే రాజకీయాలలో ప్రవేశిస్తారనీ, జూలై తర్వాత ఇందిరాగాంధీ పరిస్థితి ఇదివరకటిలా ఉండకపోవొచ్చనీ, అక్టోబర్‌లో శ్రీలంకలో ఎన్నో పరిణామాలు ఏర్పడి సిరిమావో బండారనాయకే మళ్ళీ ఒక వెలుగు వెలగొచ్చని కూడా ఈయన జోస్యం చెప్పారు.

''మీరు చెప్పిన జోస్యంలో మీకు అమితాశ్చర్యం కలిగించిన విషయం ఏదైనా ఉందా ?'' అని అడిగితే, ఆ జ్యోతిష్యుడు ఇచ్చిన సమాధానం . ''1981 లో ఆస్ట్రేలియా టెలివిషన్ బృందం వారు మన దేశానికి వచ్చినప్పుడు నన్ను కలుసుకున్నారు. నాకు పన్నెండుమంది ఫోటోలు చూపించి, వారిలో ఎవరు తదుపరి తమ ప్రధానిగా వస్తారని అడిగారు. ఆ ఫోటోలో ఉన్నవారెవరో, వారు ఏ ఏ పార్టీలకు చెందినవారో కూడా నాకు తెలీదు. అయినా, ఒక ఫోటోను చూపించి, ఈయనే ప్రధాని అవుతారని చెప్పాను. నా మాట నిజమైంది. ఆ ఫోటోలో ఉన్న వ్యక్తి పేరు బాబ్‌హాక్ అని ఆ తర్వాతే నాకు తెలిసింది. అంతేకాదు; ప్రతిపక్షం నాయకుడుగా ఈ వ్యక్తి రావొచ్చని మరొకరి ఫోటో కూడా చూపించాను. అదికూడా నిజమైంది !''

## ''అంకెల బిందెలు''

''కృష్ణ, జయసుధలమీద ఊటీలో రెండు పాటలు పిక్చరైజ్ చేశాక రెగ్యులర్ షూటింగ్ మద్రాసు దగ్గరున్న పడవ గ్రామంలోని హాలం గార్డన్స్‌లో జూన్ 11న ప్రారంభమైంది. 13న కోవూరు గ్రామంలో కొంత షూటింగ్ చేశాం. జూలై 11 నుండి 15 వరకు జరిగే షెడ్యూల్‌తో దాదాపు షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు రంజిత్‌కుమార్. ఈయన, బాలకృష్ణ కలిసి నిర్మించే రంజిత్ క్రియేషన్స్ ''అంకెల బిందెలు'' చిత్రంలో రాగిణి, మోహిని, అంజలీదేవి, అత్తిలి లక్ష్మి, ఝాన్సి, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, నరసింహరాజు, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, త్యాగరాజు, వీరభద్రరావు, వేలు పాల్గొంటున్నారు. అప్పలాచార్య సంభాషణలు, రాజన్—నాగేంద్ర సంగీతం, లక్ష్మణ్ గోరే ఛాయ, పద్మనాభం నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : విజయనిర్మల.

'రామరాజ్యంలో భీమరాజు' కృష్ణ, శ్రీదేవి



# విశేషాలు

-జి. వి. జి.



జయసుధ, మురళీమోహన్ "దేవి—శ్రీదేవి"లో

### "మూడు ముళ్ళు"

"అమలాపురం ప్రాంతాలలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జంధ్యాల. ఈయన మాటలు, దర్శకత్వంలో శశిభూషణ్, శరవణన్ నిర్మించే శ్రీ సారథి, ఎ. వి. ఎం. కంబైన్స్ "మూడుముళ్ళు" చిత్రంలో చంద్రమోహన్, రాధిక, గీత, ప్రభాకరరెడ్డి ప్రభృతులు పాల్గొంటున్నారు. భాగ్యరాజా కథకుడు. రాజన్–నాగేంద్ర స్వరకల్పనలో వేటూరి, జ్యోతిర్మయి గీతాలు రాశారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, గౌతమ్‌రాజు కూర్పు నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం ఆగస్టులో విడుదలవుతుందని శశిభూషణ్ తెలియజేశారు.



### "ముక్కుపుడక"లో మద్రాసులో అన్వేషణ!

మద్రాసు మౌంట్‌రోడ్‌లో (గొల్లపూడి) మారుతీరావు, (పి. ఎల్.) నారాయణ ఆపసోపాలు పడుతూ అంగలు వేస్తున్నారు.

"అబ్బా! ఓరి బాబో! బావా, ఈ మేడలు చూస్తుంటే, ఆకాశానికి నిచ్చెనేసినట్టుందయ్యా. మేడమీది కెక్కామంటే, మరి ఇంద్రుడి పాదాలు తగులుతాయన్న మాట?" అన్నాడు మారుతీరావు.

"ఇంద్రుడి పాదాలు తరువాతగాని, ముందు అల్లుడుగారి అడ్రస్ దొరికే మార్గం చెప్పు," అన్నాడు నారాయణ.

"కనుక్కుందాం — కనుక్కుందాం," అంటూ మారుతీరావు రోడ్డుమీద వెళ్తున్న ఒక వ్యక్తిని ఆపి, "బాబూ?" అన్నాడు.

"ఎన్నాయ్యా రోడ్‌మేలే?" అంటూ ఆ తమిళుడు విసుక్కున్నాడు.

"బాబూ, ఇక్కడ ఏడుకొండల సూర్యప్రకాశని — ఆతనెక్కడుంటాడో అడ్రస్ చెప్తారా?"

"ఏళుమలయా? నాళె కాత్తాలె తిరుమలై ఎక్స్‌ప్రెస్ పుడిచిటి పోంగో! కాత్తాలే యిరుకు."

"ఇరుకే మరి... ఇంత మహాపట్నంలో ఇరుక్కాక మరెలా ఉంటుంది? కాని, ఈ నా కొడుకు ఎక్కడ ఇరికాడని?" అంటూ మారుతీరావు, నారాయణతో కాళ్ళీడ్చుకుంటూ బయలుదేరాడు.

ఎస్. గోపాల్‌రెడ్డి నిర్మించే భార్గవ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "ముక్కుపుడక" చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు.

### "కోటికొక్కడు"లో జయమాలిని



## సినిమా

'రోషగాడు' చిరంజీవి, సిల్క్‌స్మిత

### "పండంటి కాపురానికి 12 సూత్రాలు"లో అందం అర్హతా ?

వొయ్యారంగా నిలుచోనున్న సుబ్బుల్ని (కృష్ణవేణి) నఖశిఖ పర్యంతం పరిశీలించింది జయ (విజయశాంతి). "ఈరోజు నిన్ను పనిలోంచి తీసేస్తున్నాను. వెళ్లిపో!" అంది.

సుబ్బులు ఉలిక్కిపడింది. "అయ్య బాబోయ్! అయ్య బాబోయ్! నేనేం తప్పు చేశానమ్మాయిగారూ ? మీ పాదానికి దణ్ణం పెడతాను. నా కడుపుకొట్టకండి."

"నీ కడుపుకొట్టడమేం కాదు నువ్వు అందంగా ఉన్నావ్. అందుకే నిన్ను పనిలోంచి తీసేస్తున్నాను. వెళ్లిపో!"

"యేంటీ! అందంగా ఉన్నానని పన్లోంచి తీసేస్తారండీ! బలే బాగుందండీ... అయినా, మీరు అందంగానే వున్నారు కదండీ? నా అందం మీకేం చెరుపుచేస్తది, అమ్మాయిగారూ ?"

"మగవాళ్ళు కోతుల్లాంటి వాళ్లని మా అమ్మ చెప్పింది. ఏ క్షణంలో ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు ? అందుకే ఈ ఇంట్లో అందమైన వాళ్లెవరూ ఉండకూడదు."

"ఓస్... అంతేకదా! అలాగయితే, ఇప్పుడే సింకిచేటలా తయారైపోతానమ్మగారూ! చాలా, అమ్మాయిగారూ ?" అంటూ సుబ్బులు జుట్టు విరబోసుకుంది.

"చాలదు. ఇంకా అసహ్యంగా తయారయితేనే – అప్పుడు నీ జీతం పెంచుతాను," అని జయ అనేసరికి సుబ్బులు ఏదో ఆలోచిస్తూ వెళ్లిపోయింది.

దగ్గుబాటి భాస్కరరావు నిర్మించిన అనంతలక్ష్మి ఇంటర్నేషనల్‌వారి "పండంటి కాపురానికి 12 సూత్రాలు" చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు.

### "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?"

"నలుగురు అమ్మాయిలు... పెళ్ళిపట్ల ఒక్కొక్కరికి ఒక్కో విధమైన ఊహ. వారి ఊహలు నిజమవ్వాలంటే సమాజం అండగా ఉండాలి. కాని,మనం అణుయుగంలో అడుగెట్టినా ప్రాచీన కాలంనాటి ఆచారాలు ఇంకా మనల్ని వీడిపోలేదు. వాటిలో వరకట్న పిశాచి ఒకటి. దీనికి ఎన్నో కుటుంబాలు బలి అయిపోతున్నాయి. అంచేత, ఈ చిత్రం విశేషంగా మహిళలను ఆకర్షిస్తుంది,"అన్నారు వేజెళ్ళ సత్యనారాయణ. ఈయన దర్శకత్వంలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతూన్న శ్రీ బాలబాలాజీ కంబైన్స్ "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?" చిత్రంలో జ్యోతి, తులసి, పూర్ణిమ, శ్యామలగౌరి, గుమ్మడి, నూతన్ ప్రసాద్, సాయిచంద్, రాజా, పరుచూరి గోపాలకృష్ణ, రాజేంద్రప్రసాద్, వంకాయల, సాక్షి రంగారావు, డాక్టర్ శివప్రసాద్, చిట్టిబాబు, పొట్టిప్రసాద్, వేలు, తాతినేని రాజేశ్వరి పాల్గొంటున్నారు. పరుచూరి గోపాలకృష్ణ కథ, సంభాషణలు రాశారు. చక్రవర్తి సంగీతం, ఆర్. కె. రాజు ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, బాబూరావు కూర్పు, యు. కనకరాజు నిర్వహణతో బి. హెచ్. అజయ్‌కుమార్ నిర్మాత.

'విముక్తికోసం' పద్మ, సాయిచంద్



# సినిమా రచయితలందరిలోకీ హిమాలయం శ్రీశ్రీ

"ఆ సాయంత్రం ...
రాక్సీలో నార్మాషేరర్
బ్రాడ్వేలో కాంచనమాల
ఎటకేగుటో సమస్య తగిలిం
దొక విద్యార్థికి..."అన్నారు శ్రీశ్రీ "సంధ్యా సమస్యలు"లో.

"ది డైవోర్స్" చిత్రానికి 1929లో అకాడమీ అవార్డు పొంది, ఎం. జి. ఎం. క్వీన్‌గా ఆ రోజుల్లో వాసికెక్కిన అందాల రాణి నార్మాషేరర్ తన 81వ ఏట కేన్సర్‌తో లాస్‌ఏంజిల్స్‌లో మరణించిన వారం రోజులకే శ్రీశ్రీ అదే వ్యాధితో మనకు దూరమయ్యారు.

ఎంత సినిమా కవి అయినా — వ్యక్తిగతంగా 'మహాకవి' బిరుదాన్ని నిలుపుకోగలిగిన శ్రీశ్రీ పని చేసిన తొలిచిత్రం "కాలచక్రం" విడుదలనాడే కాలగర్భంలో కలిసిపోయింది. తదుపరి చిత్రం 'మాంటే క్రిష్టో' ఆధారంగా రూపొందించిన "మరో ప్రపంచం" చిత్రాన్ని కూడా ప్రజలు ఆదరించలేదు. ఆ తర్వాత "గాంధీనగర్" చిత్రానికి శ్రీశ్రీ పాటలు, చలం మాటలు రాశారు. నటి కనకం పూనుకున్న "దేశదిమ్మరి" చిత్రం పురిట్లోనే సంధికొట్టింది. శ్రీశ్రీ పూర్తిగా మాటలు, పాటలు రాసిన తొలిచిత్రం "ఆహుతి". ఇది "నీరా ఔర్ నందా"కు డబ్బింగ్. ఆ తర్వాత హెచ్. ఎమ్. రెడ్డిగారి కొలువులో



చేరి, "నిర్దోషి, ప్రతిజ్ఞ" చిత్రాలకు పని చేశారు.

ఇది డైరెక్ట్‌గా తెలుగులో తీసిన చిత్రమే అనిపించేంత అద్భుతంగా డబ్బింగ్ చిత్రాలకు మాటలు, పాటలు సమకూర్చడంలో శ్రీశ్రీ సిద్ధహస్తులనిపించుకున్నారు. "జగన్మోహిని" అనే డబ్బింగ్ చిత్రానికి ఉదయం నుంచి సాయంత్రంలోగా పది పాటలు రాసి రికార్డు సృష్టించారు. ఒక్క "మానవుడే మహానుభావుడు" అన్న ఈయన గేయంవల్లే విజయవంతమైంది "గాంధారి గర్వభంగం" అనే డబ్బింగ్ చిత్రం. ఈయన నిర్మాతగా తెలుగులో డబ్ చేసిన ఒక కన్నడ చిత్రం ఆర్థికంగా అపజయం పొందింది.

"మీరు సినిమాలకు రాసిన ఎన్నో పాటలలో మీకు నచ్చినవేవి?" అని అడిగితే శ్రీశ్రీ ఇచ్చిన సమాధానం: "మొదటిది— 'తోడికోడళ్ళు'లోని 'నలుగురు కలిసి, పొరుపులు మరచి, చెయ్యాలి ఉమ్మడి వ్యవసాయం'. రెండొవది — 'వెలుగు నీడలు' లోని 'కల కానిది'."

"రుక్మిణీ కల్యాణం" చిత్రం, కవి— ఖడ్గ తిక్కనల జీవితాలను సమ్మిళితం చేసి మరో చిత్రం, నిలువుటద్దం సైజులో 'మహాప్రస్థానం'ను అచ్చువేయించడం ... ఇవి నా గొంతెమ్మ కోర్కెలు. ఇవి నా జన్మలో నెరవేరవు," అనే వారా మహాకవి. — జి.వి.జి

### "శివరాత్రి మహాత్మ్యం"

"తొలుత నాస్తికుడుగా, తర్వాత ఆస్తికుడుగా మురళీమోహన్ నటిస్తారు," అన్నారు కొమ్మినేని శేషగిరిరావు. ఈయన దర్శకత్వంలో హేమమాలిని ఫిలిమ్స్ నిర్మించే పై చిత్రం ఆగస్టులో సెట్స్‌కు వెళ్తుంది. కవిత, గుమ్మడి, నూతన్‌ప్రసాద్ ఇతర ముఖ్య భూమికలు పోషిస్తారు. జూనియర్ సముద్రాల రచయిత, జె. వి. రాఘవులు సంగీతం, జయకృష్ణ(వి.ఎస్. ఆర్. కృష్ణారావు) ఛాయతో రామచంద్రరావు నిర్మాత.

### నరేష్ హీరోగా
### దేవత కంబైన్స్ చిత్రం

"జూలై 15 నుంచి షూటింగ్ ప్లాన్ చేశాం," అన్నారు ఈదుగంటి వెంకటేశ్వరరావు. ఈయననిర్మించే చిత్రంలో నరేష్,సత్యనారాయణ, కవిత, గీత, భానుచందర్, జీవా అదిగాగల వారుంటారు. సత్యం సంగీత దర్శకుడు. కూర్పుతో పాటు నిర్వహణ బాధ్యతలను ఈదుగంటి నాగేశ్వరరావు వహిస్తారు. ఎస్. ఎ. చంద్రశేఖర్ దర్శకుడు.

### "మనవడు – మనవరాలు"

"మూడు తరాల మధ్య జరిగే సంఘర్షణ ప్రాతిపదికగా చక్కని సబ్జెక్టు. హీరో ది ద్విపాత్రాభినయం. ఆర్టిస్టుల వివరాలు, టెక్నిషియన్‌ల వివరాలు త్వరలో తెలియజేస్తాను. డైరెక్టర్‌గా ఎం. ఆర్. కృష్ణను బుక్‌చేశాం," అన్నారు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి. ఈయన విష్ణుప్రియ ప్రొడక్షన్స్ పతాకంలో పై చిత్రాన్ని నిర్మిస్తారు.





గీత 'కిరాయి బొమ్మలు'లో



'అగ్నిజ్వాల'లో జయంతి, మోహన్‌బాబు

# సినిమా

### "బోళా శంకరుడు"

"గొప్పలకు పోతే మెప్పులేగాని, తిప్పలు తప్పవు. తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం — అనే ప్రాతిపదికమీద అల్లబడిన చక్కని కథ. ఈ చిత్రంలోని పాత్రలు నిజ జీవితంలో ఎక్కడో ఒకచోట ప్రతివారికీ తారసపడు తూంటాయి. చాలా వెరైటీ అయిన సబ్జెక్టు," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కొసరాజు రాఘవయ్య చౌదరి సమర్పించే కవిరత్నా మూవీస్ "బోళా శంకరుడు" చిత్రంలో దాసరి, మురళీమోహన్, సుజాత, సుమలత, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, నిర్మల, సూర్యకాంతం, కల్పనారాయ్ పాల్గొంటున్నారు. భీశెట్టి కథకుడు. చక్రవర్తి సంగీతం, కె. ఎస్. మణి ఛాయ, శ్రీహరి శిల్పం, రవి కూర్పు, సూరపనేని రాధాకృష్ణ సహ దర్శకత్వంలో కొసరాజు భానుప్రసాద్ నిర్మించే ఈ చిత్రం తొలి షెడ్యూల్ జూన్ 14 నుంచి నెలాఖరుకు వరకు జరిగింది.

'అమరజీవి'లో జయప్రద, పండరీబాయి



### "మహారాణి"

"జయచిత్ర నటించిన 100వ చిత్రం. విశేషంగా మహిళలను ఆకర్షించే ఈ చిత్రంలో జయచిత్ర, సుజాత రెండు క్లిష్టమైన పాత్రలను మహోద్భుతంగా పోషించారు," అని పై చారిత్రాత్మక చిత్రాన్ని నిర్మించే శివచిత్ర మూవీస్ అధినేతలు డి. పి. రాజా, టి. విజయభాస్కరరెడ్డి తెలిపారు. పౌరాణిక, జానపద, చారిత్రాత్మక సాంఘిక చిత్రాల డైరెక్టర్‌గా వాసికెక్కిన కె. ఎస్. గోపాలకృష్ణ రూపొందించిన ఈ చిత్రంలో ఉమ, రాజసులోచన, విజయకుమార్, మేజర్ సుందరరాజన్, మనోహర్, సురుళిరాజన్ పాత్రధారులు. శ్రీ చందర్ సంభాషణలకర్త. శివాజీరాజ స్వరకల్పనలో డాక్టర్ నెల్లుట్ల, ఆరుద్ర గీతాలు రాశారు. నిర్మాణత : కోమలబాబు.

### "గుడిగంటలు మోగాయి"

"మా చిత్రం ద్వారా అశ్విని అనే కొత్త నటిని పరిచయం చేస్తున్నాం," అన్నారు ధవళ సత్యం. ఈయన రచన, దర్శకత్వంలో



జయసుధ 'అమ్మాయికుడుకాడు అసాధ్యుడు'లో

మోహన్‌కుమార్, రవికుమార్, కనకారావు, గుప్తా నిర్మించే మనోరంజని క్రియేషన్స్‌వారి పై చిత్రంలో సాయిచంద్, ముచ్చెర్ల అరుణ, రాజేంద్రప్రసాద్, డాక్టర్ శివప్రసాద్ పాల్గొంటున్నారు. చక్రవర్తి సంగీతం, బొమ్మేటి సుబ్రహ్మణ్యం ఛాయలో మాజేటి ప్రహ్లాదరావు సమర్పిస్తున్నారీ చిత్రాన్ని. "మే 29న ద్రాక్షారామంలో షూటింగ్ ప్రారంభించాం. కోటిపల్లి, కపిలేశ్వరపురం, దాసరిపాడు గ్రామాల్లో కూడా కొన్ని సన్నివేశాలు చిత్రీకరించాం. జూన్ 25కి షూటింగ్ పూర్తయింది," అని నిర్వహణ బాధ్యతలు వహించే విజయరాజ్ తెలియజేశారు.




# మీ దినచర్య
# టాన్‌టెక్స్®
# తోనే ప్రారంభించండి

పగలు మొదలు రాత్రి వఱకు టాన్‌టెక్స్‌నే ధరించండి. దాని అమరిక, పోందిక మీ దినచర్య లందు ఎంతో తోడ్పడును.

IS 4964



మీకు ఖచ్చితంగా
సరిపోతుంది
**టాన్‌టెక్స్**

బ్రీఫ్‌లు • వెస్ట్‌లు • క్యాజువల్స్ • స్పోర్ట్స్
పిల్లల దుస్తులు




ttk తంయారి



'జస్టిస్ చౌదరి' హిందీ చిత్రంలో శ్రీదేవి, జితేంద్ర

# హిందీ చిత్ర విశేషాలు!

★ "ఆవో ప్యార్ కరేఁ" చిత్రం ట్రయిలర్‌కు సెన్సార్ వారు 3 కట్స్‌తో 'ఎ' సర్టిఫికేట్ ఇచ్చారు

★ "అగర్ తుమ్ నా హోతే" చిత్రంలో రేఖ ఓ పాట పాడింది.

★ దర్శక నిర్మాత శక్తిసామంత్ చిత్రంలో రాజేష్‌ఖన్నా సరసన జయప్రద నాయికగా బుక్ అయింది

★ పాకిస్తాన్ క్రికెట్ క్రీడాకారుడు సర్‌ఫ్రాజ్ నవాబ్ సహాయార్థం కరాచీలో ఒకరోజు పాటు జరిగే క్రికెట్ పోటీలో పాల్గొనడానికి దిలీప్‌కుమార్ నాయకుడుగా ఒక జట్టు త్వరలో పాకిస్తాన్‌కు వెళ్లనున్నది ఇందులో సంజీవ్‌కుమార్, శతృఘ్నసిన్హా, అమ్జాద్‌ఖాన్, ప్రముఖ క్రికెట్ క్రీడాకారులు బి ఎస్. బేడీ, సలీమ్‌దురానీ, ప్రీత్పాల్‌సింగ్, సర్‌ఫ్రాజ్ నవాబ్ పాల్గొంటారు.

★ ఇప్పుడు పాతిక చిత్రాల్లో నటిస్తున్న రీనారాయ్ కొత్త చిత్రాలు అంగీకరించం లేదు. వచ్చే జనవరి మొదటి తారీఖునుంచి ఆమె షూటింగ్‌లలో పాల్గొనదు. త్వరలో పెళ్ళి చేసుకోబోతోంది.

★ తాతినేని రామారావు దర్శకత్వంలో అనుమోలు వెంకటసుబ్బారావు నిర్మించే ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి హిందీ చిత్రంలో దిలీప్‌కుమార్ ఒక ముఖ్య భూమికను నిర్వహించవచ్చు.

★ "దేవత" చిత్రాన్ని కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో డి. రామానాయుడు హిందీలో "తోఫా"గా నిర్మిస్తున్నారు. తొలి షెడ్యూల్ జూన్ 20 నుంచి పది రోజులపాటు జరుగుతుంది. జితేంద్ర, శ్రీదేవి, జయప్రద, ఖాదర్‌ఖాన్, అస్రానీ, అరుణాఇరానీ, శక్తికపూర్ వగైరా తారాగణం. సంగీతం . బప్పీలహి. ఛాయ . కె. ఎస్. ప్రకాష్.

★ దర్శక నిర్మాత డాక్టర్ వి. శాంతారాం "జంజార్" చిత్రానికి ఏప్రిల్ 19 న ప్రారంభోత్సవం జరిగింది. తొలి షాట్ చిత్రీకరించే ముందు నాయికా నాయకులు పద్మినీ కొల్హాపురి, సుశాంత్‌రే చేత 9 సార్లు శాంతారాం రిహార్సల్స్ చేయించారు. సినిమా స్కోప్‌లో తీయబడే ఈ చిత్రం 70 ఎం. ఎం. లో కూడా ప్రదర్శింపబడుతుందట.

★ షమాకాక్కడ్ అనే హరియానా యువతి తన 15 వ ఏట శక్తిసామంత చిత్రం "బాలికా బాధు" నటించడానికి బొంబాయికి పిలిపించబడింది. కాని, స్క్రీన్ టెస్ట్‌లో ఆమె నాయిక పాత్రకు మరీ చిన్నదిగా ఉందని నిరాకరించబడింది. దాంతో ఆ యువతి తానే నిర్మాతగా మారి "వాదా" అనే చిత్రాన్ని జితేంద్ర, ఆశాపరేఖ్, అమ్జాద్‌ఖాన్‌లతో ప్రారంభించింది — తను కూడా ఓ ముఖ్య భూమికను నిర్వహిస్తూ. తీరా నాలుగున్నర లక్షలు వెచ్చించి మూడు రీళ్ళు తీసేసరికి అలాంటి కథతోనే మరో రెండు చిత్రాలు త్వరితగతిన తయారవుతున్నాయనితెలిసి, ఆ చిత్ర నిర్మాణాన్ని అంతటితో ఆపేసింది, "ప్రీత్ నా జానే రీత్" అనే చిత్రాన్ని వెంటనే ప్రారంభించింది అభిషేక్ అనే కొత్త హీరో సరసన నాయికగా నటిస్తూ, సహదర్శకత్వం కూడా నిర్వహించింది. ఈ చిత్రానికి ఆమె స్వస్థలం హరియానాలో వినోదపు పన్ను మినహాయింపు లభించింది.

## సినిమా

### "ఆడ పెళ్ళివారు"

"ముగ్గురు రచయితలను, ముగ్గురు రచయిత్రులను పరిచయం చేస్తున్నాం. సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సూర్యకాంతంతోపాటు కొందరు కొత్త నటీ నటులుకూడా పాల్గొంటారు. విశాఖపట్నంలో ఆగస్ట్ నెలలో షూటింగ్ ప్రారంభమవుతుంది మొదట ఒక పాతికమంది డాన్సర్స్‌తో ఒక గ్రూప్ సాంగ్‌ను పిక్చరైజ్ చేస్తాం," అన్నారు జి వి.ఆర్ శేషగిరిరావు ఈయన దర్శకత్వంలో "ఆడపెళ్ళివారు" చిత్రాన్ని నిర్మించే శ్రీ సాగర కన్యా ఫిలిమ్స్ సంస్థకు ఇటీవల విశాఖపట్నంలో ప్రారంభోత్సవం జరిగింది. పెండ్యాల సంగీత దర్శకుడు.



శోభన్‌బాబు 'తోడూ—నీడ'లో

### నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

మహేష్‌మూవీస్ "అమరజీవి అంబేడ్కర్", హేమ మూవీస్ "భీముడు", "దానవుడు", శ్రీహరి లక్ష్మి ఫిలిమ్స్ "ఇలవేల్పు", చంద్రశ్రీ ఫిలిమ్స్ "కళాపిపాస", విజయలక్ష్మి ఆర్ట్ మూవీస్ "కొండవీటి దొంగ", ఉషోదయా క్రియేషన్స్ "తెల్లగులాబీలు". మధు ఆర్ట్ ఫిలిమ్స్ "తల్లి ఒడిలో", అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ "శృంగార పురుషుడు", జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ "రక్తతిలకం", క్రియేటివ్ కమర్షియల్స్ "హీరో", నవత ఆర్ట్స్ "జడగంటలు".



# రుచిచూస్తే తెలుస్తుంది!

# మేము వుపయోగించిన వస్తువులు ఆ ప్రత్యేకతకి కారణం

ప్రకృతి సిద్ధమైన మూల పదార్థాలు. అందుచేత ట్రూ బిస్కట్లకి లభించాయి— స్వచ్ఛత, పోషకత్వం, సంపూర్ణత్వం ట్రూ బిస్కట్లు. అరగించి ఆనందించడానికి ఇతరులతో పంచుకోడానికి ఇతరులకి ఇవ్వడానికి అందరికీ కావలసిన అనేకరకాలు.













**హనీ గ్లూకోజ్**
గ్లూకోజ్ మరియు స్వచ్ఛమైన తేనెతో శక్తినిచ్చే బిస్కట్




**మారీ**
అన్ని వేళలకి కాఫీ త్రాగేటప్పుడు, టీ తీసుకునేటప్పుడు లేక ఏ సమయంలోనయినా




**స్క్రంచ్**
మింట్ చేరిన తియ్యని, కరకరలాడే చాక్లెట్ క్రీమ్ బిస్కెట్




**నీస్**
సహజమైన కొబ్బరి కురిడీతో చేసి పంచదార జల్లిన రుచికరమైన బిస్కెట్

**ఏలక్కాయ కస్టర్డ్ క్రీమ్**




పోషకత్వం కలిగి, గట్టిగావుండే కస్టర్డ్ క్రీమ్ మరియు ప్రకృతిసిద్ధమైన ఏలక్కాయలతో రుచికరమైన కలయిక, ఆరగించడానికి, అందించి ఆనందించడానికి

**ట్రూ బిస్కట్**

HTM AFL 2812

సీరియల్

# [illegible]

## వక్కలంక పద్మావతి

*(గత సంచిక తరువాయి)*

అన్ని గదుల్లోనూ లైట్లు వెలుగుతున్నాయి

కాంపౌండులో వెలిగే మెర్క్యూరీ బల్బు కాంతిలో ఆ మేడ మెరిసిపోతూంది కానీ సురేంద్ర గదిలో మాత్రం చీకటిగా వుంది — అతని మనసులో కూడా చిక్కని చీకటి.

ఉన్నట్టుండి గదిలో లైటు వెలిగింది

అంత వెలుగును ఒక్కసారిగా భరించలేనట్టు కళ్ళకు చేతులు అడ్డుపెట్టుకుని .. నెమ్మదిగా చేతులు తీసి చూశాడు.

ఎదురుగా మంజుల.

వెంటనే బెడ్ మీంచి లేచి కూర్చుని 'రా మంజూ' అంటూ ఆహ్వానించాడు తెచ్చి పెట్టుకున్న ఉత్సాహంతో.

మంజుల వచ్చి అతని కెదురుగా కుర్చీలో కూర్చుంది. ఆమె మలేషియా నుంచి వచ్చి పది రోజులు కావస్తుంది. తలిదండ్రులను వదిలి అంతకాలం అక్కడెలా వుండగలిగిందో ఆమెకే అర్థం కాలేదు కానీ తలిదండ్రుల్ని చూడాలనే కోరికతో అక్కడ నిలువలేక వినోద్‌ని తొందర పెట్టింది కానీ అతనికి రావటానికి వీలుపడక మంజులను ఒక్కదాన్ని పంపించాడు 'వీలయినంత త్వరలో వచ్చేయ'మని.

కేబుల్ అందగానే సురేంద్ర వెళ్ళి మద్రాసులో మంజులను రిసీవ్ చేసుకువచ్చాడు

ఇంటికొచ్చిన మంజుల కిరణ్ బేబీలు ఎదురురాగానే ఆశ్చర్యపోయింది అప్పుడెవరూ ఏమీ చెప్పలేదు. అసలు సురేంద్రను చూసిన దగ్గర్నుంచి ఆమెకెందుకో అనుమానంగానే వుంది. మనిషి బాగా చిక్కిపోయాడు. ఎప్పుడూ నవ్వుతూ, తనసెలా ఆటలు పట్టించటమూ అని చూసే 'సురేంద్రేనా' అనిపించింది. పైకి కనిపించే ఆ నవ్వూ, మాటలు నటనగా తోచాయి కానీ వెంటనే కారణం అడగటం బావుండదని వూరుకుంది

గాయత్రి ఊళ్ళో లేకపోవటంవల్ల పిల్లల్ని ఇంట్లో వుంచి వెళ్ళినట్టు చెప్పింది తల్లి మంజులకు

సురేంద్ర తీరిగ్గా వుండటం చూసి ఒంటరిగా వెళ్ళి, మంజుల అడిగింది అతన్ని అసలేం జరిగిందో నిజం చెప్పమని.

సురేంద్ర మనసు విప్పి జరిగిందంతా పూర్తిగా చెప్పాడు.

అతను చెప్పే ఒక్కొక్క విషయం మంజులకు ఎక్కడలేని భయాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించాయి. తను వింటున్నది కలా? నిజమా? అని ప్రశ్నించుకుంది

తన ప్రాణస్నేహితురాలు గాయత్రి ఇంత పని చేసిందా! అయితే గాయత్రి ఇప్పుడెక్కడుంది? అసలు ఉందా, లేదా ఉంటే ఇంత కాలం కనుపించకుండా ఏం చేస్తుంది? ఒక్క ఉత్తరం కూడా రాయకుండా ఎలా వుంటుంది?

మై గాడ్! గాయత్రి కేమీ కాలేదు కదా!!!

ఇక్కడ సురేంద్ర ఆమెకోసం ఎంతకాలం పరితపిస్తాడు ఎంతో తెలివి, జ్ఞానం కలవాళ్ళు కూడా ఒక్కోసారి, ఎంత తెలివితక్కువగా ప్రవర్తిస్తారో! చిన్ని చిన్ని సమస్యల్ని కూడా తేలిగ్గా పరిష్కరించుకోవటం తెలీక పెద్ద సమస్యగా తయారవుతాయి ఆ ధైర్యం, తెగింపు కాస్త ముందుగా సమయానికి ప్రదర్శిస్తే అందరికీ యీ భయాలూ బాధలూ వుండేవి కాదుగా" అనుకుంది మంజుల

గాయత్రిని అలా మందలించినా ఆమె దూరమవుతుందేమోనన్న ఆలోచనరాగానే మంజుల కళ్ళల్లో నీరు తిరిగేది తను కొంత కాలం అక్కడికి వెళ్ళకుండా వుండిపోయినా బావుండేది

సురేంద్ర తనని తాను నిగ్రహించుకుంటూ, మంజులను బాధపడవద్దని చెప్పాడు మంజుల కళ్ళు తుడుచుకుంది నెమ్మదిగా!

"మంజూ! అక్కడ నీ లైఫ్ బిజీగా వుండి వుంటుంది ఇక్కడ నీకు బోర్ కొట్టిస్తున్నా కదూ! నీ అల్లరితనంతో తాత్కాలికంగానైనా మామూలు మనిషిని అవుతాననుకున్నాను కానీ నాకది సాధ్యం కావటంలేదు క్షమించు" అన్నాడు

అతనికి కాస్త దగ్గరికి కుర్చీ లాక్కుని అతని చేతిని పట్టుకుని మృదువుగా నొక్కుతూ అంది, "సురేన్! మిమ్మల్నందర్నీ చూడాలని, మీతో కొన్నాళ్ళు ఆనందం పంచుకోవాలని, ఎంతో ఆశపడి వచ్చాను. నేనుండే కొద్ది కాలంలోనే మీ ఇద్దరి పెళ్ళి చూడగలిగే అవకాశం కోసం ఆశపడ్డాను కానీ నా మనసంతా అయోమయం అయిపోయింది నువ్వూ, గాయత్రీ నాకు అత్యంత ఆప్తులు మీ ఇద్దరూ ఇలా

---

**జరిగిన కథ — 8:** సురేంద్ర తను గాయత్రిని ప్రేమిస్తున్నట్లు మంజులతో చెపుతాడు. గాయత్రి మాటలకు సురేంద్ర మనసు దెబ్బతింటుంది. తను గాయత్రిని మనస్పూర్తిగా ప్రేమిస్తున్నట్లు ఆమెకు చెపుతాడు. గాయత్రి కూడ సురేంద్రను ప్రేమిస్తుంది కాని తండ్రికి భయపడి తన ప్రేమను బయటకు వ్యక్తం చేయలేకపోతుంది గాయత్రి మనస్సు విప్పి తన ప్రేమను సురేంద్రతో చెపుతుంది. మంజుల, వినోద్, సురేంద్ర, గాయత్రీలు మహాబలిపురం పిక్నిక్ వెళ్ళి అక్కడ సరదాగా కాలక్షేపం చేస్తారు. మంజుల వివాహం వినోద్‌తో జరిగిపోతుంది తిరుపతిలో ఒక సినిమా నిర్మాత గాయత్రి అందాన్ని చూసి ఆకర్షింపబడుతాడు. శ్రీనివాసన్ సెక్రటరీ 'స్వామి' శ్రీనివాసన్ గాయత్రిని పెళ్ళి చేసుకోను ఇష్టపడుతున్నట్లుగా పరమేశంగారికి చెప్పగా ఆయన తన కూతురి అదృష్టానికి మురిసిపోతారు. గాయత్రి తండ్రి మాటను కాదనలేక పెళ్ళికి అంగీకరిస్తుంది. కానీ ఆఖరి క్షణంలో మనస్సు సరిపెట్టుకోలేక ఇల్లు విడిచి సురేంద్ర దగ్గరకు పారిపోతుంది సురేంద్ర ఇంట్లో లేకపోగా నిరాశతో కదిలే రైలెక్కుతుంది. విశ్వనాధంగారు గాయత్రి ఇంట్లోంచి వెళ్ళిపోయిందనే విచారంతో ఆమె తండ్రి మరణించాడని సురేంద్రతో చెపుతాడు. అది విని హతాశుడయ్యాడు సురేంద్ర. ఇల్లు విడిచిన గాయత్రి 'తిరువణ్ణామలై'లోని శ్రీకాంతన్ అనే తమిళ రచయిత ఆశ్రయం చేరుకుంటుంది. శ్రీకాంతన్‌కు గాయాలు తగలగా అతనికి సేవలు చేస్తుంది గాయత్రి ఆమె సేవలకు ముగ్ధుడై ఆమెచే ఆకర్షింప పడుతాడు శ్రీకాంతన్. గాయత్రి జాడ తెలీక సురేంద్ర తల్లడిల్లిపోతూ ఉంటాడు శ్రీకాంతన్ ప్రవర్తనకు గాయత్రి మనసు కలవర పడుతుంది.

---

అయిపోవటం, నా హృదయాన్ని బరువెక్కి స్తుంది నిన్నెలా ఓదారిస్తే నీ బాధ మాయమవు తుందో నాకు తెలీటంలేదు.

నువ్వు గాయత్రిని ఎంత గాఢంగా ప్రేమించావో నాకు తెలుసు. తెలిసే నీకిలా చెప్తున్నానని బాధపడకు సురేన్! గాయత్రి కోసం ఇంకా ఎంతకాలం నువ్విలా కుమిలిపోతావు? జీవితానికి ఒక గమ్యం అంటూ వుండాలి. గాయత్రిని మర్చిపొమ్మని నేను అనను గానీ, ఆమెను ఒక అందమైన కలగా భావించి కొత్త జీవితాన్ని ప్రారంభించు అందరం సంతోషిస్తాం" అంది

"మంజూ! నేను గాయత్రిని ఒక తీయని స్వప్నంలా భావించి, జీవితాంతం ఆ కలలనే తలుచుకుంటూ బ్రతకాలని నిర్ణయించుకున్నాను కలలోలాగే కొద్ది కాలమే ఆమె నాతో గడిపినా... వెన్నెలలాటి ప్రేమను, అమృతం లాంటి అనురాగాన్ని ఈ జన్మంతా సరిపోయేలా ప్రసాదించింది. ఆమెను మననం చేసుకుంటూ మరొకరితో జీవితం పంచుకోవటం అంటే.. నా వల్లకాదు మంజూ! నువ్వయినా అర్థం చేసుకో" అతని మాటలు బరువుగా దుఃఖంతో నిండినట్టుగా వెలువడ్డాయి

మంజుల ఇంకేమీ అనలేకపోయింది అతన్ని.

"సురేన్! గాయత్రిని నీకు పరిచయం చేసింది నేనే! అందుకు ఇప్పుడు బాధపడుతున్నాను మీ ప్రేమ ఫలించడానికి పరమేశం గారితో కాస్త ఘర్షణ పడాలనిపించింది గానీ.. ఇంత విపరీత పరిణామాలకు దారితీస్తుందనుకోలేదు.. సురేన్ దీని కంతటికి నేనే కారణం. నన్ను క్షమించు" అంటూ కన్నీళ్లు పెటుకుంది.

ఉలికిపాటుగా ఆమె చేతిని పట్టుకున్నాడు సురేంద్ర

"ఎంత మాటన్నావు మంజూ! మానవుడి జీవిత దశలు చాలా తక్కువ ఒక్కో దశను ఒక్కో రకమైన మార్పు, ఆ మార్పుకి ఒక అనుభూతీ కావాలి. యీ వయసులో ఎవరో ఒక ప్రత్యేకమైన వ్యక్తి వల్లే పొందగల రసానుభూతిని గాయత్రి సాన్నిహిత్యంలో.. ఆమె ప్రేమలో పొందగలిగాన్నేను ఆమె నా జీవితంలో ప్రవేశించటం నీవల్లేనని నువ్వంటే నాకెంతో అభిమానం మంజూ!"

"లేకపోతే నేనంటే నీ కిష్టం వుండేది కాదన్నమాట" అంది కోపం నటిస్తూ!

"ఉహు! అస్సలుండేది కాదు" అన్నాడతను పెదవి విరుస్తూ!

ఇద్దరూ పకపకా నవ్వేశారు. అతనలా నవ్వుతుంటే చూస్తూ వుండిపోయింది మంజుల.

"ఎంత కాలమైంది నువ్విలా నవ్వి! ఎప్పుడూ అలా నవ్వుతూ వుండిపో సురేన్!" అంది ఆశగా. 'అలాగే' అంటూ మళ్ళీ నవ్వాడతను.

క్రింది నుంచి భోజనానికి లెమ్మని పార్వతి గారు కేక వేయటంతో క్రిందికి వచ్చారు.

భోజనం చేసి సురేంద్ర పైకి వెళ్ళిపోయాడు.

మంజుల వచ్చి సోఫాలో ఏవో పుస్తకాలు తిరిగేస్తూ కూర్చుంది. కిరణ్ బేబీలు, ఇద్దరూ ఆమెకు చెరోపక్కా చేరారు.

మంజుల వచ్చిందగ్గర్నుంచి వాళ్ళు ఆమెను క్షణంకూడా వదలకుండా అంటిపెట్టుకు తిరుగుతున్నారు గాయత్రిని మంజులలో చూచుకుని అక్కా .. అక్కా . అంటూ సంబర పడిపోతున్నారు వాళ్ళు. ఆ పిల్లల్ని చూస్తుంటే మంజులకి వాళ్ళపట్ల జాలి, అభిమానం పొంగుకొచ్చాయి.

వాళ్ళతో కబుర్లలోపడి చాలా టైం గడిచిపోయింది.



"కిరణ్ పదయింది వెళ్ళి పడుకోండి నాకు ఏదైనా పుస్తకం చదువుకుంటేగానీ నిద్ర రాదు ఇక్కడివన్ని చూసినవే సురేంద్ర దగ్గరికెళ్ళి ఏదైనా మాగ్జైన్ తెచ్చిపెట్టు"

"సాయంకాలం రామూ తెచ్చిన పుస్తకం అప్పుడే చదివేశావా!" అన్నాడు కిరణ్

"లేదు! ఏదో ఒకటిలే... అది ఇక్కడే వున్నట్టుంది సరే మీరెళ్ళి పడుకోండి" అంటూ వాళ్లని గదిలోకి పంపేసి తను ఆ పుస్తకం తీసుకుని బెడ్ రూంవైపు నడిచింది

పేజీలు తిప్పుతున్న మంజుల ఒకచోట ఆగిపోయింది, హఠాత్తుగా

"ఏమిటీ? శ్రీకాంతన్! ప్రఖ్యాత తమిళ రచయిత శ్రీకాంతన్ తెలుగు నవల రాయటమా! ఆశ్చర్యంగా వుందే!" – తనకున్న కొద్ది తమిళ

పరిజ్ఞానంతో మలేషియాలో వున్నప్పుడు రెండు మూడు నవలలు చదివి .. చాలా మెచ్చుకుంది. ఇప్పుడు అతని తెలుగు నవల సగర్వంగా సమర్పిస్తున్నామని బాక్సు కట్టి వేశారు పత్రికాధిపతులు.

ఆ నవలపేరు "మేఘం."

ఆ వారపత్రికలో సీరియల్‌గా ఎప్పటినుంచీ వస్తోందో ఏమో! పాత పత్రికలుకూడా తెప్పించి చదవాలి అనుకుంటూ మొదటి పేజీలో 'జరిగిన కథ' చదివింది ముందుగా.

ఒక్క ఉదుటున లేచి కూర్చుంది మంజుల ఆమె నిద్రంతా మెలకువగా మారింది. మళ్ళీ మళ్ళీ ఆ భాగాన్ని చదివింది. ఆమె ఆశ్చర్యానికి అంతులేదు.

"అప్పుడు తెల్లవారుఝాము నాలుగ్గంటలయింది ఈదురుగాలి వీస్తోంది ఆకాశం మేఘావృతమై లోకమంతా భయంకరమైన చీకటి. ఉరుములు, మెరుపులుతో కాస్త గాలి తగ్గిన వెంటనే జట్కాబండి ఎక్కి ఆశ్రమానికి పోనివ్వమంది సౌమిత్రి !. (సశేషం)

ఆవాక్యంతో ఆ భాగం పూర్తయింది.

ఎవరు ? ఎవరీ సౌమిత్రి ! ఇది గాయత్రి కథే అయివుంటుంది ఇప్పటి వరకూ టూకీగా తెలిసిన కథ గాయత్రినే జ్ఞాపకం చేస్తుంది. ఆ తర్వాత ఏం జరిగిందో ! ఒకవేళ గాయత్రి ఈ కథ అతనికి చెప్పిందేమో ! అదే నిజమయితే గాయత్రి బ్రతికే వుందన్న మాట . బహుశా ఆ రచయిత అడ్రసు తెలిస్తే... గాయత్రి వివరాలు తెలుస్తాయి ..

ఆమె మనసు తీవ్రంగా ఆలోచిస్తోంది మళ్ళీ ఒక అనుమానం తొంగి చూసింది ఆమె మస్తిష్కంలో !

ఒకవేళ అది అతని కల్పితగాధే ఎందుకు కాకూడదు ? ఆ వూహ అతనికెందుకు రాకూడదు. ఆ కథ తమ జీవితాల్ని ఎందుకు ప్రతిబింబించ కూడదు... ఏమో ! అంతా అయోమయంగా వుంది ఆమెకు అయినా అంతా చదివితే గాని అసలు సంగతి తేలీదు.

అయితే పాతపుస్తకాలు కూడా తీసుకు రావాలి ! ఎక్కడ దొరుకుతాయో ఏమో ! అనుకుంటూ నిద్ర లేకుండానే గడిపింది ఆ రాత్రంతా మంజుల. తెల్లవారిం తర్వాత కిరణ్‌ను తట్టి లేపింది

"కిరణ్ ఈ నవల ఈ వారపత్రికలో ఎప్పటి నుంచి ప్రారంభం అయిందో; కనుక్కొని ఆ పత్రికలన్నీ నాకు తెచ్చిపెట్టాలి ఎంత ఖర్చయినా ఎంత సేపైనా సరే. . వెతికి తీసుకు రావా !" అంటూ బ్రతిమిలాడింది.

ఆమె ఆతృతని చూసి ఆశ్చర్యపోయాడు కిరణ్ 'అలాగే' నంటూ సైకిలు తీసుకుని బయలుదేరాడు వెంటనే

ఈ విషయం సురేంద్రకి చెప్పాలనుకుంది మంజుల చెప్తే అతను వెంటనే వెళ్లిపోతాడు.

## ఇది మేఘ సందేశమూ...

తీరా ఇది గాయత్రి కథ కాకపోతే... అందుకే అన్నీ చదివి తనొక నిర్ధారణకి వచ్చేవరకూ ఈ విషయం అతనికి చెప్పకూడదనుకుంది.

ఒక గంట తర్వాత కిరణ్ వచ్చాడు ఏడెనిమిది పత్రికలు తీసుకువచ్చాడు

మంజుల గబగబా తన గదిలో కూర్చుని 'మేఘం' సీరియల్ మొదటి నుంచి చదవసాగింది

ఒక్కో సంఘటన, ఒక్కోపాత్ర పరిచయం చదువుతుంటే ఆమెలో ఆతృత, ఆందోళన అధికమైంది. అన్ని పత్రికల్లోనూ సీరియల్ గబగబా చదివింది. మళ్ళీ మళ్ళీ చదివింది ఆమె హృదయం ఆనందంతో గంతులు వేసింది అది ఖచ్చితంగా గాయత్రి కథే !

### "నిర్వచనం"

చీకటిలో చెట్టు నల్లన
ఎండలో ఆ చెట్టే చల్లన
గోరింటాకులో ఎరుపు వుందిలే
హారతిలో వెలుతురు వుందిలే

ఆకు ఆకు కదలగా
చల్లగాలి వీయగా
పెనుగాలే రేగితే
కొమ్మకొమ్మ రాలుగా

పూలు పూయు వేళలో
ఆకురాలిపోదుగా
ఆకురాలు వేళలో
పండు పండఁబోదుగా

కాడలే మానులా
మానులే తోటలా
భూమిపై నీడలా
సృష్టిలో అడవులా

— గంధం సాయిరమేష్

కథలో ఇల్లు విడిచిన సౌమిత్రి రైల్లో కూర్చుని గతాన్ని నెమరువేసుకుంటుంది ఇంత వరకూ ! ఈ వారం దాన్లో రైలుదిగి వర్షంలో ఆశ్రమానికి బయలుదేరింది.

అయితే . గాయత్రికి ఈ రచయిత పరిచయం అయ్యాడా ! శ్రీకాంతన్ అరుణాచలం లోనే వుంటున్నాడా ! తను ఉన్న ప్రాంతాన్నే కథలో తీసుకోవాలని ఎక్కడుంది వీళ్ళిద్దరికి పరిచయం లేకపోతే ఆమె కథ అతనికెలా తెలుసు! అసలు ఇది అతని కల్పనాగాథేమో !

మెదడు మొద్దుబారిపోయింది మంజులకి. ఆలోచనలు ఎంతకూ తెగటంలేదు అది గాయత్రి కథేనని మనసు చెపుతూంది. కాదేమోనని మళ్ళీ అనుమానం !

అయినా ఇవన్నీ ఇక్కడ కూర్చుని ఆలోచించటంకంటే... ఎలా అయినా ఆ రచయితని కలుసుకోవటం మంచిది. ఈ విషయం వెంటనే సురేంద్రకు చెప్పాలి

వెంటనే గబగబా పైకి వెళ్ళింది మంజుల సురేంద్ర ఆఫీసుకి వెళ్ళిపోయారని రామూ చెప్పాడు. ఆఫీసుకి ఫోన్ చేసింది కానీ అతను కేంప్ వెళ్ళాడని, సాయంత్రానికి వస్తాడని చెప్పారు వాళ్ళు

ఉస్సురని నిట్టూర్చింది ఏంచేయాలో తోచటంలేదామెకు అతను వచ్చేవరకూ ఊరికే కూర్చోబుద్ధి కావటంలేదు మంజులకు ఆమె మనసులో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది వెంటనే లేచి ఆ పత్రిక కార్యాలయం అడ్రసు చూసింది మద్రాసు నుంచి వెలువడుతుందా పత్రిక ఫోన్ నెంబరు చూసి ప్రాణం లేచి వచ్చిందామెకు

ఆ నెంబరుకి ట్రంకాల్ బుక్ చేసింది నిమిషాలు యుగాలుగా గడుస్తున్నాయామెకు ఎంతకీ కాల్ రావటంలేదని నాలుగైదుసార్లు ఎంక్వయిరీ చేసి ఆతృతగా అడిగింది.

దాదాపు రెండు గంటల తర్వాతగానీ కాల్ రాలేదు ఎడిటర్‌గారు లేరని, ఆయన సాయంత్రం నాలుగు తర్వాత వస్తారని, శ్రీకాంతన్‌గారి అడ్రసు కావాలంటే ఆయనతో మాట్లాడాలని చెప్పాడు ఆఫీసు మేనేజరు

ఫోను పెట్టేసి నిస్సత్తువగా కూలబడింది మంజుల గాయత్రి విషయం తెలుసుకుందామని ఎంత ఆరాటపడుతుందో అంత ఆలస్యం అవుతోంది

ఇంతలో సురేంద్ర రావటంతో ఆమెకు ప్రాణం లేచివచ్చింది

వేగంగా అతనికి ఎదురు వెళ్ళింది మంజుల "సురేన్ ! నీకో ఆశ్చర్యకరమైన విషయం చెప్పనా" అంది అతనితోపాటుగా పైకి మెట్లెక్కుతూ !

కాంప్‌కివెళ్ళి రావటంవల్ల అలసినట్లున్న సురేంద్ర ఆ మాటలు పట్టించుకోలేదు "ప్లీజ్ మంజూ ! ముందు నాకో కప్పు టీ కావాలి" అన్నాడు

గబగబా క్రిందికివెళ్ళి టీ కప్పుతోపాటు ఆ వారపత్రికలన్నీ తెచ్చి అతనిముందు పడవేసింది.

"ఏమిటివన్నీ" అన్నాడు టీ సిప్‌చేస్తూ !

"ఇందులో గాయత్రి వుంది సురేన్"

ఆమె మాటలకు అతను గట్టిగా నవ్వి "ఏం ! ఇంకెక్కడా చోటు దొరకలేదటా ఆవిడకు దాక్కోవటానికి" అన్నాడు హాస్యంగా.

"అయ్యో ! అదికాదు నీకు తెలుసో లేదోగానీ శ్రీకాంతన్ అని ఒక తమిళ రచయిత వున్నాడు అతను మొదటిసారిగా తెలుగులో 'మేఘం' అని ఒక నవల రాశాడు అది ఇందులో సీరియల్‌గా వస్తోంది "

'అంతేకదా' అన్నట్టు చూశాడామెను

"అతను రాసినకథ మనకథే అంటే గాయత్రి కథ" అంటూ ఆ కథని, పాత్రలని గురించి చెప్పి, ఆ సంఘటనలను వివరించి చెప్పింది ఊపిరి పీల్చుకోకుండా

స్థాణువైపోయాడు సురేంద్ర ఆ మాటలు అతని చెవులకి వీణావాదాలుగా వినిపించాయి అతని మనసు క్షణంపాటు రెపరెపలాడింది మంజుల చేతిని తవ చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు—

"ఇది నిజమా మంజూ!" అతని గొంతు వణికింది

"అవును సురేన్! చదివిచూడు" అంటూ ఆ కథాభాగాలున్న పేజీలు తెరచి వుంచింది అన్ని పుస్తకాల్లోనూ

ఆమె ఎదురుగా ఒక్కొక్కటే చదువసాగాడు అతని కళ్ళు వేగంగా అక్షరాలవెంట పరుగులెత్తుతున్నాయి అణచుకోలేని ఆతృత, భయం

చదవటం పూర్తయింది

ఆశ్చర్యంతో, ఆనందంతో అతని నోటివెంట మాటలు రావటంలేదు 'ముందు శ్రీకాంతన్ అడ్రస్ తెలుసుకోవాలి' అన్నాడు

మంజుల తను ఫోన్ చేసిన సంగతి చెప్పింది

టైం చూసుకున్నాడు రాత్రి 8 గంటలయింది

ఒక్కక్షణంపాటు ఆలోచించాడు. "మళ్ళీ ఓసారి ఫోన్ చేద్దాం" అని విసురుగా క్రిందికి వచ్చాడు

వెంటనే మద్రాసులో ఆ పత్రికాఫీసుకి ఫోన్ బుక్ చేశాడు. పది నిమిషాల్లో వచ్చింది కాల్.

'ఈ సమయంలో ఎడిటర్‌గారు ఉండరనీ, రేపు ఉదయం ఫోన్ చేయమని' చెప్పారు అటువైపునుంచి.

చేసేది లేక సురేంద్ర ఫోన్ పెట్టేశాడు చాలాసేపు అలాగే నిలబడిపోయాడు.

పది నిముషాలు గడిచింది. హఠాత్తుగా ఏదో తట్టినవాడిలా మంజుల చేతులు పట్టుకుని, "మంజూ! నేను గాయత్రి దగ్గరకివెళ్తున్నాను ఆ ఊరేమంత పెద్దది కాదు. గాయత్రిని తెలుసుకోవటం సులభమేననిపిస్తుంది నాకు గాయత్రి కలిస్తే నాతో వెంట తీసుకువస్తాను నా అదృష్టమెలా ఉందో, ఏమో!" అన్నాడు

మంజుల దిగ్గున కుర్చీలోంచి లేచి, "సురేన్, నేనూ వస్తాను నీకు తోడుగా" అంది

"వద్దు, మంజూ! గాయత్రి లేకపోతే, ఆమె కోసం మరెక్కడైనా వెతకాల్సి ఉంటుందేమో! నాతో నువ్వేం తిరగ్గలవు మా యిద్దరికోసం ఎదురు చూస్తుండు" అన్నాడు

మంజుల అయిష్టంగానే తలూపింది

రైల్వేస్టేషన్‌కి ఫోన్‌చేసి, మరో అరగంటలో ట్రెయిన్ బయల్దేరుతుందనగానే డ్రెస్ చేసుకుని బైటికి వెళ్ళిపోయాడు

మంజుల చూస్తూ నిలబడిపోయింది

అతను వెళ్ళిన అరగంటకి విశ్వనాథంగారొచ్చారు మంజుల చెప్పే విషయాలు ఆశ్చర్యపోతూ వింటూండిపోయారాయన

* * *

అప్పుడు ఉదయం తొమ్మిది గంటలైంది.

రమణాశ్రమం చూడటంతోనే అతనికి జీవితంమీద పోయిన ఆశ తిరిగి చిగురింప నారంభించింది, అక్కడ గాయత్రి సంగతి ఎవరిని అడిగితే చెప్తారో అతనికి అర్థం కాలేదు ఆ పరిసరాలలో ఆమె జాడ మాత్రం కనిపించలేదు

ఆశ్రమమంతా ఒక్కసారి చుట్టివచ్చాడు చుట్టూ రకరకాల చెట్లు, పక్షులు, నెమళ్ళు, స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి అక్కడ ఆశ్రమ భవనంలోకి వెళ్ళాడు విశాలంగా ఉన్న హాల్లో స్త్రీ పురుషులు చాలా మంది ధ్యాన ముద్రలో ఉన్నట్టుగా కనిపించారు. వారిలో ఫాదర్స్ కూడా ఉండటం గమనించి ఆశ్చర్యపోయాడు

ఇంతమందిలో నా గాయత్రి ఎక్కడుందో కనిపించదే! తనెంత ఆశపడి వచ్చాడో! అసలిక్కడ ఉన్నదో, లేదో! ఆ రచయిత రాసింది కల్పితం కావచ్చు అతని అడ్రసు తెలుసుకుని వస్తే బావుండేది ఏమిటో ఏమీ అర్థం కావటం లేదు

'గాయత్రీ! నువ్విక్కడ తప్పకుండా కనిపిస్తావని ఎంత ఆశపడి వచ్చానో! ఏ చెట్టులో. పుట్టలో ఎక్కడ దాక్కున్నావు గాయత్రీ! ఒక్కసారి కనిపించవూ! నేనేం పాపం చేశానని నాకీ శిక్ష విధిస్తున్నావు'

ఆశ్రమ ఆవరణలో గుబురుగా పెరిగిన చెట్టును ఆనుకుని నిటారుగా నిల్చుని ఆలోచనా సాగరంలో మునిగిపోయిన సురేంద్ర దూరంగా యిద్దరు వ్యక్తులు ఆశ్రమంలోకి అడుగు పెట్టటం చూసి దిగ్గున రెండు అడుగులు ముందుకు వేశాడు కళ్ళు పెద్దవిచేసి పరిశీలనగా చూశాడు

ఆమే గాయత్రి! నిశ్చేష్టుడైపోయాడు సురేంద్ర

అతనిలో ఆనందం పురివిప్పిన నెమలిలా నాట్యం చేస్తోంది

అతని గుండె ఆనందంతో పొంగిపోతుంది

గాయత్రీ! నువ్వు. బ్రతికే ఉన్నావు నాకోసం ఇక్కడ. ఈ మారుమూల ప్రదేశంలో దాగున్నావా? నీకోసం వెతికి వెతికి ఇక్కడికొచ్చాను నా జీవితమంతా నిన్ను నా గుండెల్లో దాచుకుని, కాపాడుకుంటాను —

'గాయత్రీ' అని ఆకాశం ప్రతిధ్వనించేలా పిలవాలనుకున్నాడు కానీ అంతలోనే అతని కంఠమెందుకో బిగుసుకుపోయింది

"అవునూ ఆమెప్రక్కనున్న వ్యక్తి ఎవరు? తెల్లటి బట్టలు.. ఆ నల్లని గడ్డం, కళ్ళజోడు, ఎవరు? ఆ వ్యక్తి ఎవరో తనకు తెలీదు అతను గాయత్రికేమవుతాడు స్నేహితుడా లేక" ఆపైన ఊహించుకోలేక పోతున్నాడు సురేంద్ర

చాలాసేపు అతను ఆలోచిస్తూనే ఉన్నాడు గాయత్రీ, శ్రీకాంతన్ ఆశ్రమం దాటి బైటికి వెళ్ళిపోతూ కనిపించారు

నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడిచే గాయత్రి అతనితోపాటుగా వేగంగా నడవటం ఆశ్చర్యమనిపించింది

వాళ్ళేదో సంభాషిస్తూ, నవ్వుకుంటూ వెళ్ళిపోతున్న దృశ్యం... అతని కళ్ళల్లోని నీటి పొరలోంచి అస్పష్టంగా కనిపించింది

అటుగా వెళ్తున్న ఒక వ్యక్తిని ఆపి, దూరంగా కనిపిస్తున్న గాయత్రిని, శ్రీకాంతన్‌ని చూపిస్తూ, వాళ్ళెవరని అడిగాడు ఇంగ్లీషులో






## ఇది మేఘ సందేశమూ...

ఆ వ్యక్తి, "అతనా.. మీకు తెలీదూ . తమిళ రైటర్ శ్రీకాంతన్" అన్నాడు.

ఆశ్చర్యంతో నోటమాట రాలేదు సురేంద్రకి.

తన పనైపోయినట్టుగా ఆ అపరిచిత వ్యక్తి లోపలికి వెళ్లిపోతున్నాడు

'సార్ !' అని మళ్ళీ పిల్చాడు

'ఏన్నా ?' ఏమిటన్నట్టు చూశాడు అతను

"అతనిప్రక్కన ఉన్నదీ . ఆమె . ?" అంటూ ఆగిపోయి ప్రశ్నార్థకంగా చూశాడు అతన్ని

"ఆమె ఎవరో ఏమిటో మాకు పట్టవు ఎప్పటినుంచో వాళ్ళిద్దరు కలిసి వుంటున్నారు అంతే !" అని చెప్పి వెళ్ళిపోయాడు.

సురేంద్ర నవనాడులూ కృంగిపోయినట్లయ్యాయి

ఉత్తుంగ తరంగంలా లేస్తున్న ఉద్రిక్తత గడ్డకట్టినట్టు అక్కడే కూలబడిపోయాడు

* * *

"గాయత్రీ, నాకీ సేవలన్నీ ఎందుకు చేస్తావు అభిమానంతో నువ్వుచేసే పనుల్ని బలవంతంగా త్రోసిపుచ్చలేకపోతున్నాను రోజులు మామూలుగా దొర్లిపోతున్నట్టుగా లేదూ నీకు నువ్వు కోరుకున్న వ్యక్తిని చేరుకోవాలని లేదా ?" అన్నాడు అన్నం కలుపుతూ

ఇప్పుడు ఒకరిపట్ల ఒకరికి అభిమానంతో కూడిన స్నేహంతప్ప మరే భావాలూ లేవు గాయత్రి అదోరకమైన ప్రశాంతతని కోరుకుంటోంది తనకు యిష్టమున్నంతకాలం శ్రీకాంతన్ దగ్గరుండాలనీ, తర్వాత ఆశ్రమంలో ఉండిపోదామనిపిస్తోంది ఆమెకి

అదే అంది అతనితో! అతనేమీ మాట్లాడకుండా, ఏదో ఆలోచిస్తూ అన్నం తిని లేచాడు

* * *

సాయంత్రం నాలుగ్గంటలైంది. అప్పుడే కాలేజీనుంచి వచ్చిన శ్రీకాంతన్ సైకిల్ ప్రక్కన పెట్టి, చెట్లకు నీళ్ళుపోస్తున్న గాయత్రిని చూశాడు

సాయంసంధ్యలా వెలిగిపోతూంది ఆమె.

"గాయత్రీ! నీ నిరీక్షణ ఫలించబోతోంది. ఈ రోజు నువ్వు నాకు శాశ్వతంగా దూరం కాబోతున్నావు నాది ఒంటరి జీవితం .. ఇలాగే గడిచిపోతుంది ఎప్పుడూ ! కాని నా ఒంటరి జీవితానికి నువ్విచ్చిన ఒక వరం . నీ స్నేహం, భగవంతుడిచ్చిన వరం నా భావాలు. ఇవి చాలు గాయత్రీ నా జన్మకి' లనుకున్నాడు.

'శ్రీకాంత్' అన్న పిలుపుకి కన్నీళ్ళతో కళ్ళు తెరచి చూశాడు

గాయత్రి వేగంగా అతని చేతిని పట్టుకుంది

జలజలా రాలాయి ఆమె చేతులమీద అతని కన్నీళ్ళు

'శ్రీకాంత్! ఏమిటి, ఎందుకిలా వున్నారు ? ఏమైంది ?' అంది అతని కళ్ళల్లో నీళ్ళు మొదటిసారిగా చూస్తున్న గాయత్రి ఆశ్చర్యపోయింది

కన్నీళ్ళతో నవ్వి అన్నాడు

"గాయత్రీ, యనవె, జ్ఞాపకం వచ్చిందో ?"

అతనివంక వింతగా చూసి నవ్వింది

"ఓహో! తమిళం దొర్లుతోంది మాటల్లో ఇంక నేను తెలుగు మాట్లాడనవసరంలేదని జ్ఞాపకం చేస్తుంది" అన్నాడు బాధగా "నన్ను గుర్తుంచుకుంటావా గాయత్రీ అంటున్నాను" అన్నాడు మళ్ళీ తనే.

"ఏమిటి మీరంటున్నది ?"

"కాలేజీ నుంచి వస్తుంటే ఆశ్రమంలో నాకు తెలిసిన ఒకాయన చెప్పాడు, మనకోసం ఉదయం ఎవరో వచ్చారనీ, ఇంతకుముందే అక్కడినుంచి వెళ్ళిపోయారనీ, వెళ్ళి చూద్దాం, రా గాయత్రీ" ఆమె చేతిని పట్టుకుని గబగబా బైటికి నడిచాడు.

అతని మాటల్లోని అతీతశక్తేదో ఆమెని అతని వెనుకే నడిపించింది.

వీధిలోకి వచ్చేసరికి పచ్చని ఫియెట్ కారు యింటిముందుకొచ్చి ఆగింది. గాయత్రి తలెత్తి చూసింది

విశ్వనాథంగారు, మంజుల కారులోంచి దిగటం చూసి నోట మాట రాలేదు గాయత్రికి.

* * *

సురేంద్రకు కళ్ళక్కనిపించే లోకం అంతా శూన్యంగా అనిపించింది. 'కాలంతో రాజీపడి

ఇటీవల మహబూబాబాద్‌లోని మాతృశ్రీ అధ్యయన సంస్థ ఆధ్వర్యంలో జిల్లెళ్లమూడి అమ్మ కల్యాణ మహోత్సవాల సందర్భంగా ప్రసంగిస్తున్న పరిషత్ వ్యవస్థాపకులు డా పి వెంకటనారాయణ.



గతాన్ని విస్మరించటం వివేకవంతుల లక్షణమా ! లేక అవివేకుల తొందరపాటా ?'

తనలో తనే మనసులో ప్రశ్నించుకుంటూ నడుస్తున్నాడు. ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలో, ఏం చేయాలో తోచటం లేదతనికి. అయోమయ స్థితిలో... అసంకల్పితంగా అలా నడుస్తూనే వున్నాడు

రైల్వే స్టేషన్‌కి వెళ్ళి తిరుపతి వెళ్ళే రైలు ఎప్పుడుందో తెలుసుకున్నాడు ! తను తిరుపతికి వెళ్ళాలా. వద్దా? తనకింకెవరున్నారు ? నిరంతరం, నిర్విరామంగా తను ఎదురు చూసిన మనిషి, ఈ రోజు తనకోసం లేదని .. ఆమె జీవితం మరొకరి స్వంతమని తెలిసినప్పుడే . అతను నిర్జీవుడయ్యాడు.

'కనీసపు జ్ఞాపకాలున్నా... గాయత్రి ఇట్లా చేయదు. స్త్రీ అంటే అనురాగానికి, ఆత్మ త్యాగానికీ రూపమని భ్రమపడ్డాడు తను.'

ఇంతలో దడదడమంటూ ఏదో గూడ్సు ట్రయిను వచ్చి వెళ్ళిపోయింది. ఆ శబ్దానికి మళ్ళీ తేరుకున్నాడు తన ఆలోచనల నుంచి.

రైలు రావటానికి ఇంకా గంట పైనుంది.

అతను నడుస్తూ పట్టాలు దాటి అవతల ప్రక్కకి వెళ్ళాడు. అదంతా మైదాన ప్రదేశం చిన్న చిన్న పిచ్చి మొక్కలతో నిండింది నేలంతా

ఆకాశంలో పగలంతా విసిగిపోయిన సూర్యుడు పడమటికి చేరుకుంటున్నాడు మెల్లగా

కాళ్ళకు అడ్డు తగులుతున్న మొక్కల్ని తప్పించుకుని, ఒక పెద్ద రాతి బండమీద కూర్చున్నాడు. అక్కడినుంచి దూరంగా కనిపిస్తున్న రైల్వే స్టేషన్‌లో బొమ్మల్లా నిలబడివున్న రైలు పెట్టెల్నీ, హడావిడిగా తిరుగుతున్న జనాన్నీ చూసి విరక్తిగా నవ్వుకున్నాడు.

'గాయత్రి అన్వేషణ ఫలించి. ఆమెను తనదాన్ని చేసుకోవాలని ఆశతో ప్రతి క్షణం ఒక యుగంలా గడిపాడు. ఆమె అతన్ని పెళ్ళి చేసుకోలేదు కదా ! ఎందుకంత తొందరపడింది తనకోసం యింట్లోనుంచి వెళ్ళిపోయి ఆమె సాధించింది ఇదేనా ?' అనుకున్నాడు.

బాధతో అతని కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

ఒక్కసారి గాయత్రి కనిపిస్తే .. ఆ ఆలోచనతో అతని కళ్ళు తళుక్కున కాంతి నింపుకున్నాయి.

ఇంకెప్పుడూ ఆమె జీవితంలో ప్రవేశించడు తను. ఒక్కసారి ఆమెను చూస్తే చాలని పించింది

అతని కళ్ళు ధారగా వర్షిస్తున్నాయి

నిస్సత్తువతో మెల్లగా కళ్ళు తెరిచాడు సురేంద్ర

చుట్టూ లోకమంతా చిరుచీకట్లు కమ్ముకుంటోంది చల్లగా పశ్చిమాన సూర్యుడు చివరంటా కృంగిపోయాడు బలంగా ఎవరో ఆకర్షించినట్టు

'సురేన్' అని దూరంగా ఎవరో పిలుస్తున్నట్టు లీలగా వినిపించింది ఉలిక్కిపడి చుట్టూ చూశాడు ఆ మసక వెలుతురులో ఎవరో తన వైపుకి వస్తున్నట్టు కనపడింది ఆత్రంగా !

ఎవరూ ? అనుకుంటూ భృకుటి ముడిచి చూశాడు

ఆ ఆకారం దగ్గరికొచ్చింది.

ఒక్కసారి అతని రక్తనాళాలు ఆనందంతో తెగిన అనుభూతి కలిగింది. మళ్ళీ వెంటనే రక్తం ఉత్సాహంతో ఉరకలు వేయసాగింది

'గాయత్రీ' అన్నాడు కాస్త గట్టిగానే.

అతని కళ్ళల్లో జీవం నింపుకున్న వెలుగు చుట్టూ ప్రసరించినట్టయింది ఆ కాంతితో !

చీకటిని చీల్చుకుని వేగంగా అతన్ని సమీపించింది గాయత్రి. ఆమె మనసు సంతోషంతో గంతులు వేస్తోంది.

తన నిరీక్షణ ఫలించిందన్న అద్భుతమైన ఆనందపు అలజడి ఆమె గుండె లోతుల్నుంచి ఊపిరితోపాటు బయటికి రావటానికి ప్రయత్నిస్తూంది.

ఇద్దరి మధ్యా ఒక అడుగు దూరం.

ఇద్దరి కళ్ళల్లో ఆశ్చర్యం ! ఇది కలా నిజమా అని !

నిజమయితే బావుండుననే తపన

ఇద్దరి మనసుల్లోనూ పొంగుతున్న ఆనందం

'సురేన్' అని పిలిచింది గాయత్రి.

మూగగా నిలబడిపోయాడు సురేంద్ర

మెల్లగా చేతులుసాచి ఆమెను ఆహ్వానించాడు

ఒక్కసారిగా అతని ఎదపై వాలిపోయింది గాయత్రి.

ఇద్దరూ ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగిపోయారు.

యుగాల నిరీక్షణ ఇద్దరి మధ్యా బందీ అయింది. జన్మజన్మల నిరాశా ఆ క్షణంలో పటాపంచలయింది

అమృతప్రాయమైన ఆ స్పర్శలో పులకించిపోయారిద్దరూ !

ఈ లోకాన్నే మరిచి తన్మయత్వంలో మునిగిపోయారు

ఆనందంలో మాటలు రావటంలేదెవరికీ !

దూరంగా రైల్వేస్టేషన్‌కి కాస్త ఇవతలగా నిలబడి దూరంలో మసగ్గా చిన్న ఆకారాలుగా కన్పిస్తున్న వాళ్ళని చూస్తున్నారు తృప్తిగా విశ్వనాథం, మంజుల.

వాళ్ళకి కాస్త పక్కన శ్రీకాంతన్ నిలబడి వున్నాడు, అటే చూస్తూ

చీకటిని పారద్రోలే ప్రయత్నంలో మిగిలిన కాస్త ఆకాశపు వెలుతురులో శూన్యంలో ఒకరిలో ఒకరు లీనమైనట్టు కనిపిస్తున్నారు గాయత్రి– సురేంద్ర

శ్రీకాంతన్ కళ్ళు నీళ్ళతో నిండాయి కళ్ళజోడు తీసి కర్ఛీఫ్‌తో వత్తుకుని "సృష్టిలో కాదల్ యిరుక్కుదు గాయత్రీ" అనుకున్నాడు మనసులో ! అంతలోనే అతనికెందుకో నవ్వొచ్చింది.

విశ్వనాథంగారు మంజుల గాయత్రి, సురేంద్రల సంగమానికి తృప్తిగా నిట్టూర్చారు

శ్రీకాంతన్ నెమ్మదిగా వాళ్ళందరికీ దూరంగా నడుచుకుంటూ వెళ్ళిపోతున్నాడు ..

[అయిపోయింది]









## శేఖర్. – ఉరవకొండ

దేశంలో నిరుద్యోగ సమస్యను అరికట్టేందుకు మీరు సూచించే మార్గం ఏమిటి ?

★ ఉంది 'పరిశోధన'లో సీట్లు పెంచేయడమే అలా వందలాదీ వేలాదీ డాక్టరేట్లు చేసుకుంటూ కొంతకాలం గడిపేస్తారు— నందో రాజా భవిష్యతి అనుకొని — లేదా యింకొకటి వుంది డిగ్రీ నుంచి ఉద్యోగాలు డిలింకుచేసి పనికితగినచదువులపై దృష్టి కేంద్రీకరించేడమే (కొందరనుకునేటట్టు ఆడాళ్లని చదువులు మానిపించి తిరిగి వంటింట్లోకి నెట్టడంకాదు మార్గం)

## జి. వి. ఆర్. – సికింద్రాబాదు

'నేను లేకపోతే ఎలా ?' అని ఎప్పుడేనా అనుకున్నారా కె రా గారూ

★ "ఇంకా లేదు" ఒక్క వ్యక్తిని "ఒదులుకోలేని స్థితి"లో వుంటే మనిషిలో స్వేచ్ఛ లేదని అనుకోవాలి.

## కె. కె. ఆర్. – వాయల్పాడు

రచయిత్రులు అన్ని రంగాలలో నూ విజృంభించారు, ఒక్క సినిమా పాటల రచనలలో తప్ప ఆ రంగప్రవేశం ఆడువారు కావించలేదా? మీరైనా ప్రయత్నించండి.

★ కావించారు— ఒకరిద్దరు.. ఇక నేనా? నేను పాట రాస్తే సెన్సారు వారికిబ్బంది! మాటలే సరిగ్గా రాని నేను పాటలు రాస్తే అంతా బూతే అనుకునే ప్రమాదం వుంది. సినిమా వాళ్లకి మాటలు గంభీరంగానూ, బాటలు తేలికగానూ వుండాలి !

## బి. ఆర్. ఆర్. – శివడవలస

ఆపద జరిగినప్పుడు, మనసుకి బాధ కల్గినప్పుడు అమ్మా అని అంటాము — ఏమిటి కారణం అక్కయ్యగారూ ?

★ ఏముందయ్యా — అమ్మ శబ్దంలోనే వుంది — ఊరట కల్గించే శక్తి.

## రాజేష్ - పలాపపురం

నేను ఒకమ్మాయి పరస్పరం ప్రేమించుకున్నాం. మా కులాలు వేరు. మా పెళ్లి మా తల్లి తండ్రులకు యిష్టమే గాని కులాల దృష్ట్యా ఒప్పుకోవడం లేదు.

★ అదే వచ్చిన చిక్కు. "ఈ చీర రంగుకి ఆ చీర అంచు వుంటే బాగుంటుంది" అని కొట్లో చూస్తారట ఆడవాళ్లు ! అలాగే వుంది మీ సమస్యాను అర్జనాపరులు మీరై మెనారిటీ తీరినది ఆమెగారైతే కుల ప్రసక్తి లేని రిజిస్టరు పెళ్లి చేసుకోండి. ఎవరి కులం వారుంచుకోనూ వచ్చు భార్యా భర్తలు కానూ వచ్చు !

## ఎ. ఎమ్. బి. – కోడుమూరు

ప్రేయసికి, శ్రీమతికి మధ్య కల తేడా ఏమిటి ఒక్క ముక్కలో చెప్పండి ?

★ ఏముందీ ! దేవతకీ — దెయ్యానికీ వున్నంత తేడా !

## లక్ష్మీమోహన్ - అక్కుపల్లి

తల్లి ఒడి గొప్పదా ? చెలి ఒడి గొప్పదా ?

★ రెండూ గొప్పవే —

నా అభిమాన ప్రముఖ రచయిత్రి రంగనాయికమ్మగారిపై మీ అభిప్రాయం తెలియ చేస్తారా ?

★ మీ అభిమాన ప్రముఖ రచయిత్రి రంగనాయికమ్మపై నా అభిప్రాయం — ఇంకా సదభిప్రాయమే !

## ఆర్. వై. – హైదరాబాదు

జీవితాన్ని సుఖమయం చేసుకోడానికి భర్త అవసరాలకు ప్రాధాన్యం యివ్వమంటారా ? ఆర్థికంగా యిబ్బంది పడుతూ పిల్లల భవిష్యత్తు కొరకు జీవితం త్యాగం చేయమంటారా ?

★ సుఖాలూ యిద్దరివీ, పిల్లలూ ఇద్దరివారూ అయినప్పుడే అవసరాలు — త్యాగాలు నాకర్థం అయి చావదు సోదరీ, క్షమించు

## మోహన్ - పలాసా

నాకు తన సర్వస్వాన్ని అర్పించింది తన జీవితం నాకు అంకితం చేసింది. కానీ యీ మధ్య నేనంటే ఇష్టం లేదని యింకొకడితో ప్రేమాయణం ప్రారంభించింది. నాకిప్పుడు ఆమె పై ప్రేమ ద్వేషమై పోయింది.

★ బాబూ మోహన్ 'పారిన్' అని రాయబోయి పలాసా అని రాశావా ?! ఇంత ప్రేమాయాణాలా ! నిజంగా ? ప్రేమాద్వేషం నాణేనికి కిరుపక్కలే కద .. మరిచిపో

## జి. ఎమ్. – గుంటూరు

స్త్రీ ఆస్తి హక్కుపై మీ అభిప్రాయం ?

★ ఉన్నవాళ్లు కదా పంచేది, ఇవ్వనివ్వండి

ఆస్థాన పదవుల రద్దుపై మీ అభిప్రాయం నిక్కచ్చిగా చెప్పండి

★ పాపం—వాళ్లుండి మాత్రం ఏం చేశారండీ ? ఆయా పదవులు 'తోసిపారేయడానికి' వీలులేని విధంగా ఏమైనా సాధించారా ? అసలే ఆశ్రిత పక్షపాతంతో లుక లుక లాడుతున్న కళా సంస్థలు యింకా దారుణంగా తయారవలేదా ? చెప్పండి.

## వై. వి. టి. – హైదరాబాదు

ప్రభుత్వోద్యోగం మంచిదా ? ప్రైయివేటు ఉద్యోగం మంచిదా ?

★ తెరిపిగా వుండాలంటే ప్రభుత్వ ఉద్యోగం, కష్టపడి పనిచేసి పైకి రావాలంటే— ప్రయివేటు ఉద్యోగం ★






# భారతదేశమంతటా డీలర్ల విశ్వాసాన్ని పొందిన చిహ్నం



























































ఆంధ్రప్రదేశ్‌లోనే 650 మందికి పైగా డీలర్లు విశేష లాభాలకు దానిని చిహ్నంగా కనుగొన్నారు
ఎందుకంటే, అతి ఎక్కువగా అమ్మకమయేవి

- వంట పాత్రలు • స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు • ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్ అప్లయన్సెస్
- బహుమతులివ్వడానికి పనికివచ్చే కొత్త కొత్త రకాలు దానికింద పంపిణీ అవుతున్నాయి

అంటే భారీగా మరియు తేలికగా అమ్మకాలు-కాబట్టి లాభాలు ఎక్కువ

మంచి వ్యాపారం కోసం మీరు నిరీక్షిస్తున్నట్లయితే, డీలర్‌షిప్ కొరకు రాయండి ఆంధ్రప్రదేశ్ అంతటినుండి డీలర్‌షిప్ కొరకు దరఖాస్తులు కోరబడుచున్నవి



ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు

PH : 221198/34819

## మహావీర్ ఎంటర్ ప్రైజెస్., తిలక్ రోడ్, హైదరాబాద్-1

"రిటైర్ అయిపోయానని, నాకేమీ పనీ-పాటలు లేవని మీరనుకుంటున్నందుకు.. ఐయామ్ సారీ!'' అంటూ ఆ రోజే రిటైరైన జస్టిస్ రామశర్మగారు తనచుట్టూ లాన్స్‌లో కూర్చుని, టీ తాగుతూవున్న కూతుర్లూ, కొడుకులూ, భార్యను పరిశీలనగా చూశారు.

"ఇప్పుడు నాకు అఫీషియల్‌గా పనులు లేకపోవచ్చు! కానీ, మోరల్‌గా భాధ్యతలు పెరిగాయి! ఒక మనిషి శారీరకంగా ఆరోగ్యంగా వున్నప్పుడు, మానసికంగాకూడా ఆనందంగావుంటే, నాలుగు కాలాలపాటు మనగలడు! నాలుగు మంచి పనులు చెయ్యగలడు! నేనుకూడా నాలుగు కాలాలపాటు ఆరోగ్యంగా, ఆనందంగా వుండాలనీ, నాలుగు మంచి పనులు చెయ్యాలనీ అనుకుంటున్నాను. దానికి నాందిగా, రిటైరయ్యాను గనుక, యిప్పుడు నేను చెయ్యబోయే మొట్టమొదటి పనేమిటంటే.. ఒక మంచి ముహూర్తంచూసి... మీ అందరి సమక్షంలో, సలక్షణంగా, మరో పెళ్ళి చేసుకోడం !!'' శర్మగారు గంభీరంగా అన్నారు.

"యేమండీ !...???'' పిడుగు పడ్డట్లు కేకపెట్టింది శర్మగారి అర్ధాంగి! కప్పులోని టీ తొణికి మీదపడ్డది.

"నాన్నారూ! .. యేమిటి మీరనేది ?'' పెద్దబ్బాయి అయోమయంగా అరిచాడు.

"నే.. ను... మ.. రొ. .క పె...ళ్ళి చేసుకోబోతూన్నాను!'' బాగా వత్తిపలికారు శర్మగారు

ఆ మాటలకు అంతా స్థంభించి, శిలాప్రతిమల్లా చూస్తూ కూర్చున్నారు. కానీ, గుండెలు కుతకుత లాడుతున్నాయి 'రిటైరయ్యాక పెళ్ళేమిటి? ఈ ముసలాయనికి పిచ్చి పట్టిందేమో ?' లోలోపల మదనపడ్డారు. కానీ, యెదురుచెప్పే ధైర్యం యెవ్వరికీ లేదు.

*　　*　　*

శ్రీరామచంద్రుడంటే భారతీయులకు యెంత భక్తి, విశ్వాసాలున్నాయో, జస్టిస్ రామశర్మగారన్నా అంతటి గౌరవాభిమానాలున్నాయి ఆంధ్రులకి! యెందుకంటే, వృత్తి ధర్మాన్ని నిర్వర్తించడంలో ఆయనకు ఆయనే సాటి!

ఆయన చెప్పిన తీర్పులు సుప్రీంకోర్టులో కూడా ఒక్క అక్షరమైనా మార్పులేకుండా అంగీకరించబడేవి!



కనుక, ఉద్యోగ పర్వం ఆయన జీవితంలోనే కాదు, సమస్త న్యాయస్థానాల చరిత్రలోనే చిరస్మరణీయం! నిజానికి అంతటి పుత్రుడ్ని కన్నందుకు శర్మగారి తల్లిదండ్రులెంత అదృష్టవంతులో!

శర్మగారికి యిద్దరు కుమార్తెలు, ముగ్గురు కుమారులు హౌస్‌సర్జన్‌గావున్న ఆఖరి కొడుకు మినహా, మిగతా వాళ్ళందరికీ పెళ్ళిళ్ళు చేశారు! పెద్దకొడుకు డిప్యూటీ కలెక్టరు. రెండోవాడు షిప్పింగ్ కార్పొరేషన్‌లో పెద్ద ఆఫీసరు అల్లుళ్ళుకూడా పెద్ద పదవులలోనే వున్నారు!

రిటైరవ్వగానే తండ్రిని, తల్లినికూడా తమతో తీసుకెళ్ళి, ఖాళీగా వుండ నివ్వకుండా యేదో ఒక వ్యాపకం కల్పించాలనే ఆడపిల్లలూ, మగపిల్లలూ వచ్చారు.

నిజానికి, రేయింబవళ్ళూ కేసులతో సతమతమై, అనేక గ్రంధాలు పరిశీలించి, న్యాయశోధనచేసి, నిష్పాక్షికమైన తీర్పు లివ్వడానికి అలవాటుపడ్డ శర్మగారు రిటైరవ్వడమంటే, అప్పటిదాకా దేదీప్యమానంగా వెలిగిన లైటు, స్విచ్ ఆఫ్ చేయగా అమాంతం ఆరిపోయినట్లు! అబ్బ! యెంతటి దారుణం యీ పదవీ విరమణ! కానీ తప్పదు! ఉన్నవాళ్ళంతా అలాగే వుండిపోతే, కొత్తవాళ్ళకి దారేది? చోటేది ??

ఆ రోజు తమకు ఆఖరిరోజు కావడంతో జస్టిస్ రామశర్మగారు, తమకు ఆశ్రయాన్ని, పేరుప్రతిష్ఠలను తెచ్చిపెట్టిన ధర్మపీఠాన్ని, పుస్తకాలనీ, పరిసరాలనీ ఆఖరిసారిగా, ఆప్యాయంగా చేతులతో తడిమి చూచుకున్నారు తనకు తోడ్పడిన వుద్యోగులందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకున్నారు అందరి కళ్ళూ చెమర్చాయి

అది తనకు ఆఖరిరోజు! జీవితంలో మరొక మరుపురాని రోజు! ఆ రోజుని కూడా ధర్మబద్ధంగా గడిపితే, జీవితానికి ఒక అర్థం,

# లాస్ట్ జడ్జిమెంట్

ప్రణవి బ్రదర్స్



అంతులేని తృప్తి మిగులుతుంది ! అది ఆయన ధ్యేయం !

* * *

శర్మగారు, శిలాప్రతిమలైన సంతానాన్ని, గుండె పగిలి దుఃఖంతో తలవంచుకున్న భార్యని చూచి, ఒక దీర్ఘమైన శ్వాస తీసుకున్నారు.

''నేను యే నిర్ణయం తీసుకున్నా ఒకటికి రెండుసార్లు బాగా ఆలోచించే ఆ పనిచేస్తాను. అంటే, నా నిర్ణయంతో యెవరు యేకీభవించినా సరే, వ్యతిరేకించినాసరే, అది మారదు! వన్స్ డిసైడెడ్ ఈజ్ డిసైడెడ్ అండ్ సెడ్ ఈజ్ సెడ్! అర్థమైందనుకుంటాను!'' మరొక్కసారి అందరి ముఖాలూ పరిశీలించారు. కానీ, ఎవ్వరూ నోరు మెదపలేదు

''పెళ్ళికూతురు గురించి వివరాలు మీరడగ లేదు ! ఫర్వాలేదు ! నేనే చెబుతాను ! అది నా ధర్మం !'' కుర్చీనుండి లేచి, చేతులు వెనక్కు కట్టుకొని, మెల్లిగా ఇటూ అటూ నడుస్తున్నారు.

''అమ్మాయికి తల్లీదండ్రీ వున్నారు. పద్దెనిమిదీ, యిరవైయేళ్ళ వయసుంటుంది. బి ఏ. చదివింది. అందంలో అప్సరసలా వుంటుంది. అయితే కట్నాలు యిచ్చుకోలేనంత బీదస్థితి వారిది'' శర్మగారు చెబుతున్నారు.

'మరి అందుకే యీ ముసలోడికి యిస్తున్నారు కాబోలు!' పిల్లల మనస్సులో మెదిలిన భావన.

''ఇంకేం ? నేనే నుయ్యో గొయ్యో చూచుకుంటాను ! మీరా కుర్రముండను కట్టుకొని, వూరేగండి !'' భార్య యేడ్చింది.

''నేను ముందే చెప్పాను మీ అభిప్రాయాలతో నాకు పనిలేదని !'' ఆమెవంక తీవ్రంగా చూచి. మళ్ళీ ప్రారంభించారు. ''ఆ అమ్మాయి ప్రభుత్వ స్కాలర్‌షిప్‌తో బి. ఏ చదివింది. వాళ్ళు లంబాడీకులస్థులు !'' వక్క క్షణం ఆగి, మరోసారి అందరిముఖాలను పరిశీలించారు. యెవ్వరిముఖాల్లోనూ కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు.

''సంబడమే! లంబాడీదాన్ని కాకపోతే, దొమ్మరిదాన్ని కట్టుకోండి!... మాకింత విష మిచ్చి !'' నెత్తీనోరు బాదుకుంది భార్య.

''మీ ధోరణి మాకేం నచ్చలేదునాన్నారూ!'' పెద్దబ్బాయి ధైర్యంచేసి అన్నాడు.

''థాంక్యూ! థాంక్యూ ఫర్ యువర్ కామెంట్ ! నా ధోరణి మీకు యేనాడు నచ్చింది గనుక, యిప్పుడు నచ్చలేదనుకోడానికి ?'' తండ్రి




కంఠం కాస్త బిగ్గరగా వినిపించింది

"నువ్వు చదువుకొనేరోజుల్లో నీకు కాలేజీ సీటు దొరకక, రిజర్వేషన్‌చేయబడిన నిమ్న జాతులు, వెనుకబడ్డకులాలు, జాతులవారి కోటా సీట్లనుగురించి నీవు యేడ్చినప్పుడూ, ఐ ఏ ఏస్ లో సెలెక్టుకానందుకు రెండోవాడు,తక్కువ పర్సెంటుమార్కులతో సెలెక్టయిన రిజర్వుడ కోటా కాండిడేట్స్‌మీద విరుచుకుపడ్డప్పుడూ నేను మందలించాను! అగ్రకులాల వారికిచ్చిన కోటాకన్నా, క్రింద తరగతులవారికిచ్చిన కోటా యెంతతక్కువో చూడమన్నాను! అంత పెద్ద కోటానించి ఒక్కసీటు సంపాయించుకోడం చేత కాక, చవటల్లా అవతలివారిమీదపడి యేడవడం తప్పన్నాను! కానీ, అది మీకు నచ్చలేదు!

మేడెక్కి నిచ్చెనలాగెయ్యడం, యేరుదాటి తెప్ప తగలెయ్యడం మన అగ్రకులాలవారికి వెన్నతో పెట్టిన విద్యరా! ఆ దుర్నీతి గ్రహించే, మన నాయకులు క్రిందవారికోసం రిజర్వేషన్లు పెట్టారు! వారుకూడా సాటి మానవులే! వారు బాగుపడాలనే భావనలేకుండా, అయ్యో వాళ్ళు బాగుపడుతున్నారే అని యేడుపురా మీకు! ఆ

## లాస్ట్ జడ్జిమెంట్!

నిర్భాగ్యుల్ని మనతో సమంగా ఆదరించి, మనలో కలుపుకునేంత ధైర్యం, మీకేవుంటే, మీకుగట్టని యీ రిజర్వేషన్లతో పనేవుండదుగా? ఈ అసూయలూ, అహంకారాలూ తలెత్తవుగా! సర్వ మానవ సమత్వం రావాలిరా! అందుకే యెట్లీస్టు నేను ఆ లంబాడీ అమ్మాయిని పెళ్ళి చేసుకోబోతున్నాను! తెలిసిందా?" శర్మగారు చాలా ఆవేశపూరితంగా అన్నారు.

"బావుంది మీ ఆదర్శం!" పెద్దవాడు లేచాడు వాతావరణం కాస్త ఆవేశపూరితంగా వుంది

"ఇదే ఆదర్శాన్ని మీరు మీ వివాహానికి ముందు వల్లిస్తే చాలా చాలా బావుండేది!"

అంతలో రెండోవాడందుకున్నాడు "ఇప్పుడు దీన్ని ఆదర్శమనరు! 'కామం' అంటారు! అందంగావున్న ఒక ఆడపిల్లకి 'ఆశయం'పేరిట వురిటగించడవంటారు!" ఆవేశంగా అన్నాడు

"అయామ్ సారీ మైసన్! అయామ్ సారీ! అరచే కుక్కలు కరవవని నాకు బాగా తెలుసు! ఐ డోంట్‌కేర్! నేను చెయ్యబోయే పనికి యెవరు యే పేరు పెట్టినా ఐ డోంట్‌కేర్! యెంత అనుభవం, యెంత పరపతి సంపాయించాక యీ పని చేయబోతున్నానో మీకు తెలుసు! దానికి గట్స్ కావాలి! ఐ హావ్ గట్స్! మీలో యెవరికైనా ఆ అమ్మాయి ఫోటో చూడాలనే యింట్రెస్టు వుంటే" అంటూ శర్మగారు జేబులోంచి ఒకఫోటో తీశారు

వెంటనే చిన్న కూతురు వచ్చి ఫోటో తీసుకుంది. తరువాత తల్లి తప్ప పిల్లలంతా చూశారు

కోల ముఖం. గుండ్రని కళ్ళు పొడవైన ముక్కు. చిన్న నోరు చాల చక్కగా, సినిమా స్టార్‌ని తలదన్నినట్లుంది లంబాడీ అలంకరణలు లేవు.

ముసలివారైన శర్మగారికే కాదు, ఆ అమ్మాయిని చూచిన యే మగాడికైనా, అలాంటి కోరికే కలుగుతుంది.

* * *

శర్మగారి మీదనున్న గౌరవం కొద్దీ, న్యాయవాదులంతా ఆ రోజుకి తమ తమ కేసులకి వాదనలు చేయకుండా, వాయిదాలు వేయించుకొని, జడ్జిగారిని ప్రశాంతంగా రెటైర్ చేయించాలని తీర్మానించుకున్నారు

అలాగే కేసులకు యెడ్జార్న్‌మెంటులు తీసుకుంటున్నారు అన్నీ అనుకున్నట్లే సాగిపోతున్నాయి. ఆఖరి సమయం అకస్మాత్తుగా ఒక ఆత్మహత్య కేసు ప్రవేశపెట్టబడింది దానితో కోర్టు వాతావరణం మారింది

జీవితంలో ఓడిపోయిన ఒక స్త్రీ తన ప్రాణాలను తానే తీసుకోవడంలో కూడా ఓడిపోయి, పోలీసులకు దొరికిపోయింది

ఒక మనిషికి తన ప్రాణం తన స్వంతం కాదని, అది తన తల్లిదండ్రుల స్వార్జితమని, దానిని తుదముట్టించే హక్కు తనకు లేదని, జస్టిస్ రామశర్మగారు భారతీయ శిక్షాస్మృతి ననుసరించి ఆ అమ్మాయికి తగిన శిక్ష విధించారు

కానీ, అంతరాంతరాల్లో శర్మగారికి యేదో చెప్పరాని బాధ! తెలతెల వారుతూండగా, నిశ్చలమైన నీటిలో రాయి వేసినట్లనిపించింది ఒక న్యాయాధికారిగా, ఆ అమ్మాయికి తాను చేసింది న్యాయమా?.

కోర్టు ముగిసి, వీడ్కోలు విందు అయ్యాక, శర్మగారు తిన్నగా పోలీసుస్టేషన్ కొచ్చి, జడ్జిగా రిటైరయ్యాను కనుక, మామూలు వ్యక్తిగా, ఆ అమ్మాయికి శ్రేయోభిలాషిగా ఒక్కసారి ఆ అమ్మాయిని చూస్తానన్నారు

సగౌరవంగా, పోలీసు వారంగీకరించి, ఆయనను లోపలికి తీసుకెళ్ళారు

* * *

"మీరు నిజంగా ఆదర్శవంతులవ్వాలనుకుంటే," పెద్దవాడు ధైర్యం చేశాడు. "ఆ అమ్మాయిని మీరు భార్యగానే చేసుకోనక్కర్లేదు!"

శర్మగారు బిగ్గరగా నవ్వేశారు "అన్న

వైంది. అర్థమైంది. నేను చెయ్యబోయే పని, నువ్వే చేస్తానంటావు !''

''నాన్నారూ !...'' బిగ్గరగా అరిచాడు పెద్దకొడుకు.

''డోంట్ బి లౌడ్ మై సన్! బి క్వయట్!. . ఆ అందమైన అమ్మాయి వుద్యోగం కోసం ప్రయత్నిస్తుంటే అది పసిగట్టాడొక ప్రబుద్ధుడు! ఉద్యోగ మిప్పిస్తానని ఆశపెట్టి, తనచుట్టూ తిప్పుకున్నాడు. పెళ్ళికూడా చేసుకుంటానంటూ, శీలాన్ని కొల్లగొట్టాడు! ఆవిడ గర్భిణి అయిందని తెలీగానే, ఆ అగర్భ శ్రీమంతుడు అంతర్ధానం అయ్యాడు!

అగ్రకులపువాడి అధమ గుణానికి బలైన ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకోబోయి పోలీసులకు పట్టుబడింది. ఈ రోజు నా జీవితంలో అదే ఆఖరి కేసు కోర్టులో ఒక జడ్జిగా ఆమెను శిక్షించాను. కానీ, నా మనసుకు తృప్తి కలగ లేదు 'అసలు ఆ అమ్మాయి చేసిన నేరమేమిటి? దానికెవరు బాధ్యులు?' అని ఒక మానవతావాదిగా యోచించి, ఆ గర్భిణీ స్త్రీని నేనే స్వయంగా ఆదుకోవాలనుకున్నాను

కోర్టు ముగిసిన వెంటనే పోలీసు స్టేషన్ కెళ్ళి ఆ అమ్మాయితో మాట్లాడి, ధైర్యం చెప్పి, 'నేనున్నాను నీకేం పర్వాలేదు' అని హామీ యిచ్చి వచ్చాను'' రామశర్మగారు అంటూ, కర్చీఫ్ తీసి, ముఖానికి పట్టిన చెమటను అద్దుకున్నారు.

## రాత్రి

నాన్న అలా నైట్‌డ్యూటీకి వెళ్ళగానే
అల్లరి పిల్లలంతా అమ్మచుట్టూ
చేరినట్లు
తార పాపాయిలందరూ
తళుకు కన్నులతో
చల్లటి కథలు వింటూ
రాత్రంతా మేలుకుంటారు
ఎర్రబడ్డ కళ్ళతో నాన్న
నైట్ డ్యూటీనుంచి రాగానే
ఎక్కడివాళ్ళక్కడ సర్దుకుంటారు
అమ్మేమో వంటింట్లోకి వెళ్ళిపోతుంది.

— కె. గోదావరిశర్మ

అప్పటివరకూ ఆ అమ్మాయి ఫోటోనే చూస్తున్న చిన్నకొడుకు, ''నాన్నారూ!. '' గొంతు పెగిల్చాడు.

యేమిటన్నట్లు చూచారు శర్మగారు

''నాదొక చిన్న సలహా!. . ఇంత పేరు ప్రఖ్యాతులు పొందిన మీరు, ఈ వయస్సులో ఆ పని చేసి, అపకీర్తి పొలవ్వడం నా కిష్టం లేదు నేనింకా పెళ్ళి కానివాడినే! నేనే ఆ అమ్మాయిని పెళ్ళాడతా!'' వినమ్రంగా అన్నాడు.

పెద్దన్నయ్యకు వచ్చిన అభిప్రాయం కూడా అదే! ''అవును నాన్నారూ! చినబాబుకి చేసెయ్యండి!''

''కానీ, ఆవిడ గర్భవతి ?'' శర్మగారన్నారు

''పర్వాలేదు !'' మెల్లగా అన్నాడు చిన్నోడు

''వెరీగుడ్ ! ఆ ధైర్యమే కావాలి యువతరానికి! కానీ చినబాబూ! ఇది ఆదర్శమా? అపరాధమా ? నీ దృష్టిలో ?'' శర్మగారు అడిగారు

''అ అ అపరాధమే నాన్నారూ! నేనే ఆ అమ్మాయిని మోసం... చేశా!'' తల దించుకొని, నేలచూపులు చూస్తూ అన్నాడు చినబాబు. అతని కంఠం వణికింది

''దట్సాల్ మై డియర్ వైఫ్ అండ్ చిల్డ్రన్! దిసీజ్ మై లాస్ట్ జడ్జిమెంట్!'' రిటైర్డ్ జస్టిస్ రామశర్మగారు అందరివంకా గర్వంగా చూచారు

''నా సర్వీసులో ఆఖరి కేసులోకూడా నేను న్యాయమే చేశాను. ఐ మస్ట్ థాంక్ గాడ్! నా మనస్సుకి యిప్పుడెంతో సంతోషంగా వుంది! యెంతో తృప్తిగావుంది! యేమోయ్! లేలే! ఇక నీ కన్నీళ్ళని ఆనంద భాష్పాలుగా మార్చు! వెంటనే పెళ్ళికి యేర్పాట్లుచేస్తే, మనకి అయిదారు నెలల్లోనే మనవడినో, మనవరాలినో యిచ్చేస్తాడు మన సుపుత్రుడు!'' శర్మగారన్నారు

ఆ మాటలకు మిగతావారంతా గొల్లున నవ్వారు. 

సీరియల్

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



**జరిగిన కథ — 36 :** డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్ హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరిస్ మినా గదిలో జోనాధన్ క్రిందపడి ఉండటం చూస్తారు. మినా చేత తన రక్తాన్ని త్రాగిస్తున్న డ్రాకులాను చూసి వీరందరు భయభ్రాంతులవుతారు. వాన్‌హెల్సింగ్ మినాను అసలు ఏం జరిగిందో అడుగుతాడు. ఆమె తనకు జరిగిన భయంకరమైన అనుభవాన్ని చెపుతుంది. రెన్‌ఫీల్డ్ నేలమీద కుప్పలాపడి ఉంటాడు. అతడు మంచంమీద నుంచి క్రిందపడి చనిపోయినట్లు సర్టిఫికేట్ ఇవ్వటానికి నిశ్చయించుకుంటాడు డాక్టరు సెవార్డు. అందరు కలసి పికడిల్లీలోని డ్రాకులా ఇంటిని వెదకాలని నిర్ణయించుకుంటారు. అందరూ కలసి డ్రాకులా ఇంటిలో ప్రవేశిస్తారు. వాన్‌హెల్సింగ్ జోనాధన్‌కు డ్రాకులా శక్తి, అతను చేసే ప్రమాదాల గురించి చెప్పసాగాడు. డ్రాకులా వీరి కోసం వెతుకుతున్నట్లు మినా టెలిగ్రాం పంపిస్తుంది. డ్రాకులా ఇంటిలోకి డ్రాకులా ప్రవేశించి వీరందరి బారినుండి నేర్పుగా తప్పించుకుంటాడు. మేడమ్ మినా తనను హిప్నటైజ్ చేయమని ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్‌ను కోరుతుంది. డ్రాకులా మిగిలిన పెట్టె, బంగారం, డబ్బుతో ఓడలో పారిపోతున్నట్లు ఆమె ద్వారా కనుక్కుంటాడు వాన్‌హెల్సింగ్. డ్రాకులా ఊళ్ళోంచి పారిపోయాడని తెలిసి ఎంతో ఊరట చెందుతుంది మినా. డ్రాకులా 'వర్నా' చేరేదానికి ముందే జోనాధన్, మినాతో సహా అందరు 'వర్నా'కు ప్రయాణమయిపోవడానికి నిశ్చయించుకుంటారు. జరీనా కెధరిన్ ఓడ సముద్రంలో ప్రయాణం చేస్తున్నట్లు మినాను హిప్నటైజ్ చేసి తెలుసుకుంటారు. ఓడ తీరం చేరగానే అందరు దానిలో ప్రవేశించి చెక్కపెట్టెలోని డ్రాకులాకు మెలకువ వచ్చేలోగా అతన్ని హతమార్చాలని నిశ్చయించుకుంటారు. జరీనా కేధరిన్ ఓడ 'గలాట్జ్' తీరం చేరుకున్నట్లు తెలుసుకొని అందరు నిశ్చేష్టులయ్యారు. చెక్కపెట్టెను 'ఇమాన్యుయల్ షిల్డిషిమ్' అనే అతను వచ్చి తీసుకెళ్ళినట్లు కెప్టెన్ డోనెల్సన్ చెపుతాడు. షిల్డిషిమ్ ఆ పెట్టెను 'స్కిన్‌స్కి'కి అప్పగించాడు. సెంట్ పీటర్ చర్చి ఆవరణలో 'స్కిన్‌స్కి' మృతదేహం కనపడుతుంది. అతను డ్రాకులాచే చంపబడి ఉంటాడని మినా తన డైరీలో వ్రాసికొనింది.

**( గత సంచిక తరువాయి )**

**మినా డైరీ :**

నేను రాసిన నా ఆలోచనలు చదివి వినిపించిన తర్వాత జోనాధన్ నన్ను కౌగిలిలోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు. మిగతా వాళ్ళు నన్నెంతగానో అభినందించారు డాక్టర్ వాన్‌హెల్సింగ్ చెప్పారు —

"మేడమ్ మినా మనకు టీచర్ లాంటివారు. మనం ఏ విషయం గురించి ఆలోచించటం మానేసామో, ఆమె ఆ విషయం బాగా ఆలోచించింది. ఈసారి మనకు విజయం తప్పదు. మన శత్రువు పని ఇక అయిపోయినట్లే. అయినా ఒక్కరోజు ముందుగా ఇక్కడకు వచ్చివుంటే, ఈ పాటికి అతన్ని వదిలించి వుండేవాళ్ళం. అయినా మళ్ళీ మనం ఒక ప్లాన్ వేద్దాం."

"నేనొక స్టీమ్‌లాంచి తీసుకొస్తాను. మనం డ్రాకులాను వెంబడించవచ్చు" అన్నాడు ఆర్థర్

"నేను గుర్రాలు తెస్తాను. ఒకవేళ అతను ఒడ్డు చేరుకుంటే, వెంటబడి వెళ్లటానికి గుర్రాలు పనికొస్తాయి" అన్నాడు మోరిస్.

"బాగుంది. ఇద్దరి ఆలోచనలు బాగున్నాయి. మనమంతా కలిసే వెళ్లాలి. ప్రత్యక్ష పోరాటానికి తలపడాల్సి వస్తుంది అవసరమయితే" అన్నారు డాక్టర్ వాన్‌హెల్సింగ్. వాళ్ల దగ్గర కొన్ని ఆయుధాలు వున్నాయి.

డాక్టర్ సెవార్డు అన్నాడు "నేను క్విన్సీమోరిస్‌తో పాటు వెళతాను. ఇద్దరం కలసి డ్రాకులాను వెంటాడ్డం అలవాటయింది. మా దగ్గర ఆయుధాలున్నాయి. ఆర్థర్ నువు ఒంటరిగా వుండవద్దు. నువ్వు స్లోవాక్స్‌తో కలియబడాల్సి వస్తుంది అసలే వాళ్ళు కర్కోటకులు అందు వలన మనం జాగ్రత్తగా వుండాలి అయినా వాళ్లదగ్గర తుపాకులూ అవీ లేకపోవచ్చు. మనం అవకాశాలు తీసుకుంటూ కూర్చోకూడదు డ్రాకులా తల నరికే దాకా మనం విశ్రమించగూడదు. మళ్ళీ అతను ఆ రూపం ధరించకూడదు" అట్లా అంటూ జోనాధన్ వంక చూసాడు. జోనాధన్ నా వంక చూసాడు అతనికి ఇంకా దిగులుగానే వుంది కొన్ని క్షణాలు మౌనంగా గడచిన తర్వాత —

"మిత్రమా జోనాధన్, ఈ పనికి నువ్వే తగిన వాడివి నువ్వు యువకుడివి ఎంతో శౌర్యశాలివి. కాబట్టి అతనితో పోరాడగలవు అతన్ని చంపే హక్కు నీకే వుంది మేడమ్ మినా గురించి మీకు బెంగ అక్కర్లేదు. ఆమెకు తోడుగా నేను వుంటాను. నేను ముసలాడ్ని పరుగెత్తలేను ఎక్కువ దూరం గుర్రంమీద వెళ్లలేను పోరాడలేను అయినా ఇంకొక విధంగా నేను సహాయం చెస్తాను ఇంకో విధంగా పోరుసల్పుతాను అవసరమయితే ప్రాణాలిస్తాను, మీలానే నేను ఏం చెయ్యదల్చుకున్నానో చెప్తాను. ఆర్థర్, జోనాధన్ కలిసి స్టీమ్‌లాంచీ తీసుకుని నదిలో ప్రయాణిస్తారు జాన్ (సెవార్డు), క్విన్సీమోరిస్‌లు ఇద్దరూ, గుర్రాలమీద నది ఒడ్డునే ప్రయాణిస్తూ వెళతారు. నేను మేడమ్ మినాను మన శత్రువు అసలు స్థావరానికి తీసుకెళతాను ఆ డ్రాకులా రాక్షసుడు చెక్కపెట్టెలో వుంటూ వెళతాడు పెట్టె తెరిచి చూడలేదు చూస్తే స్లోవాక్స్‌కు తెలిసిపోతుంది పెట్టెలోని రహస్యం. పూర్వం జోనాధన్ వెళ్లిన దారినే వెళతాం — అంటే బిస్ట్రిట్జ్ నుంచి బోర్గోమీదుగా డ్రాకులా కోటను చేరుకుంటాం. అక్కడ మేడమ్ మినాకు హిప్నటైజ్ చేసి కోటలోకి మార్గం తెలుసుకుని వెళతాను తర్వాత అక్కడ ప్రదేశాలన్నీ పవిత్రం చేసి అతనికోసం వల పన్నుతాం" అన్నాడు.

జోనాధన్‌కి కోపం వచ్చింది "అంటే మీరు

అనారోగ్యంతో వున్న మినాను ఆ రాక్షసుడి దగ్గరకు తీసుకెళతానంటారా? వద్దు ఏమయినా సరే, ఆమెను తీసుకెళ్ళవద్దు అదెంత నరకమో నాకు తెలుసు'' అన్నాడు తర్వాత మాట్లాడలేక పొయ్యాడు

''మిత్రమా జోనాథన్, నిన్ను బాధపెట్టాలని కాదు అక్కడ మేడమ్ మినా అవసరం ఎంతోవుంది నా మాట వినండి అవసరమయితే నా ప్రాణాలను ఇవ్వటానికికూడా సిద్ధంగా వున్నాను మేడమ్ మినాకు ఎటువంటి ప్రమాదం రాదు'' డాక్టర్ వాన్‌హెల్సింగ్ అన్నాడు

''సరే మీ ఇష్టం'' అన్నాడు దిగులుగా ''అన్నిటికీ ఆ దేవుడే వున్నాడు''

తర్వాత అబ్బ! ఈ మగాళ్ళు ఎంత ధైర్యవంతులు! వాళ్ళ సాహసయాత్ర చూడ ముచ్చటేసింది డబ్బువల్ల చాలా పనులవుతాయి ఆర్థర్‌కు అందుకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి ఆయుధాలు వున్నాయి నా దగ్గర పెద్ద రివాల్వరు కూడా వుంది నా దగ్గర ఏదో ఒక మారణాయుధం వుంటేగానీ, జోనాథన్‌కి సంతోషంగా వుండదు దారిలో తోడేళ్ల బెడదా, చలిగాలులు వున్నాయట

తర్వాత నా భర్త జోనాథన్‌కి ఎంతో బాధతో వీడ్కోలు చెప్పాను బహుశా మళ్లీ మేం కలుస్తామో లేదో! ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ మాత్రం ఎంతో ధైర్యాన్నిస్తున్నట్టుగా చూసారు ఇప్పుడు నేను కన్నీళ్లు పెట్టకూడదు – వాటిని దేవుడు ఆనందబాష్పాలుగా రాలిస్తే తప్ప

## జోనాథన్ డైరీ:

అక్టోబర్, 30 (రాత్రి) స్టీమ్‌లాంచి పొయ్యి వెలుగులో కూర్చుని ఈ డైరీ రాస్తున్నాను ఆర్థర్ బాగా మంట పెడుతున్నాడు స్టీమ్‌లాంచీ నడపటంలో అతనికి బాగా అనుభవముంది థేమ్స్‌లో వున్నప్పుడు స్వంత స్టీమ్‌లాంచి నడిపేవాడు ఇకపోతే, మా పథకం గురించి చివరకు మినా చెప్పినట్టుగానే నిర్ణయించాం డ్రాకులా నదిలో పడవ ప్రయాణం చేసేటట్టయితే, ఏదో ఒక జంక్షన్‌లో అతని ఆచూకీ తెలుస్తుంది రాత్రిపూట నదిలో ఎక్కువ వేగంతో వెళ్ళటానికి మాకేమీ భయం అనిపించటంలేదు ఎందుకంటే, నది నిండుగా వుంది ఎంతో వెడల్పుగా వుంది ఆర్థర్ నన్ను కాసేపు పడుకోమన్నాడు ఒక్కళ్ళు మేల్కొని కాపలా కాస్తే చాలన్నాడు కానీ నాకు నిద్ర రావటం లేదు ఎట్లా వస్తుంది? – ఒక పక్క నా ప్రియమైన మినా ఎంతో ప్రమాద భరితమైన ప్రయాణం చేస్తుంటే– అందులోనూ డ్రాకులా కోటలోకి. దేవుడి మీద భారం వేసి వూరట చెందుతున్నాను ఆ మాత్రం నమ్మకం వుండటంవల్లగానీ, లేకపోతే, ఈ నరక బాధలతో బతికివుండటం కన్నా, చనిపోవటం సుఖం



అతను బాగా సంపన్నుడు. ఇక మోరిస్‌కూడా అంతే. డబ్బు వుండటమేకాకుండా, ఇద్దరూ నీళ్లలా ఖర్చుపెట్టే మనస్తత్వం గలవాళ్ళు. అందువల్లనే చిటికిలో వ్యవహారాలు చక్కబడుతున్నాయి. గంటలో స్టీమ్‌లాంచి సంపాదించి ప్రయాణానికి సిద్ధమయ్యారు. డాక్టర్ సెవార్డు, మోరిస్‌లు ఒక అరడజను మంచి గుర్రాలు తెచ్చారు. కావలసిన మ్యాపులు, మిగతా వస్తువులు దగ్గరుంచుకున్నాం నేనూ, ప్రొఫెసర్ 11-40 రైలుకు 'వెరెస్టీ' బయలుదేరాం ఆ స్టేషన్నుంచి బండి మాట్లాడుకుని బోర్గోపాస్‌కు వెళ్ళాలి. బాగా డబ్బు చేతబట్టుకొని బయలుదేరుతున్నాం. వీలయితే, అక్కడ బండిని, గుర్రాల్ని కొనాలి బండిని మేమే తోలుకెళతాం, ఎందుకంటే, అక్కడ ఎవర్ని నమ్ముతాం? ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్‌కు చాలా భాషలు వచ్చు కాబట్టి ఇబ్బంది లేదు. అందరి దగ్గరా

మిస్టర్ మోరిస్, డాక్టర్ సెవార్డు మా కంటే ముందే గుర్రాలు వేసుకుని బయలుదేరారు. కుడివైపు ఒడ్డుకు దూరంగా ఎత్తైన మైదానాలగుండా స్వారిచేస్తూ వుంటారు. అక్కడ్నించిచూస్తే, వారికి నదిమీద ప్రయాణం చేస్తున్న మేము కాస్త కనపడతాము వాళ్ళు బయలుదేరేముందు, మరి రెండు గుర్రాలను, రౌతులను కూడా వీళ్ళు తీసుకెళ్ళారు ఎక్కువ అనుమానం రాకూడదనుకుంటూ కొంతదూరం పోయాక రౌతులను వారి గుర్రాలతో వెనక్కి పంపించేస్తారు.

మాది చాలా సాహసయాత్ర నదిమీద ఒక ప్రక్క చలి వింత వింత శబ్దాలు మాకు తెలియకుండా, చీకట్లో ఏవేవో ప్రదేశాలగుండా వెళుతున్నామనిపించింది ఆర్థర్ పొయ్యి తలుపు వేసేస్తున్నాడు .

అక్టోబర్, 31 · వేగంగా వెళుతూనే వున్నాం తెల్లవారింది ఆర్థర్ నిద్రపోతున్నాడు నేను కాపలా వున్నాను. ఉదయం పూట చాలా చలిగా వుంది స్టవ్‌లాంచి పొయ్యి వేడివల్ల హాయిగా వుంది. ఒంటిమీద వున్నికోట్లు వున్నా చలి అనిపిస్తోంది మార్గమధ్యలో రెండు పడవలు కనిపించాయిగానీ, చెక్కపెట్టెతో వున్న పడవ ఏదీ కనిపించలేదు ఆ పడవల వాళ్లమీద హెడ్‌లైట్సు వేసినప్పుడు, వాళ్ళు కంగారు పడ్డారు.

నవంబర్, 1 (సాయంత్రం). ఇవాళ విశేషాలు ఏమీలేవు దేనికోసం వెతుకుతున్నామో, దాని జాడలేదు. మేం బిస్‌రిట్జ్ ప్రవేశించాం డ్రాకులా ఇటు వెళ్లి వుంటాడని వచ్చాం మా అంచనా తప్పు అయితే, ప్రయత్నం వృథా అయినట్టే. దారిలో కనిపించిన పడవలన్నిటినీ జాగ్రత్తగా పరికించాం ఇవాళ ఉదయం ఒక పడవను పరిశీలిస్తుంటే, వాళ్ళు మమ్మల్ని ప్రభుత్వ అధికారులమనుకున్నారు మా లాంచి మీద రుమేనియన్ జాతీయ జెండా ఎగురుతోంది అందువల్ల అది ప్రభుత్వ లాంచి అనుకుంటున్నారు వాళ్ళు దానివలన మాకు చాలా మంచి ఉపయోగం జరిగింది పడవలన్నీ వెతకడానికి అవకాశం ఏర్పడింది. వెతుకుతున్నప్పుడు ఎవరూ ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు కొంతమంది స్లోవాక్స్ తాము దారిలో చూసిన ఒక పడవ గురించి చెప్పారు. అది చాలా వేగంగా వెళుతోందని, దానిలో రెట్టింపు జనం ప్రయాణం చేస్తున్నారని, చెప్పారు కానీ ఆ పడవ బిస్‌రిట్జ్ వేపు వెళ్లిందో, 'సెరెత్' వేపు వెళ్ళిందో చెప్పలేకపోయారు నాకు నిద్ర వస్తోంది నాకు చలి బాధ ఎక్కువకాసాగింది ఆర్థర్ తను కాపలా వుంటానన్నాడు. అతని మంచి హృదయానికి దేవుడు చల్లగాచూస్తాడు.

నవంబర్, 2 (ఉదయం) బాగా తెల్లారిపోయింది. నన్ను కష్టపెట్టటం ఇష్టంలేక, ఆర్థర్ నన్ను నిద్ర లేపలేదు బాధలన్నీ మరచి మంచి నిద్రలో వున్నాను గాబట్టి లేపటం మహాపాపం అనుకున్నాడట నేను బాగా నిద్రపోయి, అతను రాత్రి అంతా మేల్కొని కాపలాకాయటం నేను చాలా తప్పు చేశాననిపించింది అతను నన్ను నిద్రపోనివ్వటమే మంచిదయింది. నిద్రలేచిన తర్వాత నేనొక కొత్తమనిషిలా మారిపోయాను ధైర్యంగా వున్నాను. ఈసారి అతను నిద్రపోయాడు. నేను కాపలావున్నాను లాంచి ఇంజను నడపటం నాకు తెలుసు దారిచూస్తూ స్టీరింగు తిప్పగలను అట్లాచేస్తోంటే, నాలోని పూర్వపు శక్తి వచ్చినట్టయింది మినా, వాన్‌హెల్సింగ్ గుర్తుకువచ్చారు వాళ్ళిప్పుడు ఎక్కడ వున్నారో? బుధవారంనాటి మధ్యాహ్నమే 'వెర్సెటీ' చేరుకుని వుంటారు అక్కడ్నించి గుర్రబ్బండి కోసం కొంతసేపు వేచివుండాలి బండిదొరికి బయలుదేరి ఎక్కడా ఆగకుండా ప్రయ ణం చేసివుంటే, ఈ పాటికి 'బోర్గోపాస్' చేరుకుని వుంటారు దేవుడు వాళ్లను రక్షించాలి! వాళ్లకు ఏమయినా అవుతుందేమోనని బెంగగా వుంది మేము ఇంకా వేగంగా వెళితే బాగుండును కానీ ఇంజనుకు అంత శక్తి లేదు దాని శక్తి మేరకు అది పని చేస్తోంది డాక్టర్ సెవార్టు, మిస్టర్ మోరిస్‌లు ఎట్లా ప్రయాణం చేస్తున్నారో మరి? ఎక్కడ్నుంచో ఎన్నో సెలయేరులు ఈ నదిలోకి ప్రవహిస్తున్నాయి అవి అంత పెద్దవి కాకపోయినా చలిమాత్రం బాగా పుట్టిస్తున్నాయి గుర్రాలమీద వెళుతున్న మా మిత్రులకు చలిబాధ ఎక్కువగా వుండకపోవచ్చు మేము 'స్ట్రాన్‌బా' చేరుకునేముందు, మా మిత్రులు మాకు కనిపించవచ్చు వాళ్ళు కూడా కలిసిన తర్వాత, ముందు కార్యక్రమం గురించి మళ్లీ చర్చించాలి— ఈ లోపుగా డ్రాకులా జాడ తెలీకపోతే.

## డాక్టర్ సెవార్డు డైరీ :

నవంబర్, 2 · మూడు రోజులు గుర్రం మీద ప్రయాణం చేసాం అందువల్ల డైరీ రాయటానికి వీలు పడలేదు ప్రతి క్షణం ఎంతో విలువైనదిగా కనిపించింది. గుర్రాలకి విశ్రాంతి ఇవ్వాల్సివచ్చినపుడే, మేమూ విశ్రాంతి తీసుకున్నాం తగిన విశ్రాంతి లేకపోయినా, మేం భరించగలిగాం వాతావరణం మాకు అనుకూలంగా వున్నట్టు అనిపిస్తోంది. మా ప్రయాణం కొనసాగించాలి. లాంచి మళ్ళీ కనపడితేగానీ, మాకు సంతోషంగా వుండదు

నవంబర్, 3 · లాంచి 'బిస్‌ట్రిట్' వేపు సాగిపోయిందని ఒకచోట అడిగితే తెలిసింది. అక్కడ అంత చలిగా వుండదని ఆశించాలి. ఓ పక్కన మంచు కురిసే సూచనలు కనిపిస్తున్నాయి ఆదే ఎక్కువయి మా ప్రయాణం ఆగిపోతుందేమో. అట్లా జరిగితే రష్యావాళ్లలాగ 'స్లెడ్జి' బండి సంపాదించి ప్రయాణంసాగించాలి

నవంబర్, 4 . లాంచికి ప్రమాదం జరగటంవల్ల ఆగిపోయిందని విన్నాం. స్లోవాక్స్ వాళ్ల బోట్లు కాస్త మునిగితే, తాళ్లతో పైకి లాగారు కొంతమంది మాత్రమే అక్కడవున్నారు ఆర్థర్‌కి లాంచిని బాగుచెయ్యటం తెలియకపోయినా, అతనే దానిని సరిచేసి ప్రయాణానికి పనికివచ్చేలా చేసినట్లు తెలిసింది. అక్కడి కొంత సహాయంతో మళ్లా వాళ్ల ప్రయాణం కొనసాగించినట్టు తెలుసుకున్నాం లాంచి అక్కడక్కడా ఆగుతూ వెళ్లినట్టు చెప్పారు వాళ్లను తొందరగా కలుసుకుంటే మంచిది, సహాయం చెయ్యవచ్చు

## మినా డైరీ :

అక్టోబర్, 31 వెరెస్టీకి మధ్యాహ్నం చేరుకున్నాం ఈ రోజు ఉదయం నన్ను హిప్నటైజ్ చెయ్యటానికి ఎంతో ప్రయత్నించినట్టు ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ చెప్పారు అంతా చీకటిగా, ప్రశాంతంగా వున్నట్టు మాత్రం చెప్పానట బండిని, గుర్రాల్ని కొనటానికి ఆయన వెళ్లారు కొన్ని గుర్రాలను అదనంగా కొంటానని కూడా చెప్పారు,దారిలో మిగతావాటికి విశ్రాంతినిచ్చి, వాటిని వాడటానికి వీలుగా. దాదాపు 70 మైళ్ళు ప్రయాణం చెయ్యాలి ఈ దేశాన్ని చూస్తుంటే ఎంతో హాయిగా వుంది. ఇప్పటి మా పరిస్థితీ మరో విధంగా వుంటే, తప్పకుండా ఎక్కువ సంతోషాన్ని అనుభవించగలిగే వాళ్లం నేనూ జోనాథన్ కలిసి ఇక్కడ ప్రయాణం చేస్తే, చాలా ఆనందదాయకంగా వుండేది మధ్య మధ్యలో ఆగుతూ, రకరకాల మనుషుల్ని కలుసుకుంటూ, వాళ్లను పలకరించి వాళ్ల జీవన విషయాలు తెలుసుకొని, వాటిని మా మనస్సుల్లో చెరగని ముద్ర వేసుకుని వుండేవాళ్లం కానీ ఇప్పటి మా పరిస్థితి అది కాదే!

తర్వాత డాక్టర్ వాన్‌హెల్సింగ్ తిరిగి వచ్చారు బండిని, గుర్రాలను తీసుకొచ్చారు కాస్త తిని ప్రయాణం సాగించాలి మరో గంటలో మేము మజిలీ చేసిన ఇంటిగల్లావిడ ఓ పెద్ద బుట్టతో మాకు దారిలో అవసరమయ్యే సామాన్లు అన్నీ పెట్టి ఇచ్చింది. అవి కొంతమంది సైనికులకు సరిపడా పెట్టినట్టు అనిపించింది. డాక్టర్ వాన్‌హెల్సింగ్ అది మంచిదే అన్నారు. ప్రయాణం వారం రోజుల దాకా పట్టవచ్చు. మళ్ళీ మధ్యలో మంచి ఆహారం అంటూ దొరకదు అన్నాడు నా చెవిలో. బజారు కెళ్ళి కొన్ని వస్తువులు కొని తెచ్చారు వాన్‌హెల్సింగ్. అందులో వున్ని కోట్లు, చలికి తట్టుకునే మరికొన్ని వస్తువులూ తెచ్చారు మాకు చలివేయటం అంటూ ఇక వుండదు

కాసేపట్లో బయలుదేరుతాం. దారిలో ఏమవుతుందో అని బెంగగా వుంది నిజంగా మేము దేవుని దయమీద ఆధారపడ్డాం ఆయన ఎట్లా

నడిపిస్తే అట్లా నడవాల్సిందే. నా భర్తని కని పెట్టుకుని వుండమని, ఎంత వినయంగా దేవుడ్ని వేడుకుంటున్నాను

నవంబర్, 1 రోజంతా బాగా వేగంగా ప్రయాణం చేసాం. గుర్రాలను ఇబ్బంది పెట్టడంలేదు. వాటంతట అవే ఎంతో ఇచ్ఛగా వెళుతున్నాయి. ప్రయాణం చాలా సాఫీగా జరుగుతుందని పిస్తోంది వాతావరణాన్ని చూస్తుంటే. డాక్టర్ వాన్‌హెల్సింగ్ పొడిపొడిగా మాట్లాడారు, దారిలో కనపడ్డవాళ్లతో. మధ్యలో వాళ్లకు ఎక్కువ డబ్బు చెల్లించాడు, గుర్రాలను మార్చటానికి అత్యవసరంగా బిస్ట్రిట్ వెళ్లాలని వాళ్లతో చెప్పారు. వేడి వేడి సూప్‌గానీ, కాఫీగానీ, టీగానీ దారిలో తాగి బయలుదేరేవాళ్లం నిజంగా ఇది అద్భుతమయిన దేశం అందాల దేశం. అక్కడి జనమంతా సాహసవంతులు, బలవంతులు ఎంతో నిరాడంబరంగా వున్నారు. సౌమ్య ప్రవర్తన వుంది వాళ్ళు చాలా ఎక్కువ మూఢనమ్మకం గలవారు. మేం మొదట ఒక ఇంటిదగ్గర ఆగాం. ఆ ఇంటిగల్లావిడ నా నుదుటి మీదవున్న గాయాన్నిచూసి, గుండెలమీద చేతిని తిప్పుతూ దేవుడ్ని స్మరించింది. తర్వాత రెండు వేళ్ళు నావేపు చూపించింది. నా మీది దుష్ట శక్తి పడకుండా వుండేందుకు, నేను తినే పదార్థంలో వెల్లుల్లిపాయలు ఎక్కువ వేసి తీసుకు రావటానికి వెనక్కి వెళ్లినట్టుంది నాకు వెల్లుల్లి అంటే పడదు. అప్పట్నించి నా టోపిని నెత్తిమీదనుంచి తీసెయ్యకుండా జాగ్రత్త పడ్డాను, ఆ విధంగా నా నుదుటిమీది గాయాన్ని గమనించకుండా. గుర్రపు బగ్గీని మా అంతట మేమే నడుపుతూ వుండటంవల్ల, అక్కడి కథలు చెప్పి భయపెట్టే బండివాళ్ల బెడద లేకపోయింది అయినా మా భయం మాకు వుండనేవుంది. ప్రొఫెసర్ అలసట చెందినట్టు కనపడటంలేదు. పగలంతా అసలు విశ్రాంతి తీసుకోకుండా గడిపారు చాలాసేపు పడుకోటానికి నాకు అవకాశం ఇచ్చారు సూర్యాస్తమయ వేళలో నన్ను హిప్నటైజ్ చేసారు. 'చీకటి, నీళ్ళ ప్రవాహపు చప్పుడు, పెట్టె జరుగుతున్న చప్పుడు' అని చెప్పానట అలాగయితే, డ్రాకులా ఇంకా నదిమీద ప్రయాణం చేస్తున్నాడన్నమాట జోనాథన్ గురించి ఆలోచించటానికి ధైర్యం చాలటం లేదు అయినా నా గురించిగానీ, జోనాథన్ గురించిగానీ బెంగ వదిలేసుకున్నాను పొలంలో ఒక ఇంట్లో వుండి ఇది రాస్తున్నాను గుర్రాలు విశ్రాంతి తీసుకుంటూ వుండటంవల్ల డాక్టర్ వాన్ హెల్సింగ్ నిద్రపోతున్నారు పాపం ఆయన చాలా అలసిపోయినట్టు కనిపించారు కానీ ఆయన పెదాలు చూస్తుంటే, ఎంతో పట్టుదలగా ఉన్నట్టు కనిపించింది మళ్ళీ ప్రయాణం కొనసాగించేటప్పుడు, ఆయన్ని విశ్రాంతి తీసుకోమనిచెప్పి, నేను గుర్రపు బగ్గీని నడుపుతాను చాలా రోజుల ప్రయాణం గాబట్టి ఆయన అలసట చెందటం మంచిది కాదని చెప్పాలి అంతా సవ్యంగా జరుగుతోంది

నవంబర్, 2 (ఉదయం) నేను బగ్గీని బాగానే నడిపాను మధ్యలో ఎన్నో మలుపులు తిప్పగలిగేను కాస్త చలి అనిపించినా, పగటి వెలుతురు బాగానే వుంది. గాలి ఎక్కువగా లేదు భారంగా వూపిరి తియ్యాలి మా ఉన్ని కోటులవలవల్ల అనిపించటంలేదుగానీ బయట బాగా చలిగానే వుందనిపిస్తోంది ఈ ఉదయం వాన్‌హెల్సింగ్ నన్ను హిప్నటైజ్ చేసారు ఇదివరకులానే చెప్పానట జోనాథన్ కులాసాగా వున్నాడనుకోవాలి అంతా దేవుడి చేతిలో వుంది

నవంబర్, 2 (రాత్రి) పగలంతా ప్రయాణం చేసాం ముందు పోతున్న కొద్దీ అడవి ఎక్కువ కాసాగింది మా ఇద్దరికీ ఉత్సాహం గానే వుంది ప్రయాణం ఒకరికొకరి ఉత్తేజాన్ని కలిగిస్తూ ప్రయాణం చేస్తున్నాం ఉదయాని కల్లా బోర్గోపాస్ చేరుకోవచ్చు అని వాన్ హెల్సింగ్ చెప్పారు మధ్యలో చాలా తక్కువ ఇళ్లు కనిపించాయి ఇక గుర్రాలను మార్చటానికి వీలుండదని చెప్పారు రెండు గుర్రాలను మారుస్తూ, మరి రెండు గుర్రాలను అదనంగా తీసుకున్నారు ఆయన గుర్రాలు చాలా మంచివి ఓపిగ్గా వున్నాయి మాకు ఎటువంటి ఇబ్బందీ కలిగించలేదు ఇతర ప్రయాణీకుల బెడద లేదు కాబట్టి, గుర్రపు బగ్గీని నేను కూడా నడప వచ్చు పగటివూటనే 'బోర్గోపాస్' చేరాలి ముందరగా చేరటం మా కిష్టంలేదు కాబట్టి నెమ్మదిగా ప్రయాణిస్తున్నాం, తగినంత విశ్రాంతి తీసుకుంటూ రేపు ఏమవుతుందో ఏమో ? నా భర్త జోనాథన్ ఎంతో నరకాన్ని చవిచూసిన చోటుకు వెళుతున్నాం దేవుడే మాకు సరైన దారి చూపుతాడు దేవుడి దయకు నేను తగినదాన్ని కాదు నా నుదుట డ్రాకులా చేసిన గాయం వుంది నేను అపవిత్రురాల్ని నన్ను క్షమించి, ఆయనే నన్ను దగ్గరకు తీసుకోవాలి

## ప్రొఫెసర్ వాన్ హెల్సింగ్

## రాసి వుంచిన వివరాలు

నవంబర్, 4 ఈ చీటి నా ప్రియమిత్రుడు జాన్ సెవార్డుకోసం రాసి వుంచినది, ఒకవేళ అతన్ని నేను కలవకపోయినట్టయితే, చూడటానికి

ఇది ఉదయం చలిమంట వెలుతురులో రాస్తున్నాను చాలా చలిగా వుంది ఎంత చలి అంటే, ఆకాశమంతా మంచుతో నిండివుంది ఈ చలివల్ల మినా ఆరోగ్యం బాగోలేదు. ఆమెకు తలభారంగా వున్నట్టు తోస్తోంది ఆమె తెగ నిద్రపోతోంది ఎప్పుడూ నిద్రే ! ఎప్పుడూ చలాకీగా వుండే మనిషి, ఏవిటో అసలు పూర్తిగా నిద్రలో వుండిపోయింది రోజూ డైరీ రాసే మనిషి, అసలు ఈసారి డైరీలో అక్షరం కూడా రాయలేదు ఇదంతా చూస్తుంటే, ఆమెకు ఒంట్లో సరిగ్గా వున్నట్టు తోచటంలేదు పగలంతా బాగా నిద్రపోవటం మూలంగా, ఇప్పుడు ఆమె బాగావున్నట్టుంది సూర్యాస్తమయ సమయంలో ఆమెను హిప్నటైజ్ చెయ్యటానికి ప్రయత్నించాను, కానీ ఫలితం శూన్యం రోజు రోజుకి ఆమె నా హిప్నటైజ్ శక్తి కి దూరమవుతోంది రాత్రి అయితే, ఆమెను అసలు హిప్నటైజ్ చెయ్యలేకపోయాను ఇక ఏంజరగాలో అది జరుగుతుంది, అంతా దేవుడి దయ

ఆమె డైరీ రాయటంలేదు విషయాలు

# జీవన్ మృతులు

నేనైనా నోటు చెయ్యాలి. లేకపోతే జరిగిన విషయాలకు రికార్డు వుండదు.

నిన్నటి ఉదయం సూర్యోదయం తర్వాత బోర్గోపాస్ చేరుకున్నాం. అప్పుడే సూర్యోదయం అయింది గాబట్టి, ఆమెను హిప్నటైజ్ చెయ్యటానికి సిద్ధపడ్డాను గుర్రపు బగ్గీని ఆపి దిగాం మా దగ్గరవున్న వున్నిబట్టలతో ఆమె కూర్చోడానికి అనువుగా తయారుచేసాను ఆమె కూర్చుంది ఇక హిప్నటైజ్ చెయ్యటం మొదలెట్టాను "చీకటి, సుళ్లు తిరుగుతున్న నీళ్ల చప్పుడు" ఇవీ ఆమె చెప్పిన మాటలు ఆమె హిప్నటైజ్ అవస్థలోంచి మేల్కొంది ఆమె చురుకుగా వుంది తర్వాత బోర్గోపాస్ వైపు దాటిపోసాం ఇక ఇక్కడికొచ్చిన తర్వాత ఆమె మరింత ఉత్సాహంగా వుంది ఏదో శక్తి ఆమెను ఆవరించినట్టు అనిపించింది వెళుతుండగా ఒక దారివేపు చూపించి "ఇదే దారి" అంది

"మీకెలా తెలుసు" అడిగాను

"నాకు తెలుసులెండి" అంది క్షణం ఆగి తర్వాత "జోనాధన్ ఇటు ప్రయాణం చేసాడు ఆ విషయం అతని డైరీలో వుంది కదా ?"

నేను కొంత ఆశ్చర్యంతో మాట్లాడలేదు అదేమార్గం గుండా ప్రయాణం సాగించాం గుర్రాలు చాలా ఓపిగ్గా బగ్గీని లాక్కెళుతున్నాయి జోనాధన్ డైరీలో రాసినట్టుగానే వుంది ప్రయాణం అట్లా చాలా గంటలు ప్రయాణం చేసాం మేడమ్ మినాను నిద్ర పొమ్మని చెప్పాను మొత్తానికి ప్రయత్నించి నిద్ర పోయింది అట్లా చాలాసేపు నిద్రపోయింది మళ్ళీ మేలుకోలేదు నాకు అనుమానం మొదలయింది అందుకని ఆమెను నిద్రలేపాను కానీ ఆమె లేవలేదు. నా ప్రయత్నం వల్ల ఉపయోగం లేదనిపించింది నా క్కూడా నిద్రమైకం కమ్మేస్తున్నట్టు అనిపించింది. కానీ ఏదో పొరపాటు చేస్తున్నట్టు తట్టుకుని మేలుకున్నాను గుర్రపు కళ్లాలు నా చేతిలో వున్నాయి. ఎట్లా నిద్ర పోగలను. మేడమ్ మినా ఇంకా నిద్రలోనేవుంది. సూర్యాస్తమయం దగ్గర్లో పడింది. మా బండి కొండపైకి ఎక్కుతోంది. అట్లా పైపైకి వెళ్లిపోతున్నాం.

ఆ సమయంలో మేడమ్ మినాను నిద్ర లేపాను. ఈసారి నేను ఎక్కువ కష్టపడకుండానే ఆమెను నిద్ర లేపాను. తర్వాత ఆమెను హిప్నటైజ్ చేసి మళ్ళీ నిద్రావస్థలోకి వెళ్ళేట్టు చేసాను. కానీ ఆమె నిద్రపోలేదు నేనెంత మెలకువగా వున్నానో ఆమె అంత మెలకువగా వుంది హిప్నటైజ్ చెయ్యటానికి చాలాసార్లు ప్రయత్నించాను ఈలోగా బాగా చీకటి పడి పోయింది మేడమ్ మినా నవ్వింది. నేను ఆమె వంక చూసాను. ఆమె బాగా స్పృహలోవున్నట్టు అనిపించింది ఆమె పరిస్థితి చూస్తుంటే ఆశ్చర్యం కలగసాగింది ఇంత ఉత్సాహంగానూ, కాంతివంతంగానూ, మున్నెన్నడూ లేదు వెంట తెచ్చుకున్న వంట చెరకుతో నిప్పు తయారు చేసాను నేను గుర్రాలకు విశ్రాంతి నిస్తుండగా, ఆమె తినడానికి ఆహారం తయారుచెయ్యసాగింది నేను గుర్రాలను వదిలి రాగానే, తిండి సిద్ధంగా వుంచింది ఆమెను కూడా తినమన్నాను ఆమె నవ్వింది బాగా ఆకలిగా వుండటంచేత నా కోసం వేచి వుండకుండా, ముందే తినేసినట్టు చెప్పింది ఆమె అట్లా చేసినందుకు నా మనసు చివుక్కుమంది నాలో ఏవో సందేహాలు రాసాగాయి నేను బయటపడలేదు మౌనంగా వున్నాను నేను తింటూ వుండగా, ఆమె వడ్డించసాగింది పడుకోటానికి పక్క ఏర్పాటు చేసాను వున్ని దుస్తులతో ఆమెను పడుకోమన్నాను నేను మెలకువతో వుండి కాపలా కాస్తానని చెప్పాను నా కాపలా సంగతి కాసేపటికి మరచిపోయాను ఒక్కసారి మెలకువ వచ్చి, ఆమెను చూసాను ఆమె పడుకునివుంది, కానీ కళ్ళు తెరిచేవున్నాయి నేను తెల్లార్లూ కునికిపాట్లు పడుతూనేవున్నాను, మధ్య మధ్య లేచి చూస్తూ ఉదయం లేవగానే ఆమెను హిప్నటైజ్ చెయ్యటానికి ప్రయత్నించాను కానీ ఫలితం శూన్యం ఆమె కూడా ప్రయత్నించింది కానీ, నా హిప్నాటిజం శక్తి కిలోను కాలేకపోయింది సూర్యోదయమయింది సూర్యుడు బాగా పైకి వచ్చేశాడు పైపైకి వచ్చేశాడు తర్వాత ఆమెకు నిద్ర వచ్చేసింది మొద్దునిద్ర పోయింది ఆమెను లేవనెత్తి గుర్రపుబగ్గీలో పడుకోబెట్టాల్సి వచ్చింది నేను గుర్రాలను బండికి కట్టాను ఆమె నిద్రలోనే వుంది ఆ నిద్ర సమయంలో ఆమె ఎంతో ఆరోగ్యంగా, ఎర్రగా కనిపించింది అట్లా ఆమె కనిపించటం నాకు రుచించలేదు, నాకెందుకో భయం కలిగింది ఒకటే భయం, భయం! అన్నింటి గురించి భయాలు, సందేహాలే! ఏ ఒక్కదాని గురించి ఆలోచించాలన్నా భయంగానే వుంది ఏమైనా, నేను ఎన్నుకున్నదారిన పోవాల్సిందే అని నిశ్చయించుకున్నాను. ప్రాణాలకు తెగించి బయలుదేరాం ఇక దేనికీ భయపడకూడదు.

నవంబర్, 5 (ఉదయం) ఇక్కడ వివరంగా రాస్తాను నువ్వూ నేనూ ఎన్నో వింత విషయాలు చూసాం, అయినా కూడా ఇది చదివి మొదట నేనొక పిచ్చివాడ్ని అన్న అభిప్రాయాని కొచ్చేస్తావు ఎన్నో భయంకర సంఘటనలు, వాటిని అనుభవించి ఎంతో బాధకు లోనయిన తీరు నా బుర్రమీద బాగా పని చేసాయి

నిన్నంతా ప్రయాణం చేస్తూనే వున్నాం ఇంకా ఇంకా దట్టమైన అడవుల గుండా వెళుతూనే వున్నాం ప్రకృతి మాత్రం గొప్పగా వుంది మేడమ్ మినా ఒకటే నిద్ర నాకు బాగా

ఆకలయినప్పటికీ ఓర్చుకుని వుండిపోయాను, ఆమెను మాత్రం లేపలేదు ఆ ప్రాంతం గాలి వల్ల ఆమె అట్లా అంతులేని మగతలో వుంటోం దని భయమేసింది. ఈమె ఇట్లాగే నిద్రపోతే, రాత్రికి కూడా నాకు నిద్ర వుండదనుకున్నాను బండిని నడుపుతూనే తలవొంచి నిద్ర పోసాగాను మధ్యలో ఒక్కసారి వులిక్కిపడి లేచాను మినా నిద్రలో మార్పులేదు. సూర్యుడు ఆకాశంలో క్రిందికి దిగిపోయాడు మా ప్రయాణంలో ఎంతో మార్పు కనిపించింది మేం ఏటవాలుగా వున్న శిఖరాగ్రానికి చేరాం అక్కడే కదా డ్రాకులా కోట వుందని జోనాధన్ తన డైరీలో రాసుకు న్నాడు అది తలుచుకోగానే వులిక్కిపడ్డాను భయం కూడా వేసింది ఎవరికైనా గానీ మొత్తానికి ముగింపు దగ్గర పడింది

మేడమ్ మినాను నిద్రలేపాను ఆమెను హిప్నటైజ్ చేయటానికి ప్రయత్నించాను ఏమీ లాభం లేకపోయింది అప్పటికే బాగా ఆలస్య మయింది కూడా బాగా చీకటి పడింది బండిని ఆపి గుర్రాల్ని విడదీసాను అక్కడ వంట కోసమని మంటపెట్టాను. మేడమ్ మినా కాస్త పక్కగా కూర్చుని వుంది ఆమె పూర్తిగా మేల్కొని వుంది ఎంతో చురుకుగా కనిపించింది. తినడానికి తిండి తయారు చేసాను ఆకలిలేదట, తినను అంది నేను కూడా పెద్దగా బలవంతం చెయ్యలేదు ఆమె ఎట్లాగూ తినదని అనిపించి నేను మాత్రం తినటం మానేయలేదు, మరి ఒంట్లో ఓపిక వుండాలికదా నాకు కొంత సందేహమొచ్చి, ఆమె కూర్చున్న స్థలం మేరకు చుట్టూరా గీతగీసాను చక్రంలా. ఆ గీతలో దైవ సంబంధమైన పొడిని చల్లాను ఇక ఆమె రక్షణ గురించి చింతలేదు ఆమె అట్లాగే కూర్చుండిపోయింది, చలనంలేకుండా. ఆమె శరీరం అంతవరకూ పాలిపోసాగింది ఆమె ఒక్క మాటకూడా మాట్లాడలేదు నేను ఆమెకు దగ్గరగా వెళ్లాను ఆమె నన్ను గట్టిగా కౌగ లించుకుంది ఆమె శరీరమంతా వణికిపోసాగింది ఆమె కాస్త తేరుకున్న తర్వాత "మంటకు దగ్గరగా వచ్చి కూర్చుంటారా ?" అడిగాను. ఆమె శక్తిని పరీక్షించటంకోసం అట్లా లడిగాను ఆమె లేచింది ఒక్క అడుగువేసి గీత దాట బోయింది కానీ అట్లా చేయలేక ఆగిపోయింది.

"ఏమిటీ ఆగిపోయారు ?" అడిగాను అడుగు వెనక్కి తీసుకుని, కూర్చుండిపోయింది తల అడ్డంగా తిప్పుతూ, 'రాలేను' అంది తర్వాత మౌనంగా వుండిపోయింది ఆమె గీత దాటలేదని తెలిసి నాకు భలే సంతోషమేసింది ఆమె దేహం కలుషితమయినా, ఆమె ఆత్మకు ప్రమాదం జరగలేదనిపించింది

అప్పుడే గుర్రాలు భయంకరంగా సకిలిం చటం మొదలుపెట్టాయి, వాటికి కట్టివుంచిన తాళ్లు తెగిపోయాయి నేను వాటి దగ్గరికి వెళ్ళి వీపుతట్టి కుదుటపరచాను అందుకు అవి ఆప్యాయంగా నా చెయ్యిని నాలికతో స్పృశించాయి రాత్రి అట్లా అని చాలాసార్లు అరవటం, నేను వాటిని తట్టి ధైర్యం చెప్పటం జరిగాయి కొంతసేపటికి మంచు బాగా కురవసాగింది బాగా చలి ప్రారంభమయింది ఆ సమయంలో మంట చల్లారిపోసాగింది మంట ఎక్కువ చెయ్య టానికి వెళ్లబోయాను అప్పటికే చల్లారిపోయిన మంట తాలుకు పొగ దట్టంగా అలుముకుంది ఆ పొగ క్రమంగా ఆటవిక దుస్తుల్లో వున్న అమ్మాయిలుగా మారింది ఆ ఆకారాలు మౌనంగా వున్నాయి గుర్రాలు మాత్రం బాధగా మూలుగుతున్నాయి, ఓపికలేనట్టుగా నేను బెదిరిపోయాను వెంటనే గుర్తుకువచ్చి, మేడమ్ మినా కూర్చున్న వలయాకారపు గీత మధ్యలో కెళ్లాను. జోనాధన్ తన డైరీలో రాసుకున్న అనుభవాలలాంటివే నాకు కలగసాగినయి నా ముందర పొగమంచు సుడిగాలిలా తిరగసాగింది గుర్రాల మూలుగు చచ్చిపోసాగింది పారిపోవ టానికి వాటికి ఒంట్లో సత్తువలేదని తెలుసు పిశాచి అమ్మాయిలు మేం కూర్చున్న చోటుకు దగ్గరగా వచ్చారు మా చుట్టూ మూగారు

**(ఇంకా వుంది)**





# ఒకే జాతి

రిక్షా దిగిన వెంకట్రామయ్య రెండ్రూపాయల కాయితంతీసి రిక్షావానికి యివ్వబోయాడు

"చిల్లరలేదు బాబూ" చెమట తుడుచుకుంటూ చెప్పాడు రిక్షాతను

"మరెట్లాగయ్యా, నా దగ్గరా చిల్లరలేదే" అసహనంగా వున్నై వెంకట్రామయ్య మాటలు

"అదిగో ఆ కిళ్లీకొట్లో అడగండి" సలహాయిచ్చాడు రిక్షావాలా

"పావలాకూడా లేదుటయ్యా" విసుగ్గా కిళ్లీకొట్టువైపు నడిచాడు వెంకట్రామయ్య

"ఇదే బోణీబాబూ" గొణిగాడు రిక్షావాలా

రిక్షా అతను రెండున్నర అడిగాడు వెంకట్రామయ్య రూపాయిన్నర యిస్తానన్నాడు చివరికి యిద్దరూ రూపాయిముప్పావలాకు ఒప్పుకున్నారు.

"బాబూ ! చిల్లరవుంటే యిస్తావూ" రెండ్రూపాయల కాయితం చూపుతూ కిళ్లీకొట్టు కుర్రాడ్ని అడిగాడు వెంకట్రామయ్య

"చిల్లర లేదండీ" ఆయన్ని చూడకుండానే సమాధానంచెప్పాడు కుర్రాడు

"సరే ఒకసోడా యివ్వు"

"ఐస్ సోడానా మామూలా"

"ఐస్‌సోడానే యివ్వు"

రెండ్రూపాయలు యిచ్చిన వెంకట్రామయ్యకు చిల్లర తిరిగియిచ్చాడు కిళ్లీకొట్టు కుర్రాడు

అప్పటికే ఆక్కడికివచ్చి నిలబడివున్న రిక్షావాలాకు డబ్బులిచ్చి మళ్లీ రిక్షా దిగిన స్థలానికి చేరాడు వెంకట్రామయ్య

మొత్తం ఎన్నిగదులున్నయ్యో తెలియటం లేదుకాని ముందు రెండు గదులు విశాలంగా వున్నయ్యి మొదటి గదిలో ఖరీదైన కుర్చీలు అరడజనుపైగావున్నై రెండు సోఫాలు, ఒక టీపాయ్ వున్నయ్యి టీపాయ్‌మీద దినపత్రికలు వున్నయ్యి

కుడిచేతివైపు 'సమాచార కేంద్రము' అని తెలుగులో వ్రాయబడిన బోర్డు వుంది. అక్కడ ఒక అమ్మాయి నవలో మరోకటో చదువుతూ కూర్చుంది ఆఫీసు అప్పుడే తెరవటంవల్ల అంత రద్దీగాలేదు

లోపలికి నడిచిన వెంకట్రామయ్య సమాచార కేంద్రంవైపు నడిచాడు

"ఏం కావాలండి" ప్రశ్నించింది సమాచార కేంద్రంలో కూర్చున్న అమ్మాయి

సమాధానం ఏమీ చెప్పకుండా జేబులో నుంచి ఓ కాగితంతీసి ఆమెకి అందించాడు వెంకట్రామయ్య

"అప్లికేషన్ ఫారం పూర్తిచేయాలండీ" చెప్పిందామె

"కొంచం మీరే పూర్తిచేసి పెట్టండమ్మా" అభ్యర్థనగా అడిగాడాయన

"ఈ ఆడవాళ్లు వుద్యోగాలు మానేస్తే సగం నిరుద్యోగం సమస్య వదిలిపోతుంది దేశానికి

మొగవారు సంపాయించి తెస్తుంటే తిని కూర్చోక ఎందుకు వీళ్లకీ వుద్యోగాలు అయినా వుద్యోగం పురుష లక్షణం అన్నారు యిల్లు యిల్లాలు అన్నారు

డిగ్రీలుపూర్తిచేసి నిరుద్యోగులుగావుంటున్న యువకులు ఎందరో వుండగా, మొగుడు సంపాయిస్తున్నా కాలక్షేపం కోసం వుద్యోగాలుచేస్తున్న స్త్రీలు ఎంతమందో వున్నారుకదా !"




ఆలోచిస్తున్న వెంకట్రామయ్యకు ఆవిడ మాటలు వినిపించినై

అప్పటివరకు వెంకట్రామయ్య యిచ్చిన కాయితం చూస్తున్న ఆవిడ అన్నది

''మీరు చెప్తుంటారా, నేను ఫారంపూర్తి చేస్తాను ''

''ఏమ్మా దస్తూరి యిబ్బందిగా వుందా '' నవ్వుతూ అడిగాడు వెంకట్రామయ్య

యిబ్బందిగా నవ్విందామె సమాధానంగా పేరు వసంత, వయసు యిరవై మూడు, చదువు యింటర్, తండ్రిపేరు వెంకట్రామయ్య ఎరుపురంగు, ఎత్తు అయిదు మూడు యిలా యిలా వివరాలన్నీ వెంకట్రామయ్య చెప్పడం ఆవిడ అప్లికేషన్ పూర్తి చేసి సంతకం చేయమని ఆయన కందించడం జరిగినై

సంతకం చేసి ఫారం చేతిలో పట్టుకొని లోపల గదిలోకి వెళ్లాడు వెంకట్రామయ్య

నలుగురు వ్యక్తులు నాలుగు సీట్లలో కూర్చుని వున్నారు వారిముందున్న టేబుల్స్‌పై వారి పేర్లు వ్రాసివున్న బోర్డులు వున్నై వారికి వెనుక వున్న గోడలమీద ఏదో అంకెలు వేసి వున్న బోర్డులు వున్నయ్య యాభై నుండి నూరు, పదిహేను నుండి యాభై, పదిహేను వరకు, నిల్ అని నలుగురి వెనుక నాలుగు బోర్డులు వ్రేలాడుతున్నై

నిల్ బోర్డున్న వ్యక్తి దగ్గరకు వెళ్లాడు వెంకట్రామయ్య

అతను ఫారం పూర్తిగ చూసి ముద్రవేసి సంతకం చేశాడు వెంకట్రామయ్య తగిన పైకం చెల్లించాడు అప్లికేషన్ పైభాగాన ఎర్రసిరాతో తేదీ వేసి ఆ తేదీన మళ్ళీ రమ్మని చెప్పాడు

ఖచ్చితంగా నెలరోజుల వ్యవధి వుంది అతను రమ్మని చెప్పిన తేది వ్యవధి ఎక్కువగా వున్న దనుకున్న వెంకట్రామయ్య సగం సంతోషంతో మాత్రమే బయటకి నడిచాడు

మళ్లీ ఓ రిక్షా మాట్లాడుకోని యింటి అడ్రస్ చెప్పి రిక్షాలో కూర్చున్నాడు వెంకట్రామయ్య

వెంకట్రామయ్య రిటైరైన గవర్నమెంటు వుద్యోగి నలుగురు సంతానం ముగ్గురు అమ్మాయిలు, ఒక అబ్బాయి పెద్దమ్మాయికి పెండ్లికొడుకుల ధరలు అతి చౌకగా వున్న కాలంలోనే ఆర్భాటంగా పెళ్లిచేశాడు రెండవ సంతానం కొడుకు మధు డిగ్రీ పూర్తిచేసి యిటీవలే ఓ ప్రైవేటు కంపెనీలో వుద్యోగంలో చేరాడు రెండో అమ్మాయి విజయకు కూడా వరుల ధరలు ఒక మాదిరిగా వుండగానే ఒక యింటిదాన్ని చేసి తృప్తిపడ్డాడు వెంకట్రామయ్య. విజయ పెళ్లికి కాస్తో కూస్తో అప్పకూడా చేశాడు అయినా అది ఆయనకు అంత బాధగానూ భారంగానూ అనిపించలేదు ఎంచేతంటే అప్పట్లో ఆయన వుద్యోగం చేస్తున్నాడు చేసిన అప్పు వాయిదాలమీద తీర్చేశాడు

ఆస్తి ఏమీలేని వెంకట్రామయ్య ప్రస్తుతం పించను డబ్బుతో కాలం వెళ్లబుచ్చుతున్నాడు కొడుకు సంపాదన వేడినీళ్లకు చన్నీళ్లలా తోడయింది అందులోనే కూతురు పెళ్లికని కొంత కూడబెడుతున్నాడు

ఆయనకి వచ్చే పింఛను తనకీ, భార్యకీ చాలదు పైగా పెళ్లీడుకొచ్చిన కూతురువుంది ఆమెను పోషించటంకాక పెళ్లిచేసి పంపాలి ప్రస్తుతం ఆయనకు వున్న సమస్య అదొక్కటే ఆ సమస్య పరిష్కారం కోసమే ఆయన మేరేజ్ ఎక్స్చేంజ్ అనే ఆఫీసుకు వెళ్లాడు

రోజు రోజుకూ నిరుద్యోగులు పెరిగిపోతున్నట్లు పెళ్లీడుకొచ్చిన ఆడపిల్లలు పెరిగిపోతున్నారు లంచగొండితనం పెరుగుతున్నట్లు వరకట్న సమస్య దినదినాభివృద్ధి అవుతున్నది

లంచగొండితనం నశించాలి అని నినాదాలు చేస్తూనేవున్నారు, ఎవరికివారు లంచాలు యిచ్చి వారి వారి పనులు సానుకూలపరుచుకుంటున్నారు

వరకట్న దురాచారం నిర్మూలించాలి అని

పారికేకలు పెడుతూనే ఎవరికివారు శక్తికి తగినట్లు, శక్తికి మించికూడా కట్నాలు యిచ్చి ఆడపిల్లల్ని వదిలించుకుంటున్నారు.

కట్నం యివ్వకుండా పెళ్లి చేయాలని ఎవరైనా భీష్మించుక్కూర్చున్నారనుకోండి కన్నకూతురే అడుగుతుంది 'పెళ్లి చేయలేనివారు ఎందుకు కన్నారు' అని. 'కనేముందు తెలియదా' అనికూడా అడగ్గలరు అందుకే ఆశయాలు ఏవైనా ఆడియాశలు కాకుండా జాగ్రత్త పడాల్సొస్తున్నది తల్లితండ్రులకు

నిరుద్యోగులంతా వుద్యోగాల కోసం ఎంప్లాయిమెంటు ఎక్చేంజిలో పేరు నమోదు చేసుకుంటే వుద్యోగ అవకాశం వున్నట్లే పై చెప్పిన ఆఫీసులో పెళ్లి కావల్సిన ఆడపిల్లలకు వరులు దొరికే అవకాశం వుంది. ఈ ఆఫీసులో వివిధ ఆదాయాలు, వివిధ కులాలు, వర్గాలు, వివిధ అభిరుచులు, ఆశయాలున్న అనేకమంది అబ్బాయిల వివరాలు, ఫొటోలు వుంటయ్యి వరులకు కావాల్సిన కట్నాలు వగైరా వివరాలు కూడా వుంటయ్యి.

యిక ఆడపిల్లలు డైరక్టుగాగాని త్రూ ప్రాపర్ చానల్‌గాగాని వెళ్లి వారి వివరాలు తెలియచేసి వారికి కావలసిన ధరలో అబ్బాయిల వివరాలు కనుక్కోవచ్చు ఆ తర్వాత కుదిరితే కొనుక్కోవచ్చు.

మొదట అప్లికేషన్‌ఫారమ్ పూర్తిచేయాలి ఒక్కొక్కధరకు ఒక్కోరంగుఫారం వుంటుంది

మళ్లీ వాళ్లుచెప్పిన రోజునవెళితే వారు వివిధఫొటోలు, వివరాలు మనకి చూపిస్తారు. వాటిల్లో మనకినచ్చినవి ఒక మూడుమాత్రం సెలక్టు చేసుకోవచ్చు అంతకుమించి సెలక్టు చేసుకున్న ప్రతి రెండుఫొటోలకు అధికంగా ఆఫీసువారికి నిర్ణీతరుసుం చెల్లించాల్సివుంటుంది.

పైనచెప్పిన కార్యక్రమంఅంతా పూర్తి చేసి వెంకట్రామయ్య యిల్లుచేరాడు.

తన రాకకోసం ఎదురుచూస్తున్నభార్యకి, కూతురికి జరిగిన కార్యక్రమంమొత్తం వివరంగా

## ఒకే జాతి

చెప్పాడు వెంకట్రామయ్య, ఆయనకున్న మంచి అలవాట్లలో యిదీ ఒకటి అని చెప్పాలి. తను ఏదైనాపనిమీద బయటికి వెళ్లివస్తే జరిగిన సంగతంతా యింట్లో తనకోసం ఎదురు చూస్తున్నవారికి వివరంగా చెప్తాడు

నెలరోజులు ఆగాలనివిని కూతురు కొంత నిరుత్సాహం కనపరచినమాట నిజమే కాని భార్య మాత్రం నెలరోజులు ఎంతసేపులే అని తృప్తిపడింది.

రోజులు గడుస్తున్నై, ఏవో తెలియని తీపికలలు కంటూ కాలం గడుపుతున్నది వసంత

* * *

వసంతను తీసుకొని ఆఫీసులోకి అడుగు పెట్టాడు వెంకట్రామయ్య. జనం ఓ మూరు దాకా వుండచ్చు. అంతా హడావిడిగా, సందడిగా వుంది ఆ రోజు రమ్మని చెప్పిన వ్యక్తిదగ్గరకు వెళ్లాడు వెంకట్రామయ్య

ఒక కార్డుమీద ఏదో వ్రాసి సంతకంచేసి వెంకట్రామయ్య చేతికందించాడు

ప్రక్కగావున్న తలుపు చూపిస్తూ లోపలికి వెళ్లమన్నాడు.

తలుపుదగ్గర ఓ వ్యక్తి వున్నాడు కార్డు తీసుకొని యిద్దర్నీ లోపలికి పంపాడతను.

"డాక్టర్స్ లిస్ట్" అంటూ ఓ బైండింగ్ చేయబడిన పొడుగాటి పుస్తకం

"గవర్నమెంటు ఎంప్లాయిస్" అంటూ మరొకటి.

"యింజినీర్స్"
"ప్రయివేట్ ఎంప్లాయిస్"
"లెక్చరర్స్ అండ్ టీచర్స్"
"కాంట్రాక్టర్స్"
"బిజినెస్ మెన్"

అని చెపుతూ ఒక్కొక్కరి కార్డు వెంకట్రామయ్య వసంతల ముందుంచాడు లోపలి వ్యక్తి.

బట్టలకొట్టుకు వెళ్లినప్పుడు రకరకాల చీరలను వాటి పేరు, నాణ్యత, వగైరాలు చెపుతూ పడేయటం గుర్తొచ్చింది వసంతకు అయితే వరులగురించి వీరేమి వ్యాఖ్యలు చేయరు

అన్ని ఫొటోలు వాటక్రింద వున్న వివరాలు ఎంతో ఓపిగ్గా చూశారు తండ్రీ కూతుళ్లు.

ఆమెకు నచ్చిన ఫొటోలు ఓ అరడజను ప్రక్కకు తీసి పెట్టుకుంది వసంత

"మూడు ఫొటోలు మాత్రమే మీరు ఎన్నుకోవాలి. అంతకు మించి కావాలంటే అదనపు ఫీజు చెల్లించాల్సి వుంటుంది" నవ్వుతూ చెప్పాడు అక్కడి వుద్యోగి

కూతురి మొఖం చూసి కాదనలేకపోయాడు వెంకట్రామయ్య వెళ్ళి అదనపు ఫీజు చెల్లించాడు "యిక మేం వెళ్లొచ్చా" అని అడిగాడు వెంకట్రామయ్య అక్కడి ఉద్యోగిని

"వెళ్లొచ్చండీ మీరు సెలక్టు చేసుకున్న ఐదుగురికి మీ అమ్మాయి ఫొటో పంపాలి వుంటే యిప్పుడే యివ్వండి లేకపోతే ఎంత త్వరగా యిస్తే అంత మంచిది మీ అమ్మాయి ఫొటో, వివరాలు వారికి పంపిస్తాము. వారు యిష్టపడితే వచ్చి మీ అమ్మాయిని చూస్తారు" క్లుప్తంగా వారు చేయబోయే కార్యక్రమాన్ని వివరించాడతను

వెంకట్రామయ్య, వసంత యింటికి బయలుదేరారు.

అయిదుగురి ఫొటోలు చూపి, వివరాలన్నీ వివరంగా వివరించాడు వెంకట్రామయ్య, భార్యకి.

"ఈ అయిదుగురిలో నీకు బాగా నచ్చిందెవరమ్మా" ఆప్యాయంగా అడిగింది వసంత తల్లి

సమాధానం చెప్పకుండానే సిగ్గుతో లోపలికి వెళ్లిపోయింది వసంత.

అయిదురిలో ముందుగా కాంట్రాక్టర్ రామ్మూర్తి వచ్చాడు. అబ్బాయికి అమ్మాయి నచ్చిది కాని అమ్మాయిగ్గాని, వెంకట్రామయ్య దంపతులగ్గానీ అతను నచ్చలేదు.






గాంధార

శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్



# రామరాజ్యంలో భీమరాజు

నిర్మాత:
**మిద్దే రామారావు**

దర్శకత్వం:
**ఎ.కోదండరామిరెడ్డి**

సంగీతం: చక్రవర్తి  కెమెరా: వెంకట్

లక్ష్మీ ఫిలింస్

## ఒకే జాతి

రెండోసారి ప్రయివేటు కంపెనీలో గుమాస్తాగా పనిచేస్తున్న శివప్రసాద్ వచ్చాడు అతనితోపాటు తల్లితండ్రుల్ని కూడా తీసుకు వచ్చాడు. తమ అమ్మాయికి, అబ్బాయికి ఒకళ్ళకి ఒకళ్ళు నచ్చారు కాని అబ్బాయికివున్న ఏకైక ముద్దుల చెల్లెలుకు ఆడపడుచు కానుకగా కోరిన ఐదువేలు, అబ్బాయికి మామగారి బహుమానంగా కోరిన స్కూటరు, ఆ పెళ్ళి కుదరనీయలేదు

ఆ తర్వాత వచ్చిన లెక్చెరర్ శ్రీకాంత్‌కి వసంత నచ్చలేదు

రోజు రోజుకు వెంకట్రామయ్యకు నిరాశ పెరుగుతున్నది. వసంత తల్లి పరిస్థితీ అదే విధంగా వుంది వసంతకి మాత్రం నిరాశగాని, దిగులుగాని లేదు అందుక్కారణం లేకపోలేదు. ఆమె కోరుకున్న అయిదుగురిలో యింకా యిద్దరున్నారు ఆ యిద్దరిలో ఇంజనీర్ రవి అంటే ఆమె ఎక్కువ యిష్టపడుతున్నది అతను వచ్చే వారం వస్తున్నట్లు తెలిసింది ఆ వుత్సాహంతో అతనికోసం ఎదురు చూస్తున్నది వసంత

ఈ లోపుగానే మునిసిపల్ ఆఫీసులో గుమస్తా చేస్తున్న నాగరాజు తల్లిదండ్రులతోసహా వచ్చాడు వసంతని చూడటానికి

ఎప్పటిలాగే పెళ్ళిచూపుల తతంగం ఏర్పాటు చేశారు వసంత రావడం, అబ్బాయి అమ్మాయి చూసుకోవడం వగైరాలన్నీ పూర్తయినై

"డిగ్రీ పూర్తిచేస్తే ఏదైనా ఉద్యోగం యిప్పించుకోగలను నేను మరి మీకు వుద్యోగం చేయడం యిష్టమేనా ?" అడిగాడు నాగరాజు

ఉద్యోగం చేయటం తనకి ఏ మాత్రం యిష్టంలేదని చెప్పింది వసంత వెంకట్రామయ్య కూడా కూతురి అభిప్రాయాన్నే వెలిబుచ్చాడు

"అమ్మాయి ఫోటో చూసి మా వాడు ముచ్చటపడ్డాడు. ఇంటర్ అయింది కాబట్టి డిగ్రీకూడా పూర్తిచేయించి ఏదైనా వుద్యోగంలో చేర్పించవచ్చు ఆ అమ్మాయికి యిష్టమైతే అనుకున్నాడు మరి మీరు ఆలోచించుకొని వ్రాయండి" అన్నారు నాగరాజు తల్లితండ్రులు

అలాగేనంటూ శెలవు తీసుకున్న నాగరాజు కుటుంబాన్ని బస్స్టాండుదాకా సాగనంపివచ్చాడు వెంకట్రామయ్య.

ఇంటికొచ్చిన వెంకట్రామయ్య కూతుర్ని ఆలోచించుకోమన్నాడు ఆమెకు పూర్తిగా యిష్టమైతేనే వారికి సమాధానం వ్రాస్తానన్నాడు. కూతురి పెళ్లి కావటమే ముఖ్యంగా పెట్టుకున్న వెంకట్రామయ్య తన అభిప్రాయాన్ని మార్చుకోక తప్పలేదు అందుకే కూతురు కూడా తన నిర్ణయాన్ని మార్చుకుంటుందేమోనని అడిగాడు ఆమెను.

వసంత ఎదురుచూస్తున్న రవి రావడం, తొలి చూపులోనే ఒకర్ని ఒకరు ఆకర్షించుకోవటం ఫలితంగా వసంత రవి భార్య కావడం జరిగినై.

కట్నం లేకుండా కూతుర్ని ఓ యింజనీరుకు యిచ్చి పెళ్లి చేసినందుకు వెంకట్రామయ్య పరమ సంతోషపడిపోయాడు . ఆ సంతోషంతో పాటు యించుక గర్వంగూడా కలక్కపోలేదు.

ఆమె కోరుకున్న వ్యక్తి తనమే కావాలను కోవడం, అతన్నే భర్తగా పొందడం వరంగా భావించింది వసంత

కూతురు మనసైనవాడిని మనువాడినందుకు వసంత తల్లి ఆనందానికి అవధుల్లేవు

ఒక యింజనీరు కాని కట్నం లేకుండా పెళ్లి చేసుకోవడం ఎంతో విశేషంగా చెప్పుకొని చాలామంది కొనియాడారు రవిని

వసంత భర్తతో కాపురానికి వెళ్లింది

భార్య వచ్చిన మూడవ రోజునే డిగ్రీ పుస్తకాలు తెచ్చి చేతికిచ్చాడు రవి

ప్యాకెట్ అందుకున్న వసంత అర్థం కానట్లు చూసింది రవిని

"అలా చూస్తున్నావేమిటోయ్ డిగ్రీ పుస్తకాలు నువ్వు రేపు మార్చికి ఫస్ట్ యియర్ పరీక్షలు వ్రాయాలి" అన్నాడు రవి

"నాకు చదవాలని లేదండీ అయినా నాతో మాటమాత్రం అనలేదే" అన్నది వసంత

"భలేదానివే చదవాలని లేకపోవటం ఏమిటి తొందరగా డిగ్రీ పూర్తిచేస్తే నీ కోసం ఓ వుద్యోగంకూడా చూస్తాను వుద్యోగం కూడా చేయాలిమరి నువ్వు" అంటూ దగ్గరగా వచ్చాడతను

"ఉద్యోగమా" ఆశ్చర్యంగా అన్నది వసంత

"ఏం . యిష్టంలేదా" వ్యంగ్యంగా అన్నాడు

"అనికాదూ" అన్నది నిర్లిప్తంగా

"ఉద్యోగం చేయించవచ్చనే వుద్దేశ్యంతోనేగా నిన్ను కట్నం లేకుండా చేసుకున్నది" నిర్మొహమాటంగా అన్నాడతను

అవాక్కయి నిలబడిన వసంత మరింక మాట్లాడలేదు కాసేపుదాకా

"మీకు కావాల్సిన కట్నం సంపాయిస్తాను ఆ తర్వాత మానుకోవచ్చా" అని అడిగింది అతన్ని పూర్తిగా చదవాలనే వుద్దేశ్యంతో

"అలా అయితే నాకు లాభం ఏముంటుంది" వెకిలిగా నవ్వాడు రవి

"అంతా అదే జాతి" అనుకున్న వసంతకు వుద్యోగం చేయక తప్పలేదు.

"యింకా ఎన్నిరకాల పరిస్థితుల్లో ఆడవారు వుద్యోగాలు చేస్తున్నారో" అనుకున్నాడు వెంకట్రామయ్య 

## హైదరాబాద్ నోట్‌బుక్

### పిల్లల పాట్లు :

పాఠ్యపుస్తకాల సరఫరా సక్రమంగా జరుగుతుంది నిలువకు కొరకాలేదు — అని రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ ఎంతగా ప్రకటలు చేసి, హామీలు ఇచ్చినా క్రియ మాత్రం శూన్యం జంట నగరాలలోని పెక్కు పాఠశాలల విద్యార్థులు, వారి తలిదండ్రులు పాఠ్యపుస్తకాలకోసం నానాపాట్లూ పడుతున్నారు. కొన్ని పుస్తకాలు దొరికితే, కొన్ని దొరకడంలేదు. జూన్ మూడవ వారంలో మింట్ కాంపౌండులోని రాష్ట్ర ప్రభుత్వ పాఠ్యపుస్తకాల ప్రెస్ యూనియన్ కార్యాలయంలో పాఠ్య పుస్తకాలు అమ్మారు ఎందుకో ఆపివేశారు పంపిణీవిధానంలో లోపంవల్ల పుస్తకాలు సరిగా అందడంలేదని విమర్శలు బయలుదేరాయి ఆయా పాఠశాలల హెడ్మాస్టర్లు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్లనుంచి పుస్తకాలు తెచ్చుకోవాలి రవాణా ఛార్జీలు హెడ్‌మాస్టర్లు భరించాలి. అంతేకాక పుస్తకాల ఖరీదు మొత్తం మొదటే చెల్లించాలి. ఈ బాధ హెడ్‌మాస్టర్లు పడలేక మౌనంగావున్నారు సకాలానికి పుస్తకాలు ముద్రణ కాకున్నా, ముద్రణ అయి పంపిణీ సరిగా కాకున్నా బాధపడేవారు విద్యార్థులే, ముల్లు అరిటాకు సామెతగా ఇంతకూ ఏటా ఈ బాదెందుకో నాకు అర్థంకావడంలేదు కొన్ని విషయాలలో పెద్ద మార్పులేమీ వుండవు అలాంటి విషయాల పాఠ్యగ్రంథాలు ఒకేమారు ముద్రించి పెట్టుకోవచ్చుగదా ! భాష, లెక్కలు, విజ్ఞానశాస్త్రం, భూగోళం వంటి విషయాల పాఠ్యపుస్తకాలు ఏటా మార్చడం అవసరమా ? చరిత్ర, నేటి రాజకీయ పరిస్థితినిబట్టి మారుతుందనుకుందాము. అంతగా మారని విషయాల గ్రంథాలు ఐదేళ్లపాటువాడటానికి వీలుగావిరాళంగా అచ్చువేసి పెట్టుకోవచ్చుగదా ! ఆలస్యంగా పాఠ్యగ్రంథాలు అందడం, పాఠ్యవిషయాలు పూర్తికాకపోవడం, విద్యార్థులు సరిగా పరీక్షలలో వ్రాయకపోవడం, కాపీ కొట్టడానికి ప్రయత్నించడం, గ్రేసు మార్కులు చేర్చాలని తలిదండ్రులు ప్రభుత్వం వద్దకు రాయబారాలు వెళ్లడం మొదలయిన శృంఖలా సంఘటనలు తప్పుతాయిగదా !

### దంతశిల్ప ప్రదర్శనం

కళ మానవునితోపాటే పుట్టి పెరిగింది మానవునితోపాటే అనడం కన్నా ప్రాణి సామాన్యంతోనే పుట్టి పెరిగింది అంటే సమంజసమేమో ! ఎందుకంటే ఇతర ప్రాణులు జిగాడు, బీవర్ వంటి పక్షులు, జల జంతువులు తమ గూళ్లను కట్టుకొనడం చూచినప్పుడు వాటికి కూడ సౌందర్య దృష్టి ఉన్నదా ? అనిపిస్తుంది. కాని అవి ఆత్మరక్షణకు చేసుకొనే ప్రయత్నాలలో గూళ్ళ నిర్మాణం భాగం గనుక కళాదృష్టి అని స్పష్టంగా చెప్పలేము కాని, మానవుని స్వభావం అలాటిది కాదు అతడు తన అవసరాలు తీరిన తర్వాత వినోద విలాసాలకోసం తపించాడు. ఆ తపనే కళగా, శాస్త్రంగా, తత్త్వజిజ్ఞాసగా పరిణమించింది ఆదిమానవుడు తన కళకు ఎన్నుకున్న ఆధారాలు ఎముకలు, దంతాలు, గుహల గోడలు అనవచ్చు తాను పోరాడిన, పెంచిన జంతువుల ఎముకల మీద, దంతాల మీద తన అస్తవ్యస్తమైన, అస్పష్టమైన భావాలు దించాడు ఆ ఎముకలలో, దంతాలలో ఏనుగు దంతం క్రమంగా ప్రాముఖ్యం వహించింది, చాలకాలం చెడకుండా వుండడాన్నిబట్టి. ఈ దంతం ప్రాచ్యదేశ శిల్పులను విశేషంగా ఆకర్షించింది అపూర్వ కళావైభవానికి కారణమయింది ఇలాటి దంత శిల్పాల ప్రదర్శనం జూన్ రెండు మూడు వారాల్లో సాలార్‌జంగ్ మ్యూజియంలో జరిగింది మ్యూజియం లోని వివిధ భాగాలలో వున్న వివిధ ప్రాచ్యదేశాల దంత శిల్పాలను ఈ ప్రదర్శనంలో వుంచారు ఈ ప్రదర్శనంలో చైనా, జపాన్, బర్మా, భారతదేశాల 15–19 శతాబ్దాల 77 శిల్పాలున్నాయి ప్రదర్శితమైన 24 చైనా శిల్పాలలో భక్తులతో వున్న బోధసత్త్వుని విగ్రహం ప్రేక్షకుల మనస్సును విశేషంగా ఆకర్షించింది చైనాకు చెందిన మరి రెండు బోధిసత్త్వుని విగ్రహాలు, చైనా పురాణ పురుషుల విగ్రహాలు, ఒకే దంతంపై చెక్కిన పడవ, దంతంతో చేసిన పూలచెండ్లు చాల ఆహ్లాదం కలిగించాయి. జపాన్ దేశానికి చెందిన 21 శిల్పాలలో వివిధ భంగిమలలో వున్న గెయిషాల శిల్పాలు ఆకర్షణీయంగా వున్నాయి బర్మా శిల్పాలలో బుద్ధుని వివిధ భంగిమల్లో చెక్కిన ఏకదంత శిల్పం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించింది. ఇది పందొమ్మిదో శతాబ్దం శిల్పం. ఈ శతాబ్దానికే చెందిన బర్మా నర్తకి శిల్పం కూడా ప్రజలను ఆకర్షించింది భారత దేశానికి చెందిన శిల్పాలలో ఒకే దంతంతో చేసిన రాజు నౌకా విహారం, దంతపు విసనకర్ర చూపరులను ఆశ్చర్యచకితులను చేశాయి అంబారీ ఏనుగు, మొగల్‌రాజు, రాణి విగ్రహాలు సమకాలిక ఆహార్య వైభవాన్ని తెలుపుతాయి గోవా దంత శిల్పాలలో క్రైస్తవ మతానికి చెందినవి చాల వున్నాయి మొత్తంమీద ఏ శిల్ప ఖండమూ కళా దృష్టితో తక్కువయినది కాదు. ఈ ప్రదర్శనను ఏర్పాటు చేసిన సాలార్‌జంగ్ మ్యూజియం నిర్వాహకులను, ముఖ్యంగా డైరెక్టర్ డాక్టర్ నిగంను మనసారా అభినందిస్తున్నాను.

### ప్రభాకర్ జీకి జోహార్లు :

"ప్రభాకర్‌జీ తక్కువ మాటలు, ఎక్కువ చేతలను నమ్మేవారు ఆయన జీవిత చరిత్రను ప్రచురించడానికి ముగ్గురితో ఒక సంఘాన్ని నియమించాలి" అని సర్వోదయ నాయకుడు ప్రభాకర్‌జీ నాల్గవ వర్థంతి సభలో అధ్యక్షత వహించిన మాజీ గవర్నర్ మీర్ అక్బర్ అలీఖాన్

గంగాధరం సాహితీ కుటుంబం నిర్వహించిన నూతలపాటి సాహితీ సత్కారసభలో అధ్యక్షోపన్యాసం యిస్తున్న డా ఇరివెంటి కృష్ణమూర్తి, శ్రీయుతులు నూతలపాటి మునుస్వామినాయుడు, పి రాజగోపాలనాయుడు, ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, సన్మానగ్రహీత, "స్పందన" నవల రచయిత శ్రీ మంధా వెంకటరమణారావుగార్లని చిత్రంలో చూడవచ్చు.






## హైదరాబాద్ నోట్ బుక్

సూచించారు ఈ సభ సర్వోదయ కేంద్రం శివరాంపల్లిలోని గ్రామ సేవాకేంద్రం వద్ద వున్న ప్రభాకర్ జీ సమాధి వద్ద జరిగింది మాజీ మంత్రులు శ్రీ ఎం వి కృష్ణారావు, శ్రీ మూర్తి రాజు, శ్రీ కె శేషగిరిరావు శ్రీ ప్రభాకర్ జీ సేవా నిరతిని, సచ్ఛీలాన్ని ప్రశంసిస్తూ ప్రసంగించారు శివరాంపల్లి ట్రస్ట్ మ్యానేజింగ్ ట్రస్టీ శ్రీ టి ఎల్ కపాడియా వందన సమర్పణతో వర్ధంతి సభ సమాప్తమైంది

### రావి నారాయణరెడ్డికి సన్మానం

శ్రీ రావి నారాయణరెడ్డి 76వ జన్మ దినోత్సవం సందర్భంగా గాంధీ భవన్ హాలులో జూన్ 4వ తేదీన జరిగిన సభలో పలువురు వక్తలు శ్రీ రావి నారాయణరెడ్డిని ప్రశంసించారు తెలంగాణా సాయుధ సమరవీరుడు, భారత స్వాతంత్ర్య సమరయోధుడు అయిన నారాయణ రెడ్డికి ప్రముఖ చిత్రకారుడు శ్రీ కొండపల్లి శేషగిరిరావు నిర్మించిన చిత్రాన్ని ఉత్సవ నిర్వాహక సంఘం బహూకరించింది వివిధ రాజకీయ పక్షాల నాయకులు శ్రీ రావి నారాయణరెడ్డిని ప్రశంసించారు వివిధ సంస్థలు ఆయనను పూలదండలతో సత్కరించాయి ఈ సన్మాన సభకు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ విజయకుమార్ సిన్హా అధ్యక్షత వహించారు శ్రీ నారాయణరెడ్డి పేరిట ఒక ఫౌండేషన్ నెలకొల్పి ప్రతి ఏటా ఆయన సిద్ధాంతాలపై ఉపన్యాసాలు ఏర్పాటు చేయడానికి నిర్ణయం జరిగింది దీని నిధి లక్ష రూపాయల్లో 50 వేల వరకు ఇందిరా కాంగ్రెస్ వసూలు చేసి ఇస్తుందని ఇందిరా కాంగ్రెస్ ఆంధ్రప్రదేశ్ శాఖ అధ్యక్షుడు ప్రకటించాడు శ్రీ రావి నారాయణరెడ్డి తనను అభినందించిన వారందరికీ కృతజ్ఞత తెలిపారు

### ఉపశ్రుతి :

ఇటీవల హఠాత్తుగా శ్రీ దాశరథి కనిపించారు కనబడగానే ఒక నోటు బుక్కులో ఏదో వ్రాసి ముందుకు చాపారు ఏమిటిది? కృష్ణశాస్త్రి గారి పద్ధతి అనుసరించారే అన్నాను వాగుడు ఎక్కువైంది మౌనంగా వుండమన్నాడు డాక్టరు— అన్నారు శ్రీ దాశరథి విభూషణం మౌనము పండితానాం అన్నాడు గాని భర్తృహరి, మీబోటి వారికి కాదే!— అన్నాను ఎవరు పండితులు, ఎవరు అపండితులు అనే అర్థంలో ఆకాశానికి చేతులెత్తారు దాశరథి, భగవంతుడొకడే సర్వజ్ఞుడు అన్నట్టు

— తిరుమల రామచంద్ర ★

*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3 Editor S Radhakrishna*

